# జోక్స్ వరల్డ్

55 బొమ్మలతో మీ హృదయాలను పరవశింపజేసే బెస్ట్ జోక్స్



గుత్తుల శ్రీనివాసరావు

**నవరత్న బుక్ సెంటర్**

కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 2

**జోక్స్‌వరల్డ్**

రచన :

**గుత్తుల శ్రీనివాసరావు**

ప్రథమముద్రణ :

**జనవరి : 2000**

ముఖచిత్రం :

**రమణ**



ప్రచురణ హక్కులు :

**బి.కె.ఆర్.మూర్తి**

28-22-20 : రహిమాన్ వీధి

అరండల్ పేట, విజయవాడ - 520 002

ఫోన్ : 432813

టైప్ సెట్టింగ్

**విజయ గ్రాఫిక్స్**

అరండల్ పేట, విజయవాడ - 520 002

ఫోన్ : 431337

ప్రింటర్స్

**వాసు ఆఫ్‌సెట్‌ప్రింటర్స్**

అరండల్ పేట, విజయవాడ - 520 002.

వెల : 35-00



# కృతజ్ఞతలు

నన్ను ప్రోత్సహించి నా జోక్స్‌ను పుస్తక రూపాన్ని ఇస్తున్న **'నవరత్న బుక్ సెంటర్'** వారికి, నా రచనా రంగప్రవేశం తొలిదశలో ప్రతి రచనను ఆంధ్రభూమి వారపత్రికలో ప్రచురించి నాకంటూ రచయితగా ప్రత్యేక స్థానాన్ని సృష్టించిన **ఆంధ్రభూమి వీక్లీ** మాజీ ఎడిటర్ **శ్రీ సి. కనకంబర రాజు** గారికి, నా నవ్వులో భాగం పంచుకొంటూ ప్రతి క్షణం నవ్వుతూ నవ్వించే నా చిన్ననాటి స్నేహితుడు **శ్రీ మట్టపర్తి శ్రీనివాస్** (ఎలక్ట్రానిక్స్ ఇంజనీర్) కూ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇందులోని సేకరణ జోక్స్ రచయితలకూ, పుస్తకాన్ని చదవబోతున్న హాస్యప్రియులకూ నా ప్రత్యేక కృతజ్ఞతలు.......

రచయిత

గుత్తుల శ్రీనివాసరావు


మీ అభిప్రాయాలు పంపదగిన నా చిరునామా :-

**గుత్తుల శ్రీనివాసరావు** (కార్టునిస్ట్ కామెడీరైటర్),

దొంతికుర్రు (పోస్టు),

కాట్రేనికోన మండలం,

తూ॥ గో॥ జిల్లా - 533 212

## హాస్య ప్రియులూ...! ఒక్క నిముషమండీ....!



మీరంతా ఇందులోని హాస్య రసాన్ని సేవించేముందు నాతో కొద్ది క్షణాల పాటు నా మాటలు వినండిసార్...!

నవరసాల్లో కొంతమందికి కరుణ, కొంతమందికి రౌద్రం, కొంతమందికి శృంగారం ఇలా ఒక్కొక్కరికీ ఒకో రసం ప్రత్యేక ఇష్టం. కాని అన్ని వేళలా, అందరికీ కావలసిందీ, అందరినీ అలరించేది కేవలం హాస్యరసం మాత్రమే. అందుకే నవరసాల్లో హాస్యానికి పెద్ద పీట వేసారు.

కాని వెనుకటికెవరో నవ్వు నాలుగు విధాలచేటు అన్నారట. కాని ఇపుడు లోకమంతా నవ్వు నాలుగు విధాల గ్రేటు అని ఒప్పకుంటున్నారు.

ప్రపంచ వ్యాప్తంగా ఎంతోమంది డాక్టర్లు పరిశోధనలు చేసి నవ్వడం వల్ల మనిషికి శారీరక ఆరోగ్యం, మానసిక ఉల్లాసం చేకూరతాయని అందుకే 'నవ్వు - నవ్వించు - నవ్వుతూనే జీవించు' అని నొక్కి వక్కాణిస్తున్నారు.

జోకులు చాలా రకాలు. కొన్ని మామూలుగా నవ్విస్తాయి. కొన్ని బిగ్గరగా నవ్విస్తాయి.

మీరంతా ఇందులోపడీ నవ్వేలా చేస్తాయి. అవే మళ్ళీ మళ్ళీ గుర్తుకు వచ్చి మనలో మనం నవ్వుకునేలా చేస్తాయి. ఖచ్చితంగా ఇలాంటి ఎ-1 జోక్సనే ఈ బుక్‌లో పొందుపరచడం జరిగింది. నేనింత వరకూ ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, స్వాతి, మయూరి వారపత్రికల్లో దాదాపు వెయ్యి జోక్స్ వ్రాయడం జరిగింది. వాటిలోని బెస్ట్ జోక్స్‌కు, మరికొన్ని సేకరణ జోక్స్ జోడించి ఈ నవ్వుల ఖజానా మీకోసం అందిస్తున్నాం.

అంతేకాదు ప్రపంచంలో చాలామంది ప్రతి క్షణం ఏదొక సమస్యతో సతమతమై పోతూ ఉంటారు.

అందమైన అరుణ మీ లవ్‌ని తిరస్కరించి చాచి చెంపమీద కొట్టి ఉండొచ్చు, మీరు ఫైల్ సరిగా క్లియర్ చేయలేదని బాస్ భీబత్సం చేసి ఉండొచ్చు, ఇంట్లో ఇల్లాలు నెలజీతం మొత్తం పెట్టేసి పట్టుచీర కొనేసి మీకు పెద్ద తలనొప్పి తెప్పించి ఉండొచ్చు, కాలేజీలో లెక్చరర్లు మీ బుర్రలోకి పాఠాల మీద పాఠాలు తోసేసి బుర్ర వేడెక్కించేసి ఉండొచ్చు. బహిరంగ సభల్లో రాజకీయ నాయకులు మీ మెదడు మేసేసి ఉండొచ్చు. ఎవరికోసమో గంటలు తరబడి ఓ చోట కూర్చొని ఎదురు చూస్తుంటే మీకు బాగా బోర్ కొడుతూ ఉండొచ్చు. ఇంతే కాదు ఇలాంటి సమస్యలు ఏవి ఎదురైనా మీకోసం రెడీగా ఉండే మా టానిక్ జోక్స్ వరల్డ్‌ని చేతిలోకి తీసుకోండి అంతే...! మీ సమస్యల్ని కనీసం తాత్కాలికంగానైనా దూరం చేసుకొని మీరిక నవ్వడం మొదలెడతారు.

అంతేకాదు. చాలామంది నలుగురిలోకి వెళ్ళినపుడు ఏం మాట్లాడాలో తెలియక మౌనంగా కూర్చొని ఉంటారు. అలాంటి వారు ఇందులోని కొన్ని జోక్స్ సెలెక్ట్ చేసుకొని నలుగురుకీ చెప్పి తాము నవ్వి, ఎదుటివార్ని నవ్వించి చాలా సరదాగా గడొపొచ్చు. మరి ఆలస్యం చేయకుండా జోక్స్ చెప్పడాన్ని హాబీగా తీసుకుంటారు కదూ...!

చివరిగా ఓ మాట. ఈ పుస్తకం నా తొలి ప్రయత్నం. ఇందులో. నాకు తెలీకుండా ఏమైనా పొరబాట్లు దొర్లితే పెద్ద మనసుతో క్షమించండి. అంతే కాదు మీ అమూల్యమైన అభిప్రాయాలూ, సలహాలూ నా చిరునామాకు తెలియచేస్తూ మరో మంచి పుస్తకానికి నన్ను సృష్టికర్తను చేస్తారని ఆశిస్తున్నాను.

– రచయిత.

1. అది అమలాపురం బస్టాండు. మంగతాయారు కొత్తగూడెం వెళ్ళే బస్సు కోసం ఎదురు చూస్తోంది. బస్సు రావడానికి ఇంకా టైం ఉంది. పైగా ఆమెకు ఏమీ తోచక ప్రక్కనే ఉన్న వెయిటింగ్ మిషన్ దగ్గరకెళ్ళి దాని మీద నిలబడి ఓ కాయిన్ వేసింది. ఒక కార్డు వచ్చింది. దాని మీద "మీ పేరు మంగతాయారు. మీ బరువు 60 కిలోలు.



మీరు కొత్తగూడెం వెళ్ళే బస్సుకోసం ఎదురు చూస్తున్నారు...." అని ఉంది. ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. అంతలో మరొకతను వచ్చి ఓ కాయిను వేశాడు. కార్డు వచ్చింది. దానిమీద "మీ పేరు సత్తిబాబు. మీది దొంతికుర్రు. మీరు మీ మెడికల్ షాపులో మందులకోసం విజయవాడ వెళ్తున్నారు...." అని ఉంది. అతనూ ఆశ్చర్యపోయాడు.

మంగతాయారు చూస్తుండగా అలా మరో ఇద్దరు కాయిన్స్ వేసి కార్డులు తీసుకున్నారు. అన్నీ కరెక్టుగా వచ్చాయి. కాని ఇవన్నీ ఎలా వస్తున్నాయో అర్థంకాక మంగతాయారు బాగా ఆలోచించి అందులో కిటుకు తెలుసుకోవాలని బట్టలు మార్చుకొని వచ్చి మళ్ళీ కాయిన్ వేసింది. కార్డు వచ్చింది. అందులో ఇలా ఉంది. "మీ పేరు మంగతాయారు. మీ బరువు 60 కిలోలు. మీరు కొత్తగూడెం వెళ్ళే బస్సు కోసం ఎదరు చూస్తున్నారు. కాని మీ దురదృష్టం. కొత్తగూడెం వెళ్ళే ఆ ఒకే ఒక్క బస్సు ఇప్పుడే వెళ్ళిపోయింది...' '

అంతే...! మంగతాయారుకు మూర్ఛ వచ్చినంత పనయింది.❑



2. ఓ వ్యక్తి పక్షులను అమ్మేషాపు కెళ్ళి రామచిలుకను చూపించమన్నాడు. షాపు యజమాని ఒక చిలుకను తీసి "ఇది చూడండి. ఈ రామచిలుక చూడ్డానికి ఎంత బాగుందో అంత బాగా మాట్లాడుతుంది. దీని కుడికాలు పైకి ఎత్తితే 'నమస్కారమండీ' అంటుంది. ఎడమకాలు పైకి ఎత్తితే 'రండి. స్వాగతం' అంటుంది..." అంటూ వివరించాడు. "మరి రెండు కాళ్ళూ ఒకేసారి ఎత్తితే...?" సందేహంగా అడిగాడా వ్యక్తి.

"నోర్మూయ్యరా...! బుద్ధిలేని వెధవా...!! రెండు కాళ్ళూ పైకి ఎత్తితే కింద పడతాను...." ఠక్కున చెప్పింది రామచిలుక. ❑

3. "సార్...! కారు కింద పడకుండా మీ ప్రాణాలకు తెగించి మా తమ్ముణ్ణి కాపాడి వాడికి పునర్జన్మ ప్రసాదించింది మీరేనా...?" అడిగాడు ఆనందరావు. "ఔనండీ...! ఇప్పుడెలా ఉన్నాడు...? కులాసాయేనా...?' ' ఆత్రంగా అడిగాడు అర్జునరావు. "కులాసాయే కానీ వాడి జేబులో ఓ పది రూపాయల నోటు ఉండాలి. మీరు గాని తీశారా...?" నిలదీశాడు ఆనందరావు. ❑

4. ఓ పల్లెటూరివాడు పనిమీద హైదరాబాద్ వెళ్ళాడు. తీరా అక్కడికెళ్ళాక అతనికి సిన్మా యాక్టర్ల ఇళ్ళు చూడాలనిపించి ఫిలిం నగర్ వెళ్ళాడు. అక్కడ ఒకతన్ని పిలచి "బాబూ...! చిరంజీవి ఇల్లెక్కడ...?" అనడిగాడు.

"రాజేంద్రప్రసాద్ ఇంటి ప్రక్కన..." అని చెప్పేసి వెళ్ళిపోయాడతను. మళ్ళీ ఇంకొక అతన్ని ఆపి "ఏవండీ...! రాజేంద్రప్రసాద్ ఇల్లెక్కడ...?" అనడిగాడు.

"ఆమాత్రం తెలీదా...! చిరంజీవి ఇంటి ప్రక్కనే.... అనేసి అతనూ వెళ్ళిపోయాడు. పల్లెటూరి వాడికి చిర్రెత్తుకొచ్చింది. ఎవడూ సరిగ్గా

సమాధానం చెప్పట్లేదని మరొక అతన్ని ఆపి "సారూ...! చిరంజీవి ఇల్లు. రాజేంద్రప్రసాద్ ఇల్లు ఎక్కడో కాస్త వివరంగా చెపుతారా...?" అన్నాడు తెలివిగా.

"భలే వాడివే...! ఇందులో వివరించడానికేముంది...? వాళ్ళిద్దరి ఇళ్ళూ ప్రక్క ప్రక్కనే..." అనేసి అతనూ వెళ్ళిపోయాడు. పల్లెటూరి వాడు ఇంకెవర్నీ అడగలేదు. ❑

5. "వాడికన్నీ నా పోలికలే వచ్చాయి.... "కొడుకుని చూసి మురిసిపోతూ అన్నాడు తండ్రి. "అందుకే రోజు నా చేత తిట్లు తింటాడు....." అంది భార్య. ❑

6. కానిస్టేబుల్స్ నియామకానికి ఇంటర్వ్యూ జరుగుతోంది. అధికారి నాగరాజును ఇంర్వ్యూ చేస్తున్నాడు.
"చూడు మిస్టర్ నాగరాజూ...! ఒక చోట మర్డర్ జ.రగబోతోందనుకో.. అప్పుడు నువ్వు ఏం చేస్తావ్....?"
"వెళ్ళి మర్డర్ చేయబోయే వాణ్ని వారిస్తాను....."
"ఒక వేళ నీవెంత వారించినా అతను ఖచ్చితంగా మర్డర్ చేస్తానంటే...?"
"అతన్ని గట్టిగా వాటేసుకుని హత్య కాబడుతున్న వాణ్ని పారిపొమ్మంటాను...."
"ఒక వేళ హత్య చేయబడేవాడు పారిపోయే లోగా హత్యచేసేవాడు నిన్ను దూరంగా నెట్టేసి మళ్ళీ అతని మీద దూకితే ఏం చేస్తావ్...?
"ఏదో విధంగా అక్కడకు నా భార్యను రప్పిస్తానండీ....!"
" నీ భార్యా....! అక్కడకు ఆవిడ వచ్చి ఏం చేస్తుంది....?"
"ఎప్పటి నుండో హత్య జరిగే సన్నివేశం చూడాలని మా ఆవిడకి చాలా సరదా.....! ❑

7. భట్నా విల్లిలో రోడ్డుమీద నడుస్తున్నారు చెంచు రామయ్య, చుంచు రామయ్య వాళ్ళు సరిగ్గా సీతారామయ్య పాన్ షాపు దగ్గరకు రాగానే

"ఏవోయ్....! రెండు సిగరెట్లు తీసుకుని కాలుద్దామా...?" అన్నాడు చెంచురామయ్య.

"బాబోయ్...! అన్ని వేలు ఖర్చా...! వద్దు బాబోయ్...!" అన్నాడు చుంచురామయ్య.

"ఏమిటీ...! రెండు సిగరెట్టకు వేలు ఖర్చెందుకు? రెండు రూపాయలు చాలు కదా...!" ఆశ్చర్యంగా అన్నాడు చెంచురామయ్య.

"భలేవాడివే....! సిగరెట్టు కాలిస్తే దగ్గు, ఆయాసం వస్తుంది. వాటిని చికిత్స కోసం డాక్టరు దగ్గరకెళ్తే ఎక్సరేలు, బ్లడ్ టెస్టులు తీయించి కేన్సర్ అంటాడు. కేన్సర్ నయం చేయించడానికి వేలకొద్దీ రూపాయలు ఖర్చు కావా మరి...!" దురాలోచనతో అన్నాడు చుంచురామయ్య. ❑

8. ఓ తల్లి, కూతురు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. రైలు సరిగ్గా రాజమండ్రి ప్లాట్ ఫాం మీదకు వచ్చి ఆగింది. ఐదు నిముషాల తర్వాత తల్లితో కూతురు భోగీలోంచి బయటికి చూస్తూ అంది.

"అమ్మా....! అక్కడి బెంచి మీద కూర్చున్న ఉంగరాల జుట్టు కుర్రాడు నన్ను చూసి నవ్వుతూ వెకిలి చేష్టలు చేస్తున్నాడు....."

"ఈ కుర్రాళ్లంతా అంతేనమ్మా....! అయినా నువ్వు అసలు వాడి మొఖం వైపు చూడకు. వాడూ నిన్ను చూడ్డం మానేస్తాడు...." అంది తల్లి.

కాసేపటి తర్వాత మళ్ళీ కూతురు అంది.

"ఆ కుర్రాడు ఇంకా నన్నే చూస్తూన్నాడమ్మా....!"

నిన్నటు చూడవద్దని చెప్పానుగా......."

"నేను చూడ్డం లేదు. కాని తను మాత్రం నన్ను చూస్తున్నాడు...." చెప్పింది కూతురు. ❑

9. సుందర్రామయ్య ఇల్లు ఎప్పుడూ బంధువులతో నిండి ఉండేది. ప్రతి రోజూ ఆయన ఇంట్లో పదిమందికైనా భోజనాలు తయారయ్యేవి. అలాంటిది ఈ మధ్య ఆయ నింట్లో ఒక్క బంధువూ కనిపించకపోయే సరికి ఆశ్చర్యంగా "సుందర్రామయ్యా.....! మీ బంధువులకి ఏంమంత్రం

ఁశావోయ్....? ఈ మధ్య ఒక్కడు కూడా మీ యింట్లో కనిపించడం ఁదు....?" అనడిగాడు ఆనందరావు.

'ఏముందీ..! నేను మా యింటి కొచ్చే ధనిక బంధువుల వద్ద బాగా ుప్పులు చేసేశాను. ఆ డబ్బంతా పేద బంధువులకు అప్పిచ్చాను. ుంతే..! ఆ దెబ్బతో ఇంకా డబ్బు అడుగుతానేమోనని ధనిక ంధువులు, తీసుకున్న డబ్బు చెల్లించాలేమోనని పేద బంధువులు ుా యింటికి రావడం మానేశారు..." అంటూ అసలు విషయం ెప్పాడు సుందర్రామయ్య. ❑

రవీ..! మా నాన్నగారు ఢిల్లీనుండి స్పెషల్ టాబ్లెట్లు తెప్పించారు. ివి నోట్లో వేస్కుంటే..." ఎలాంటి వాళ్ళైనా నిజం చెప్పేస్తారు అన్నాడు ారి.

అలాగైతే నాకూ రెండు ాబ్లెట్లు ఇవ్వు చూస్తాను..." న్నాడు రవి. హరి టాబ్లెట్లు చ్చాక రవి అవి నోట్లో స్కుని "ఛా.... ఇవి పిప్పర ంట్లు..." అన్నాడు.



ుాశావా...! చూశావా...! అవి నోట్లో పడ్డాయో, లేదో అప్పుడే నువ్వు జం చెప్పేశావు...." అన్నాడు హరి. ❑

ంహ్మానందం తన కొడుకు దొరబాబుని తీసుకొని బంధువులింటికి ళ్ళాడు. అక్కడ బంధువులు వీళ్ళకి ఎన్నో మర్యాదలు చేశారు. రబాబు కోసం బిస్కట్లు, చాక్లెట్లు, ఐస్ క్రీంలు పెట్టారు. దొరబాబుకి స్క్రీంలు బాగా ఇష్టం కావడంతో ఐస్క్రీంలు అన్నీ తినేశాడు. మళ్ళీ ంట్లో ఐస్క్రీం తెచ్చుకుని తిన్నాడు. అది అయిపోయాక మళ్లి వెళ్ళి చ్చుకుని తిన్నాడు. అలా ఎనిమిది సార్లు తెచ్చుకున్నాడు తొమ్మిదో

సారి వెళ్ళబోతుంటే బ్రహ్మానందం కోపంగా "దొరా..! నీకసలు బుద్ధుందా? నువ్వు ఇలా ఐస్‌క్రీంలు తెచ్చుకుని తినేస్తుంటే లోపల ఆంటీగారు ఏమనుకుంటారు. నిన్ను తిండిపోతూ అని అనుకోరూ....!" అన్నాడు.

"అనుకోరు నాన్నా....! ఎందుకంటే ఇప్పుడు తెచ్చినవన్నీ మానాన్న తీసుకు రమ్మన్నారు. ఆయనకి ఐస్‌క్రీంలు ఇష్టం' అని చెప్పి తెచ్చాను నాన్నా...!!" అంటూ మళ్లీ పరుగెత్తాడు దొరబాబు. ❑

12. రాజేష్, ముఖేస్ ఒక చోట కూర్చుని గొప్పలు మాట్లాడు కుంటూన్నరు. "రాజేష్...! నేను మొన్న సముద్రం దగ్గరకెళ్ళి గాలం వేసాను. అంతే....! ఒక చేప గాలంలో చిక్కుకుంది. దాని బరువు రెండు టన్నులు. అది బంగారం రంగులో కాంతివంతంగా మెరిసిపోతుంది. దాని పొడవు వంద అడుగులు పైనే ఉంటుంది. చూసిన వాళ్ళంతా దానిని అద్భుతం అన్నారు" అన్నాడు ముఖేస్.

"దానిదేముంది గాలంలో చేపలు చాలా చిక్కుకుని ఉంటాయి. కాని నేనైతే మొన్న మా బావిలో గాలం వేశాను. మా బావిలోతు తెలుసుకదా...! ఇరవైమైళ్లు. గాలం బావి అడుగు వరకు వెళ్ళిపోయింది. దానికొక లాంతరు తగిలింది. దానికి ఒక చీటికూడా కట్టి ఉంది. అందులో ఆ లాంతరు అశోకుడు కళింగయుద్ధంలో పాల్గొన్న నాటిదిగా రాసి ఉంది ఇది ఇంకా వెలుగుతూనే ఉంది. దాని వెలుగుతోనే రాత్రి ఒక నవల కూడా చదివాను....." అంటూ పూర్తిచేశాడు.

ఐదు నిముసాలు మౌనంగా గడిచింది. ఆ తర్వాత రాజేష్ అన్నాడు. "నేను ఒకటన్ను బరువు తగ్గించేస్తాను నీలాంతరు నిన్నటితో ఆరిపోయిందని చెప్పు. అలా అయితే మనం చెప్పేవి వాస్తవానికి కొంతైనా దగ్గరగా ఉంటాయి..." ❑

13. జగ్గారావు పొడుగ్గా నెత్తిటోపీ పెట్టుకుని ఉంటాడు. ఒకసారి అతను సినిమా చూడ్డానికి దియేటర్‌కు వెళ్ళి శ్రద్ధగా సినిమా చూస్తున్నాడు. కాసేపటి తర్వాత ఏదో గుర్తొచ్చినట్లు వెనక్కి తిరిగి చూశాడు. వెనకసీట్లో ఒకావిడ కూర్చొనిఉంది.



"మేడమ్....! మీరు సినిమా చూడ్డానికి నాటోపీ అడ్డుగా ఉంటే చెప్పండి. టోపీ తీసి పక్కన పెడతాను...." అన్నాడు జగ్గారావు.

"అబ్బే....! లేదండీ...! కాకపోతే మీ తల మాత్రం అడ్డుగా ఉంది...." అందావిడ.

14. బొడసకుర్రు గ్రామానికి ఊరిచివర ఒక చెరువు ఉంది. ఆ చెరువు గట్టుమీద కూర్చొని గాలం వేస్తున్నాడు గంగరాజు. పొద్దుట నుండి సాయంత్రం వరకూ చేపలు పట్టడానికి ఎన్నోపాట్లు పడాడు. కాని సాయంత్రంమైపోయినా గాలంలో ఒక్కచేపకూడా పడ్లేదు. ఇదంతా కాస్త దూరం నుండి గమనిస్తున్న జగన్నాథం దగ్గర కొచ్చి "చూడు గంగరాజూ....! నీకసలు కాలం విలువ తెలియడం లేదు. పొద్దున్న నుండి ఇంత కష్టపడ్డావు. ఫలితం ఏమిటి.....? గాలంలో ఒక్క చేపకూడా పడ్లేదు. ఈ కాలాన్ని నీవువేరే ఏదైనా పనికి ఉపయోగించి ఉంటే మంచి ఫలితం దక్కేదిగా....." అన్నాడు వ్యగ్యంగా. గంగరాజు ఆయన్ని ఒకసారి ఎగాదిగా, చూసి ఔనండీ.....! నే చేతకాని వెధవనే...! నాకు కాలం విలువ అసలు తెలియదు. మరి మీ సంగతేమిటి? నేనేదో పోట్లాడుతుంటా ఏ పనీ చూసుకోకుండా మీరు నన్నే ఎందుకు గమనిస్తూ కూర్చున్నారు?

నాతోబాటు అనవసరంగా మీరూ సమయం వృధా చేశారుగా...."

అన్నాడు. జగన్నాథం మారు మాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ❑

15. కోర్టులో కేసు విచారణ జరుగుతుంది. జడ్జిగారు బోనులో అమ్మాయిని అడిగారు.

"చూడమ్మాయీ....! నిందుతుడు నిన్ను రేప్ చేశాడంటూన్నావు. ఆ సమయంలో అతన్ని నీవు వారించే ప్రయత్నమైనా చేయలేదా....?

"లేదుసార్....! మా అమ్మ అస్తమానం అంటూంటుంది. పరాయి మగాళ్ళతో మాట్లాడ్డం తప్పని అందుకే అతనితో ఏమీ అనలేదు....." చెప్పిందా అమ్మాయి. ❑

16. "డాక్టర్ గారూ....! నాకు మతి మరుపు మరీ ఎక్కువైపోతుంది. దీని వల్ల ఎన్నో ఇబ్బందులకు కూడా గురౌతున్నాను....." డాక్టర్‌తో చెప్పాడు పేషెంట్.

"ఎలాంటి ఇబ్బందులకు గురువుతున్నారు......." అడిగాడు డాక్టర్.

"మొన్న ఆఫీసు పని అయిపోయాక మా మేనేజర్ ఇంటికి వెళ్ళి డైనింగ్ టేబుల్ ముందు కూర్చొని ఒసేయ్.....! త్వరగా అన్నం వడ్డించు అన్నాను. దాంతో ఆవిడ అప్పడాల కఱ్ఱ తీస్కుని చితక్కొంట్టింది. నిన్న ఫేంటు వేసుకోకుండా ఆఫీసుకు వెళ్తే ఆపీసులో నన్ను చూసి అందరూ చూసి నవ్వుతుంటే బెంబేలెత్తిపోయాను......"

"అలాగా...! మీకు తప్పక ట్రీట్‌మెంట్ చేస్తాను. కాకపోతే నా ఫీజు మాత్రం ముందుగా ఇచ్చేయాలి......." ముందు జాగ్రత్తగా ఆలోచించి చెప్పాడు డాక్టర్. ❑

17. చాలాకాలం తర్వాత చిన్ననాటి స్నేహితులైనటువంటి బాబూరావు, కన్నారావు కలుసుకున్నారు.కష్టసుఖాలు మాట్లాడుకోసాగారు.

"ఏరా బాబూరావు.. నీ కెంతమంది పిల్లలు....?"

"ముగ్గురు. ముగ్గురు మగపిల్లలే......!"

"అలాగా...! చాలా సంతోషం, ఎంతవరకూ చదువుకున్నారు.....?"

"పెద్దవాడు ఎమ్.ఎ.లిటరేచర్, రెండోవాడు ఎమ్.ఎస్.సి. చదివాడు. ఎటొచ్చీ మూడో వాడికి మాత్రం అస్సలు చదువబ్బలేదురా....!"

"మరైతే వాణ్ణి ఇంట్లోంచి బయటకు గెంటేయలేకపోయావా....?"

"ఇప్పుడు మా కుటుంబం మొత్తం మా మూడోవాడి సంపాదన మీదే ఆధారపడి బతుకుతున్నాముురా....." ❑

18. అర్జునరావు ఆఫీసు అయిపోయాక టేబుల్ ముందు కూర్చొని విపరీతంగా మందుకొట్టసాగాడు.

"ఎందుకురా....! అంతవిపరీతంగా త్రాగుతున్నావ్....?" అడిగాడు కొలీగ్ కృష్ణారావు.

"ఏం చెప్పమంటావురా....! నా భార్య నాతో గొడవపడి, కోపమొచ్చి నెలరోజుల వరకూ తిరిగి రానని పుట్టింటికి వెళ్ళిపోయింది....." చెప్పాడు అర్జునరావు.

"అరె...! భార్య పుట్టింటికి వెళ్ళిపోతే సంతోషంతో పార్టీ చేసుకోవాలి కాని, నీవేంట్రా....... భాధతో మందుకొడుతున్నావ్.....?"

"నా భార్య పుట్టింటికి వెళ్ళి ఈ వేళతో నెలరోజులు పూర్తయిపోతోంది. అందుకేరా నాభాద....." అంటూ అసలు విషయం చెప్పాడు అర్జునరావు. ❑

19. "పేషెంట్‌కి ఆపరేషన్ చెయ్యాలి. పక్కనున్న థియేటర్‌కి తీసుకెళ్లు....." కొత్తగా హాస్పిటల్‌లో చేరిన ఏమీ తెలియని నర్సుతో అన్నాడు డాక్టర్.

"అలాగే సార్.....! ఇంతకూ పక్క థియేటర్లో ఏం సినిమా ఆడుతోంది...?" ఉత్సాహంగా అడిగింది నర్స్. ❑

20. "మమ్మీ.....! మమ్మీ...!! రేపటి నుండి నేను స్కూలుకి వెళ్ళను. మా టీచర్స్‌కు ఏమీ తెలియదు. పాఠాలు ఒకసారి ఒకలాగా, ఇంకోసారి మరొకలాగ చెప్తున్నారు...." చంకనున్న స్కూల్‌బేగ్ మూలకు విసిరేస్తూ అన్నాడు బుజ్జిగాడు.

"అలాగా....! ఇంతకూ మీ టిచర్స్ ఏం చెప్పారు.....?" అడిగింది తల్లి.
"నిన్న మా తెలుగు మాస్టారు వచ్చి రాజీవ్‌గాంధీ నెహ్రూగారి మనవడు అని చెప్పారు. ఈ రోజేమో రాజీవ్‌గాంధీ ఇందిరా గాంధీ కొడుకు అన్ని చెప్పారు.
లెక్కల మాస్టారేమో నిన్న ఐదు ఐదు పదన్నారు. ఈ రోజు మళ్ళీ ఏడు, మూడు పదంటూన్నారు......." చెప్పాడు బుజ్జిగాడు. ❑

21. "రవీ.....! తాజ్ మహల్ ఎక్కడుందో చెప్పు....?
"మీకు తెలుసా టీచర్...?
"తెలుసు....."
"అయితే మళ్ళీ నన్నడిగి తెలుసుకోవడమెందుకు.......?" ❑

22. "రఘూ....! సుష్మతో నీ పెళ్ళి విషయం ఏమైంది....."
"ఆస్తిపాస్తులు అడిగింది....."
"మరి మీ మావయ్య అనంతరం ఆ ఆస్తిపాస్తులన్నీ నీవేనని చెప్పలేకపోయావా...?"
"అలా చెప్పాను కనుకే ఇప్పుడు అత్తయ్య అయింది......" ❑

23. "అమ్మగారూ...! అమ్మగారూ..! ఇంట్లో ఎవరైనా మగాళ్ళుంటే కాస్త పిలవండి...." అప్పుడే ఇంట్లోంచి బైటకు వచ్చిన దమయంతితో అన్నాడొక అపరిచితుడు.
"ఇంట్లో మగాళ్లెవరూ లేరు......" అంది దమయంతి.



"పోనీ పక్కింట్లో వాళ్ళనైనా పిలవండి...."
"పక్కిళ్ళలోనూ ప్రస్తుతం ఎవరూ లేరయ్యా....."
"ఫోన్ చేసి మీ వారిని పిలవండి......."
"ఇంట్లో ఫోన్‌లేదు...."
"కనీసం పనివాళ్ళనైనా పిలవండి...."

"ఈ రోజు పనివాళ్లెవరూ రాలేదు...."

"అలాగా....! అయితే వెంటనే నీ మెళ్లో గొలుసు, మంగళసూత్రాలు, చేతి గాజులు, ఉంగరాలు అన్నీ తీసి మర్యాదగా నా చేతిలో పెట్టు. లేకపోతే కత్తితో పొడుస్తా.....!" చాకుతో బెదిరిస్తూ చెప్పాడా అపరిచితుడు. ❑

24. కొడుకు ఫ్రెండ్స్‌తో కలసి అల్లరి చిల్లరగా తిరగడమే కాక పేకాట కూడా ఆడుతున్నాడని తెలసింది ధర్మారావుకి. అంతే....! కొడుకుని దగ్గర కూర్చోబెట్టుకొని హితబోధ చేశాడు. "చూడు బాబూ....! పేకాట ఆడటం చాలా తప్పు. దాని వల్ల ఈ రోజు డబ్బు వస్తుంది. రేపు పోతుంది, ఎల్లుండి వస్తుంది. ఆవలి ఎల్లుండి పోతుంది..."

"అలాగా నాన్నా....! అయితే ఇకపైన రోజు విడిచి రోజు ఆడిగెలుస్తానులే..." అంటూ వెళ్ళిపోయాడు కొడుకు. ❑

25. తెలుగు మాస్టారు పాఠం చెబుతున్నారు. పాఠం మధ్యలో సంధర్భానుసారంగా విద్యార్థులనుద్దేశించి" ఐకమత్యమే మహాబలం. ఒక్కరుగా సాధించలేనివి ఎన్నో మనం ఐకమత్యంతో సాధించవచ్చు. కాబట్టి మీరు ప్రతి విషయంలోను ఐకమత్యం చూపి విజయం సాధించాలి......" అన్నాడు.

"మాస్టారూ...! మీరు ఇప్పుడేమో ఇలా చెబుతారు. మరో చోట మేము ఐకమత్యం చూపిస్తే మాత్రం తిడతారు....." అన్నాడో విద్యార్థి.

"మీరు ఐకమత్యంతో ఉంటే తిడతానా....! ఎప్పుడు..!?" ఆశ్చర్యంగా అడిగారు మాస్టారు.

"అదే సార్.....! మేము పరీక్షహాల్లో కూర్చొని పరీక్షవ్రాసేటపుడు ఐకమత్యంతో ఒకరికొకరం సహాయం చేసుకుంటూంటే మీరు ఊరుకోరుగా....!" అన్నాడావిద్యార్థి. ❑

26. "రామూ.....! మనింట్లో చిన్న పిల్లిపిల్ల ఉండేది ఏమైందిరా...?" అడిగాడు తాతయ్య.

"ఆ పిల్లిపిల్ల ఏమైందో నీకు నిజంగా తెలియదా తాతయ్యా....!?" అడిగాడు మనవడు.

"నిజంగా తెలియదురా..... ఏమైందో త్వరగా చెప్పు....." ఆత్రంగా అడిగాడు తాతయ్య.

"అదిప్పుడు పెద్దపిల్లి అయిపోయింది తాతయ్య...!" చెప్పాడు మనవడు.

27. స్కిన్ స్పెషలిస్టు దగ్గరకెళ్ళాడు పాపారావు.

"సార్.....! నాకు గోళ్లు బాగా పెరగడానికి మందులు కావాలి సార్...!" అన్నాడు.

"గోళ్లు ఎదగడమెందుకయ్యా....!?" అడిగాడు డాక్టరు.

"వళ్లంతా విపరీతమైన దురదగా ఉందిసార్.....! గోక్కోడానికి..." చెప్పాడు పాపారావు. ❑

28. ఎర్రగడ్డ పిచ్చాసుపత్రిలో రాజయ్య పేషెంటుగా ఉన్నాడు. డాక్టరు రోజూ రాజయ్య దగ్గరకొచ్చి ఒక పది రూపాయలు నోటు; పది పైసల నాణేం చూపించి ఏది కావాలో తీసుకో అంటున్నాడు. రాజయ్య మాత్రం ఎప్పుడూ పది పైసల నాణెం మాత్రమే తీసుకుంటూ ఉంటాడు.

ఓ రోజు అలాగే నోటు, నాణెం చూపించి "ఏదో ఒకటి తీసుకో" అన్నాడు. రాజయ్య నాణెం తీసుకున్నాడు. డాక్టరు వెళ్ళిపోయాక పక్కనున్న నర్సు రాజయ్యను "రాజయ్యా....! రోజూ డాక్టరు గారు నోటు, నాణెం చూపించినపుడు నోటువిలువ ఎక్కువ కనుక అది తీసుకోవచ్చుగా...!" అనడిగింద.

"హమ్మా! పది పైసల నాణెం కంటే, పదిరూపాయలనోటు విలువ ఎక్కువని నాకూ తెలుసు కాని, నేను నోటు తీసుకుంటే నాకు పిచ్చి తగ్గిపోయిందని డాక్టరుగారు రోజు ఈ ఆట ఆడటం మానేస్తారుగా...." అన్నాడు రాజయ్య. ❑

29. "నీ ఓటు పది రూపాయలకి అమ్ముకున్నావు కదూ.....!" గద్దించాడు ఇన్‌స్పెక్టర్ ఒక ఓటరుని

"లేదు సార్....! అతడంటే మనస్ఫూర్తిగ ఇష్టపడి నా ఓటేశాను..."
"లేదు... నువ్వు పదిరూపాయలు పుచ్చుకున్నట్టు తెలిసింది...." అన్నాడు ఇన్‌స్పెక్టర్.
"అవునండీ....! మీకెవరైనా ఊరికే పదిరూపాయలిస్తే మీకామనిషంటే ఇష్టం కలగదా! చెప్పండి...." గద్దించాడు ఓటరు. ❑

30. "డార్లింగ్ నీ కోసం, నీప్రేమ కోసం నన్నేమి చేయమన్నా చేస్తాను. ఏమి తీసుకురమ్మన్నా తీసుకు వస్తాను. చివరికి చావమన్నా చస్తాను...." అన్నాడు ప్రియుడు.
"ఈమాట ఎప్పుడూ అనడమే కాని ఏనాడైనా చేసే ప్రయత్న మైనా చేశావా...? మూతి మూడు వంకర్లు తిప్పుతూ అంది ప్రియురాలు.

31. "నిన్నమీ మావయ్య చనిపోయినట్టు పేపర్లో చదివానురా సురేష్.



ఆయన కోటీశ్వరుడు కదా...! పిల్లలు కూడా లేరాయె. నువ్వాయన దగ్గర చాలా చనువుగా తిరిగే వాడివి కదా! మరి ఆస్తిలో కాస్త భాగమైనా నీకు రాశాడా?" అడిగాడు శ్రీను విలాస్‌ని.
"అలా రాస్తాడనేగా ఆయన పెంపుడి కుక్కల్ని నానెత్తికెక్కించుకొని తిరిగాను...."
"అయితే ఏమాత్రం రాశాడేమిటీ....?"
" ఆ కుక్కల్ని నా పేర రాశాడంతే......" ❑

32. ఎన్నికల్లో నిలబడ్డ కృష్ణారావుని ఫలితాలు తెలియకుండానే సన్మానిస్తానంటూ వచ్చింది ఓ మహిళామణి.
"అదేమిటమ్మా! ఇంకా ఫలితాలు కూడా తెలియలేదాయె. మీ అభిమానం చూస్తుంటే నాకు చాలా ఆనందంగా ఉంది. ఇంతకీ మీకు

ఎందుకు ఇలా చేయాలనిపించింది...." అడిగాడు అభ్యర్థి కృష్ణారావు ఆనందంగా.

"ఎందుకేమిటండీ....! ఇది నా అలవాటు ఓడిపోయిన కాండిడేటుని ఎవరు సన్మానిస్తారు? అందుకే ఇలా ఏదో దీనజన సేవ చేస్తూ ఉండడం నా హాబీ...' అందా మహిళామణి. ❑

33. "అప్పారావు, సుబ్బారావు చాలాకాలం నుంచి బిజినెస్ పార్టనర్స్. ఓసారి అప్పారావ్ వారం రోజులు జ్వరంతో ఆపీసుకు రాలేదు. జ్వరం తగ్గాక వచ్చిన అప్పారావుతో సుబ్బారావిలా అన్నాడు.

"మొన్నీ మధ్య లాకర్లోను ఐదు వేలు రూపాయలు పోయాయిరా... ఏమి చెయ్యాలో తెలియడం లేదు.."

"తెలిసేదేముందీ.....? గప్‌చిప్‌గా తిరిగి అందులో పెట్టెయ్య డమే....." అన్నాడు అప్పారావు. ❑

34. "ఇంక నేనెప్పుడూ రామూతో కారమ్స్ ఆడనురా...." అన్నాడు కృష్ణంరాజుతో.

"ఏం? ఏమయిందీ...?"

"అవునురా....! అప్పుడప్పుడు ఎదుటివాడు చూడకుండా కాయిన్ చేత్తో తోసేస్తే అలాంటి వాడితో నువ్వు ఆట ఆడుతావా?"

"చచ్చినా ఆడను....."

"వాడూ ఆ మాటే అన్నాడు మరి.... " వాపోయాడు కృష్ణ. ❑

35. "మమ్మీ....! మమ్మీ....! ఈవేళ స్కూల్లో మాస్టారు వ్యతిరేకపదాలు అంటే ఏమిటని అడిగారు? కాని నేను చెప్పలేకపోయాను...." అన్నాడు టింకూ.

"ఓరి పిచ్చికన్నా.... ఆమాత్రం తెలియదా ప్రతిరోజూ మీ నాన్న, నేను ప్రతి పనికి ముందు మాట్లాడుకుంటాముగా అవే వ్యతిరేకపదాలు....." చెప్పింది తల్లి. ❑

36. "ఈ గోల్డ్‌కప్ చాలా బావుందిరా... ఎక్కడ సంపాదించావు...." గంగారావు చేతిలో ధగధగ మెరిసిపోతున్న కప్ చూసి అడిగాడు మంగారావు.



"రన్నింగ్‌లో నేను ఫస్ట్ రావడం వల్ల ఇది లభించింది....." చెప్పాడు గంగారావు.

"అలాగా....! మరి సెకండ్, థర్డ్ స్థానాల్లో ఎవరొచ్చారు....?

"సెకండ్ స్థానంలో పోలీస్ కానిస్టేబుల్, థర్డ్ స్థానంలో ఈ కప్పు యజమాని వచ్చారు...." ❑

37. కారుని స్పీడుగా డ్రైవ్‌చేస్తున్న సుజాతను ట్రాఫిక్ పోలీసు ఆపేశాడు. "చూడండి ఇది సిటీ. మరి మీరు ఏకంగా అరవైలో ఉన్నారు.." అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు. ❑

"చూడు మిస్టర్ ... మీరు ఎక్కువగా మాట్లాడితే మర్యాద దక్కదు. నా వయస్సు ఇరవై అయిదే. కావాలంటే నా దగ్గర బర్త్ సర్టిఫికెట్ ఉంది" అని ఉరిమింది సుజాత. ❑

38. "భర్తలు చెప్పిన మాట వినకపోతే ఏం చేయలో తెలుసా? అర్జెంటుగా ఉరేసుకోమని ఓ త్రాడు కొనివ్వాలి...."

"సర్లే మొన్న అలాగే చేస్తే మా ఆయన దాంతో స్కిప్పింగ్ చేయడం మొదలెట్టాడు.. ❑

39. "అమ్మా....! ఈజిప్షియన్లకి డాడీలుండరా....? అడిగింది టుమ్మి.

"ఎందుకుండరూ....?"'

"మరెప్పుడూ క్లాసులో అక్కడి మమ్మీల గురించే చెబుతా రెందుకు?" సందేహంగా అడిగింది టుమ్మి. ❑

40. తండ్రి కొడుక్కి తుపాకి గురిపెట్టడం నర్పుతున్నాడు. అంతలప్పై నుంచి ఓ కాకి ఎగురుతూ వెళ్ళడం చూసి కొడుకుతో ఇలా అన్నాడు. "చూడు నానీ.....! ఆ కాకిని ఎలాగురి చూసి కొడతానో నీవు అంతటి వాడివి కావాలి."

తుపాకీ గురిపెట్టి కాకిని పేల్చాడు అయినా అది ఇంకా ఎగురుతూనే ఉండడం చూసి ఆశ్చర్యపోతున్న కొడుకుతో అన్నాడు తండ్రి" చూశావా నానీ ఈ చిత్రం చచ్చినా కాకి కూడా ఎలా ఎగురుతోందో...." ❑

41. కొత్తగా పెళ్ళయిన మిత్రుడితో అంటున్నాడు శ్రీహరి
"ఓరేయ్....! ఏది మర్చిపోయినా మీ ఆవిడ పుట్టిన రోజును మాత్రం మర్చిపోకు...."
"అంత ఖచ్చితంగా గుర్తుపెట్టుకోవడం ఎలారా.....?"
"ఏమీ లేదు. ఒక్కసారి మర్చిపో చాలు, ఆపైన జీవితాంతం గుర్తుండిపోతుంది....." ❑

42. క్లాసులో విద్యార్థిని అడిగారు మాస్టారు.
"రవీ.. ...! పదండి ముందుకు, పదండీ తోసుకు, పోదాంపోదాం పైపైకి..." అని ఎవరన్నార్రా...?"
"మొన్న బస్సెక్కినపుడు సిటీబస్ కండక్టర్ సార్.....!" ❑

43. సూర్యకాంతాన్ని పరీక్ష చేశాక ఆవిడ భర్తతో ఇలా అన్నాడు డాక్టరు.
" మీ ఆవిడకి వినపించపోవడానికి పెద్దకారణమేమీ లేదు. వయసు పెరుగుతున్నపుడు ఇలాంటివి మామూలే అని ఆవిడకి చెప్పండి"
"ఐ బాబోయ్....! అదేదో మీరే చెప్పండి. హమ్మో.....!" అన్నాడు భర్త.

44. "ఇదిగో మన ప్రథానానికి నేను ప్రామిస్ చేసిన వజ్రాల ఉగరం..." అన్నాడు హరిబాబు రమణితో
"కాని ఈ వజ్రం మంచి రకంది కాదనిపిస్తోందే? హరీ...!" అంది రమణి.
"చూడు డియర్....! అవన్నీ పట్టించుకోకూడదు. మనిద్దరం ప్రేమలో పడ్డాం.

ప్రేమ గుడ్డిది కాబట్టి ఏమీ కనిపించకూడదు...." అన్నాడు హరిబాబు.
"ప్రేమ గుడ్డిదేమోగానీ వజ్రం మాత్రం నాకు స్పష్టంగానే కనిపిస్తోంది...." అంది రమణి. ❑

45. "వదినా మీ వారు ఇదివరకు తారుడబ్బాలా నల్లగా ఉండేవారు మరిప్పుడేమో తెల్లగా నిగనిగలాడుతున్నారేమిటే? రహస్యం?
"ఏముందీ! ఇదివరకు బొగ్గుగనిలో పనిచేవారు. ఇప్పుడైతే పిండిమిల్లులో పనిచేస్తున్నారు. ❑

46. అప్పటిదాకా మట్టిలో ఆటలాడివచ్చిన రవితో అంది తల్లి.
"ఓరేయ్! బాత్ రూంకెళ్ళి చేతులు శుభ్రంగా కడుక్కొని వస్తే చాక్‌లెట్ ఇస్తాను. కాళ్లు కూడా కడుక్కుంటే ఓ కేక్ కూడా ఇస్తాను....." అని
"అమ్మా! అయితే నేను స్నానం చేస్తానే...!" అంటూ పేచీ మొదలెట్టాడు రవి. ❑

47. "అమ్మా! పాలమీద ఆరుపేజీల వ్యాసాన్ని రాస్తే దాన్ని మూడు పేజీలకి తగ్గించి రాయమన్నారమ్మా!"
"దానిదేముంది. ఆపాలలో కలిపిన నీళ్లు తీసేస్తే సరి....." పరధ్యానంగా అంది తల్లి. ❑

48. "ఓరేయ్! రామూ నీ బెడ్ దగ్గరికి పది దోమలు వచ్చాయనుకో అందులో మూడు దోమల్ని చంపేస్తే ఇంకెన్ని మిగులుతాయి?
"ఆ మూడే ఉంటాయిసార్....! మిగిలినవి పారిపోతాయి...... సార్."

49. "డాక్టర్...! మీ దగ్గర ఆపరేషన్ చేయించుకున్నవాళ్ళకి ఏవో ఉచితంగా ఇస్తున్నారట...."
"అవన్నీ ఆపరేషన్ పూర్తయ్యాకే ఇస్తామోయ్....!
" ఇంతకూ ఉచితంగా ఏమి ఇస్తున్నారు డాక్టర్....?"
"ఆపరేషన్ అనంతరం శవ దహనానికి అయ్యే ఖర్చులు...."



50. "రాజా మనం ఉపయోగించే పోస్టు కార్డు మీద పులిబొమ్మ ఎందుకుంటుంది?"
"బహుశా టు అడ్రస్ ఎక్కడికీ పారిపోకుండా కాపలా కాయడానికి అనుకుంటాసార్.!" ❑

51. ఓ అడవి ప్రాంతానికి ఆఫీసు డ్యూటీ మీద వచ్చిన హనుమంతరావుకి అక్కడున్న పెద్ద చెరువులో స్నానం చేయాలనిపించింది. అటుగా వెళ్తున్న దానయ్యను పిలచి అడిగాడు. "ఏమయ్యా! ఇంతక్రితం వచ్చినపుడు ఈ చెరువు నిండా జలగలుండేవి. ఇప్పుడూ ఉన్నాయా?"
"లేవండయ్యా! మీరు నిక్షేపంగా స్నానం చేయెుచ్చు. అందులో చేరిన మొసలి ఆ జలగలన్నింటిని ఎప్పుడో మ్రింగేసింది...." అన్నాడు దానయ్య. ❑

52. "గడియారం పన్నెండు గంటలు కొట్టాక మళ్ళీ ఒకటి కొడుతుంది ఎందుకన్నయ్యా?" ఆరేళ్ళ అన్నను అడిగాడు అయిదేళ్ళ తమ్ముడు.
"పన్నెండు కొట్టగానే మళ్ళీ వెనక్కి ఒకటి దగ్గరకు వెళ్ళిపోతుందిరా! ఇంక దానికి ముందు కెళ్ళడం రాదు...." అన్నాడు అన్నయ్య. ❑

53. "కృష్ణా! నీకు ఎప్పుడైనా పులి, సింహం కనిపించాయనుకో! నిన్ను పులి మింగేయాలనుకుంటావా? సింహం మింగేయాలనుకుంటావా?" అడిగాడు నానిగాడు. ❑
"ఆ పులిని సింహం మింగేయాలను కుంటాను." అన్నాడు కృష్ణ.

54. "నేనెక్కడి నుండి వచ్చానమ్మా....! అని మా అమ్మనడిగితే స్వర్గం నుంచి వచ్చానమ్మా! అంటుంది మా అమ్మ....." అంది చిన్నారి.
"ఏం స్వర్గం నుంచి కిందకిపొమ్మని దేవతలు నిన్ను తోసేశారా?" ఆశర్యంగా అడిగింది పొన్నారి. ❑

55. "సైన్సు ఎంతగా అభివృద్ధి చెందిందంటే కుక్కకూడా ఆకాశంలో ఎగరగలదంటే ఆశ్చర్యం లేదు. రష్యావాళ్లూ, అమెరికావాళ్ళూ పంపేశారు కూడా...."

"ఆశ్చర్యమె ముంది..! మొన్న మా కుక్క కూడా ఎగిరిందిగా....!
"నిజమా...! ఎలా జరిగిందది.....?"
"మా పక్కింటి వాడికి కోపం వచ్చి ఓ తన్ను తన్నాడు. అంతే! ఆకాశంలో ఎగిరొచ్చి మా కాంపౌండ్లో పడింది....." ❑

56. "రవీ! తాజ్‌మహల్ నిర్మించిదెవర్రా?" అడిగారు మాస్టారు.
"డి. రామానాయుడు సార్.....!" ఠక్కున చెప్పాడు విద్యార్థి. ❑

57. "ఇప్పుడు నీకు ఆరోగ్యం ఎలా ఉంది?" ఆరోగ్యం నుండి కోలుకున్న పేషెంట్‌ని అడిగాడు డాక్టరు.
"అంతా బాగానే ఉంది కాని, లోపల రెండు గుండెలు కొట్టుకుంటునట్లున్నాయి...."" ఆందోళనగా అన్నాడు పేషెంట్.
'డోంట్‌వర్రీ! నీ కున్నది ఒక్కటే గుండె. రెండోది నా రిస్ట్‌వాచి..." ❑

58. "నేను ఏమైనా చేయగలను. పొలం దున్నగలను, పంటపండిచగలను, పాలుపితక గలను. ఇల్లుకట్టగలను, కోత కోయగలను. నార్లు నాటగలను. ఒక్కమాటలో చెప్పాలంటే నేను చేయలేనిది ఏదీ లేదు....' ' ఉపన్యాసం నడుస్తోంది. కాసేపటి తర్వాత ఓ కొంటె కుర్రాడు అడిగాడు. "ఒక గుడ్డు పెట్టగలవా?" ❑

59. ఒకసారి ముఖ్యమంత్రి పిచ్చాసుపత్రి చూడ్డానికి వెళ్ళారు. పిచ్చాళ్లంతా భయంభయంగా పక్కకి తప్పుకోసాగారు. ఒకడు మాత్రం ఇవేమీ పట్టించుకోకుండా తన పిచ్చి చేష్టలు కొనసాగిస్తున్నాడు. ముఖ్యమంత్రి అతని దగ్గరకు వెళ్ళి
"ఏం నేనంటే నీకు లెక్కలేదా? నేనెవరో తెలుసా? ఈ రాష్ట్రానికి ముఖ్యమంత్రిని..." అన్నాడు.
"“ష్...! గట్టిగా అరవకండి ఆర్నెల్ల క్రిందట ఇక్కడ కొచ్చి నేనూ అలాగే అన్నాను.
అంతే...! అప్పటినుండి నన్ను ఇక్కడే ఉంచేశారు....." నెమ్మదిగా చెప్పాడా పిచ్చాడు. ❑

60. "మా తమ్ముడికి రెండేళ్ళు నిండి మూడో ఏడువస్తోంది. వాడు చిన్నచిన్న మాటలు చెబుతుంటే మా అమ్మ ఇంకా ఇంకా చెప్పమంటోందిరా...!' ' అన్నాడు హరితో గిరి.

"ఆ....! మొదట్లో ఇలాగే మాట్లాడమని పీక్కుతింటారు. ఆతర్వాత మాట్లాడితే చావకొడతారు...." అన్నాడు హరి. ❑

61. "రోజూబడికి ఆలస్యంగా ఎందుకొస్తున్నావురా రామూ?"

"తొందరగానే బయలుదేరతానండి మధ్యలో రోడ్డు మలుపు దగ్గర ఓ బోర్డు కనిపిస్తుంది దాంతో ఆలస్యమవుతోందిసార్....!

"ఏం బోర్డది?"

"స్కూల్ ఉంది నెమ్మదిగా పోవలెను....." ❑

62. కళ్ళులోతుకు పోయి, కృశించిపోయి ఏదో ఆలోచిస్తున్నట్లుండే కమలాకరాన్ని అతని భార్యసైకియాట్రిస్టు వద్దకు తీసుకొచ్చింది. డాక్టరు వద్దకు రాగానే అప్పుడే తాగిన సిగరెట్ అవతల పడేసి మరో సిగరెట్ తీశాడు కమలాకరం.

వెంటనే-డాక్టరు అతని దగ్గరకు వచ్చి.....

"చూడగానే తెలుస్తోంది. నా అవసరం నీకు చాలా ఉందని..." అన్నాడు.

"అరె .....! భలే కనిపెట్టావే! అయితే నీ దగ్గర అగ్గిపెట్టె ఉందన్నమాట....' ' అంటూ చేయి చాచాడు కమలాకరం. ❑

63. "వెధవల్లారా! మీరు నలుగురున్నారు. ఒక్క దొంగను పట్టుకోలేక పోయారా? ఛ..... సిగ్గుచేటు..."



"సార్! దొంగ ఎలాగూ పారిపోయాడు.... అయినా వాడి వేలి ముద్రలు మాత్రం సంపాదించగలిగాము...."

"సరె.... సరె... అవైనా ఎక్కడున్నాయో చూపించి తగలడండి...."

"ఇవిగోసార్.....! నా చెంపమీద భద్రంగా ఉన్నాయి."

64. "గెడ్డంగీసుకోడానికి వేడినీళ్ళు తెమ్మంటే ఇలాంటి మురుగునీళ్ళు తెచ్చావేరా వెధవా?"
"భలేవారే..! నేను మీ కోసం టీ తెచ్చానయ్యగారూ....!" ❑

65. ఇద్దరు త్రాగుబోతులు రోడ్డుమీద నడుస్తున్నారు.
"ఒరేయ్....! నేను అర్జెంటుగా హైదరాబాద్‌వెళ్ళి, చార్మినార్, సాలార్‌జంగ్ మ్యూజియం, హుస్సేన్ సాగర్ కొనేయాలనుకుంటున్నానురా...!" అన్నాడు మొదటి వాడు.
"అమ్మ .....! ఆశ...!! నువ్వు కొనాలంటే అవన్నీ నీకు నేను అమ్మాలిగా..... చచ్చినా నీకు మాత్రం అమ్మను....." అన్నాడు రెండోవాడు. ❑

66. ఓ మహిళా మండలి అధ్యక్షురాలు సభలో మాట్లాడుతూ "చూడండి.... మహిళలూ... ఇప్పుడు వంటచేయటానికి ముఖ్యంగా మహిళ క్కావలసింది ఏమిటి?" అని అడిగింది.
"భర్త కావాలి......." సభలో అందరూ ముక్త కంఠంతో చెప్పారు. ❑

67. "సుశీలా...! ఈ మధ్య ఓ ట్యూషన్ మాస్టారుని పెట్టుకుని నువ్వూ, మీ భర్త తమిళ బాష నేర్చుకుంటున్నారు ఎందుకని...?" అడిగింది రమోల.
"ఏముందీ....! మేము ఒక తమిళ పాపను పెంచుకుంటున్నాముగా....! అది పెద్దదయ్యి తమిళంలో మాట్లాడం మొదలెడితే మాకు అర్థం కావాలిగా.." అందుకని అంది సుశీల. ❑



68. పైలట్‌లకు శిక్షణనిస్తూ విమాన ప్రయాణంలో ప్రమాదకరమైన పరిస్థితి వస్తే పారాచూట్ ఉపయోగించి ఎలా కిందికి దిగాలో వివరించాడు ఆఫీసర్.

"సమయానికి పారాచూట్ తెరుచుకోకపోతే.... అప్పుడెలా సార్...."
అడిగాడొక యువపైలెట్.
" నాదగ్గర కొస్తే ఇంకోటిస్తాను....." చెప్పాడు ఆపీసర్. ❑

69. "వరుణ్...! రోజూ ఏదో రకంగా పొదుపు చేయాలని మనం చెప్పుకున్నాం కదా....! నిన్న ఎలా పొదుపుచేశావో చెప్పు....?" అడిగాడు టీచరు.
"బస్సు వెనకాల పరిగెత్తి రెండు రూపాయలు, ఆటోవెనకాల పరుగెత్తి పదిరూపాయలు పొదుపుచేశాను సార్...." అన్నాడు వరుణ్. ❑

70. సుందరమ్మ కొడుకును రహస్యంగా పిలచి "ఓరేయ్...! మధూ మధ్యాహ్నం కోడలు పిల్ల నిద్దట్లో వద్దు రాజూ....! వద్దురాజూ...!! అంటూ పలవరించింది రా...!" అంది.
"ఎందుకమ్మా....! నీకంత అనుమానం . వద్దురాజూ అనేగా అంది. రా.....! రాజూ ఫర్వాలేదు అనలేదుగా... అన్నాడు మధు. ❑

71. "భూమిమీదనుండి రాకెట్లో చంద్రమండలానికి వెళ్తే అక్కడికి చేరుకోడానికి సరిగ్గా మూడురోజులు పడుతుంది......" చెప్పాడు జాగ్రఫీ లెక్చరర్.
"సర్.....! నాకో సందేహం..." అన్నాడు స్టూడెంట్.
"ఏమిటది.....?"
"నడిచివెళ్తే ఎంతకాలం పడుతుంది....?" ❑

72. "జీవితంలో కష్టసుఖాలు పాలుపంచుకొమ్మనే కదండీ....! పెద్దలు శోభనం గదిలోకి పాలు పంపిస్తారు...." అంది భార్య.
"అయితే మనమేమీ కష్టసుఖాలు పంచుకోనక్కర్లేదన్నమాట..." అన్నాడు భర్త.
"అదేమిటండీ...! " అడిగింది భార్య.
" మన శోభనం గదిలో పాలు పిల్లి త్రాగేసింది కదా...! " గుర్తు చేశాడు. భర్త. ❑

73. "ఏరా రామూ....! ఈ మార్కులేంటి....? వందకు ఐదు మార్కులే వచ్చాయేమిటి...?"
"మరేం చేయమంటావు నాన్నా....! మాస్కూల్ వాస్తు బాగోలేదు...." తాపీగా చెప్పాడు రాము. ❑

74. "టిఫిన్ తినకుండా అలా చూస్తున్నారేంటి సార్..! ఆశ్చర్యంగా అడిగాడు సర్వర్.
"నువ్వు తెచ్చిన రెండింటిలో చపాతీ ఏదో తెలియడం లేదోయ్...." అన్నాడు లింగమూర్తి.
"పై నున్నది చపాతీ, క్రిందది ప్లేట్ సార్....!" ❑

75. "మన టి.వి.ప్రోగ్రామ్స్ చాలా బాగుంటున్నాయని చాలా మంది స్కూల్ పిల్లలు దగ్గర్నుంచి ఉత్తరాలు వస్తున్నాయి సార్....!"
"ఏ ప్రోగ్రామ్స్ బాగున్నాయంటున్నారు...?"
"మిడ్‌నైట్ కార్యక్రమాలట......" ❑

76. "మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవడానికి నీ కున్న అర్హతలేమిటి...?"
"వంటలు బాగా చేస్తాను, బట్టలు బాగా ఉతుకుతాను ఇంతకంటే ఏం అర్హతలు కావాలిసార్..."? ❑



77. "ఏవయ్యా...! మళ్లీ కోర్టుకి వచ్చావు ఎలా వచ్చావ్....?"
"ఇద్దరు కానిస్టేబుల్స్ తీసుకు వచ్చారండి...."
"మళ్ళీ త్రాగుడేనా....?"
"ఔనండీ....! ఇద్దరూ ఫుల్‌గా త్రాగేసి ఉన్నారు....." ❑

78. "ఏవండీ...! క్రిందటి సంవత్సరం నా పుట్టినరోజుకి రవ్వల నెక్లెస్ తెచ్చారు. మరి ఈ పుట్టిన రోజుకి ఏం తెచ్చారు...?"గోముగా అడిగింది భార్య.
"ఆ రవ్వల నెక్లెస్ అమ్మేసి ఈ గిల్ట్ నెక్లెస్ తెచ్చాను...." చెప్పాడు భర్త.

79. "ఇతను తాగి ఉన్నట్లు ఋజువేమిటి...?" అవమాయకంగా కనబడుతున్న లక్ష్మణరావుని చూసి అడిగాడు జడ్జిగారు.

"తాగే ఉన్నాడు సార్....! రోడ్డుమీద నిలబడి అతని స్నేహితుడితో గంటసేపు కుస్తీపట్టి భీకరంగా దెబ్బలాడాడు..." వినయంగా చెప్పాడు కానిస్టేబుల్.

"ఏడీ ఆ స్నేహితుడు..?

"అదే సార్....! నాకూ అర్థంకానిది. నిజానికి ఆ చుట్టుపక్కల ఎవ్వరూ లేరు...." జుట్టుపీక్కుంటూ అన్నాడు కానిస్టేబుల్. ❑

80. "డాక్టర్...! సరిగా చూడలేకపోతున్నాను...."

"కళ్లు బాగానే ఉన్నాయిగా దేన్ని చూడలేకపోతున్నావ్.....?

"ఎదుటివారు బాగుపడుతుంటేను....." ❑

81. "ఒరేయ్....! రవీంద్ర .....నువ్వు సైన్యంలో చేరకూడదూ....?" అన్నాడు సురేంద్ర.

"సర్లే తుపాకీ వెనక్కి తిప్పి కాల్చాలో, ముందుకి తిప్పి కాల్చాలో కూడా తెలిసి చావదు. నాకు.. నాకెందుకు లేరా....?" అన్నాడు రవీంద్ర.

"నువ్వు ఎటు తిప్పి కాల్చినా దేశానికి లాభమేరా...." అనేసి నాలుక్కరుచు కున్నాడు సురేంద్ర. ❑

82. "ఆ రాజమ్మ గారింట్లో ఎలా పనిచేస్తున్నావే రత్తాలు ...? ఆవిడ చెప్పిన ప్రతీ పనీ తప్పని సరిగా చేయాలట కదా...! ఈర్ష్యగా అంది రాజమ్మగారి పక్కింటావిడ పనిమనిషితో.

"ఏం చేస్తాం.... అమ్మగారూ..! ఆవిడ చెప్పినదంతా నేనేచేయాలి నేను చెప్పినదంతా వాళ్ళాయన చేయాలి తప్పదు మరి....." అంది రత్తాలు.

83. "ఒకే ఇంట్లో నువ్వు ఏడుసార్లు దొంగతనం చేశావ్....! నువ్వు ఆ యింట్లో పదేపదే ఎందుకు దొంగతనం చేస్తున్నావ్....? " అడిగాడు జడ్జి.

"ఏం చెయ్యమంటారండీ.. మరి ... ఊళ్లో ఆ మాత్రం డబ్బున్న ఇల్లు మరొక్కటైనా లేదు." నిరాశగా అన్నాడు ముద్దాయి. ❑

84. ఓ బద్ధకస్తుడి ఇంట్లో ఒక రోజు రాత్రి దొంగలుపడి దోచుకుపోతుండగా ఆ బద్ధకస్తుడికి మెలకువ వచ్చింది.
ఆ దొంగలను చూసిన బద్ధకస్తుడు పూర్తిగా నిద్రలేవకుండానే "పట్టుకుపోయే వాళ్లు ఎలాగూ పట్టుకుపోతున్నారు. ఆ సొమ్ములిస్టు రాసి పోలీస్ స్టేషన్‌లో కంప్లైంట్ ఇచ్చిపొండి...." అని మళ్ళీ నిద్రలోకి జారిపోయాడు. ❑

85. "మన జీవితం ఎందుకో తెలుసా..? సాటివారికి సాయం చెయ్యడానికి...." అన్నాడు టీచర్. "మరి సాటివారు ఉన్నది ఎందుకు సార్....?" అన్నాడు స్టూడెంట్. ❑

86. "ఏమేవ్ ఇద్దరు పిల్లలు చాలు మనకి. ఇక పిల్లల్ని కనడం నా వల్లకాదు. ఆపరేషన్ చేయించేసుకుందాం...." అన్నాడు భర్త.
"ఆ ఆపరేషనేదో మీరు చేయించుకోండి. నాకింకా పిల్లల్ని కనాలని ఉంది" అంది భార్య వెంటనే. ❑

87. "నువ్వు చేసిన పని ఏమైనా బాగుందా..?" కూతుర్ని అడిగాడు గజదొంగ గంగులు.
"అదేంటి నాన్నా...?" అంది కూతురు.
"మన దగ్గర చేయి చాచి ముష్టి మామూలు తీసుకొనే పోలీసుని ప్రేమిస్తావా? గుర్రుమన్నాడు గంగులు. ❑



88. "ఆడవాళ్లూ, మగవాళ్ళూ కాస్త తెలివితేటల్తో ప్రవర్తిస్తే కాపురాల్లో అసలు కలతలే ఉండవు. విడాకులు అసలే ఉండవు..."
"ఇంకాస్త తెలివిగా ప్రవర్తిస్తే అసలు పెళ్ళిళ్ళే ఉండవు. ❑

89. ఓ ప్రభుత్వ కార్యాలయంలో ఇలా బోర్డు వ్రేలాడ దీయబడి ఉంది.
"దయచేసి నిశ్శబ్దాన్ని పాటించండి..."
ఇది చదివిన ఓ ఆకతాయి. సుద్దముక్కతో దానికింద ఇలా రాశాడు.
"నిద్ర అనేది మనిషికి దేవుడిచ్చిన వరం...." ❑

90. "బేబీ...! నువ్వు బావను పెళ్ళిచేసుకుంటావా...?"
"చేసుకుంటాను. కాని డాడీ...! బావ పరమ నాస్తికుడు. దేవుడు, దెయ్యం, స్వర్గం, నరకం ఇలాంటివి ఏమీ లేవంటాడు ఎలా...?"
"డోంట్ వర్రీ బేబీ... నిన్ను చేసుకున్నాక ఖచ్చితంగా అవన్నీ ఉన్నాయంటాడు....." ❑

91. చోరీకేసులోంచి ముద్దాయిని తప్పించాలని చాలా చాకచక్యంగా వాదించాడు లాయర్.



"కిటికీ తలుపులు బార్లా తీసి ఉండటంతో ముద్దాయి చెయ్యి ఆటోమెటిక్‌గా లోపలికి వెళ్ళింది.. కొన్ని వస్తువులు తగలడంతో చెయ్యి వాటిని బయటకు తీసేసింది. చోరీ చేసింది చెయ్యేగాని ముద్దాయి కాదు. కాబట్టి చెయ్యిచేసిన నేరానికి ముద్దాయికి శిక్ష వేయడం అన్యాయం...." అని ఘాటుగా వాదించేశాడు.

జడ్జిగారు బాగా బుర్రగోక్కుని "అలాగైతే ఈ నేరం చేసిన చేతికి మూడు సంవత్సరాలు కఠిన శిక్ష వేస్తున్నాను. వట్టి చేతినే జైలుకు పంపుతాడో, తనూ జైలుకు వెళ్తాడో అది ముద్దాయి ఇష్టం...." అని కలంపోటుతో చమత్కరించాడు.
కొద్ది క్షణాలకే కోర్టుహాలంతా అదిరిపడే ఫినిషింగ్‌టచ్ ఇచ్చాడు ముద్దాయి. తన కృత్రిమ చెయ్యి ఊడదీసి కోర్టువారికి సమర్పించి గంభీరంగా నిష్క్రమించాడు. ❑

92. ఇద్దరు భార్యాభర్తలు అరగంట నుంచి వాదించుకుంటున్నారు.
"నువ్వు తల్లి కావటంలేదని నాకు లోపం అంటావా....?" అన్నాడు భర్త.
"నాకు డాక్టర్ అలాగే చెప్పాడు..." చెప్పింది భార్య.

"అయ్యో..! కాదే నాదిలోపం కాదు....." పెద్దగా అరిచాడు భర్త.

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలరు....? అంతే గట్టిగా అడిగింది భార్య.

"కావాలంటే పని మనిషిని అడుగు తెలుస్తుంది..." అని నాలిక్కరుచుకన్నాడు. ❑

93. మాస్టారు క్లాసుకు వచ్చి "ఓరేయ్...! నానీ....!! ఇపుడు నిన్ను కష్టమైన ప్రశ్న ఒకే ఒక్కటి అడగనా...? లేక సులభమైన ప్రశ్నలు రెండు లేక మూడు అడగనా...?" అన్నాడు.

"కష్టమైన ప్రశ్న ఒక్కటే అడగండి...." కాస్త ఆలోచించి అన్నాడు నాని.

"మన ఊరి మొదటి ప్రెసిడెంట్ ఎవరోచెప్పు.....?"

"కొప్పిశెట్టి జగన్నాధరావు గారు సార్......!"

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవ్...?"

"ఒకే ప్రశ్న .... అయిపోయింది సార్....!" ❑

94. బోయ్‌ఫ్రెండ్‌కి ఎప్పుడు ఫోన్ చేసినా దాదాపు గంటసేపు మాట్లాడిగాని లైన్‌కట్ చెయ్యదు ప్రేమలత.

ఓసారి అరగంటకే ఫోన్ పెట్టేయడం చూసి ఆశ్చర్యపోయాడువాళ్ళ డాడీ.

"అదేమిటమ్మా...! ఫోన్‌లో ఏదైనా పాట్లాటగాని వచ్చిందా.....? అరగంటే మాట్లాడిపెట్టేశావు....." అనడిగాడు డాడీ.

"నో డాడీ....! అది రాంగ్ నంబర్....!" ❑

95. "భార్యాభర్తలు ఇద్దరూ గొడవపడి ఎవరో ఒకరు సర్దుకుపోవాలి..." అని మా ఆయనతో అప్పుడెప్పుడో ఓ సారి అన్నాను.." అంటూ కళ్ళనీళ్లు పెట్టుకుంది మణి.

"ఇప్పుడేమైంది......" అడిగింది వాణి.

" ఈరోజు నాతోగొడవపడి ఆయనబట్టలు సూట్‌కేసులో సర్దుకుని ఎటో వెళ్ళిపోయారు...." అంటూ భోరుమంది మణి. ❑

96. భార్యతో విపరీతంగా పోట్లాడాక భర్త మూర్తి పూజగదిలో దూరి హృదయ
విదారకంగా మొరపెట్టుకున్నాడు.
"దేవుడా....! నేనీ బాధాలు భరించలేను. నన్ను తీసుకుపో....!"
అంటుండగానే అతని భార్య వచ్చి తనూ దేవుడి ముందునిలబడి"
స్వామీ.... నన్ను తీసుకుపో....." అంది.
భర్తమూర్తి కొద్దిగా ఆలోచించి మళ్ళీ అన్నాడు.
"పోన్లే స్వామీ...! నన్నొద్దు... మా ఆవిణ్ణే తీసుకు పో.......! ❑

97. బాబురావు హోటల్‌కి వెళ్ళాడు. సర్వర్ వచ్చి ఆర్డర్ అడిగాడు.
"వేడిగా ఏమున్నాయ్....?" అడిగాడు బాబూరావు.
"ఇడ్లీ......" చెప్పాడు సర్వర్.
"ఇంకా వేడిగా ఏముంది....?"
"పెసరట్టు......"
"ఇంకా వేడిగా ఏముంది.....?"
"చపాతీ....."



"ఇంకా వేడివేడిగా ఏముంది......?"
"సాంబారిడ్లీ......"
"చేతులు కాలేటంత వేడిగా ఏమున్నాయ్....?"
అప్పటికే సహనం నశించిన సర్వర్ "నిప్పులు...." అంటూ ఓ పాత్ జోక్ పేల్చాడు.
"ఆహా...! అలాగా...!! అయితే ప్లేటు నిప్పులు పట్రా.... " అన్నాడు బాబూరావు.
సర్వర్‌తిక్కరేగి నిజంగా ప్లేటులో నిప్పులు తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.
బాబూరావు జేబులోంచి ఓ సిగరెట్ తీసి నిప్పంటించుకొని బయటు కెళ్ళిపోయాడు. ❑

98. "సార్...! సార్.....!! ఇన్‌స్పెక్టర్ గారూ...! మా తాతయ్యను మా నాన్న చిన్నాన్న కలసి నిప్పంటించి తగలబెట్టేస్తున్నారు. మీరు అర్జెంటుగా రావాలి..." అన్నాడు ఫోన్లోగోపి.

"అలాగా....! ఇప్పుడే వస్తున్నా..... ఇంతకూ ఎక్కడ తగలబెడ్తున్నారు...?"
"ఊరి చివర శ్మశానంలో...." ❑

99. రవాణా సదుపాయలు లేని కాలంలో కాలినడకన వెళ్లే బాటసారులు రాత్రివేళల్లో ఏ ఊళ్లోనో, ఏ యింట్లోనో తలదాచుకునేవారు.
ఒక యువకుడు ప్రొద్దుగూకే వేళకి ఒక ఊరు చేరి ఆశ్రయం కోసం ఎంతో ప్రయత్నించాడు.
"అయ్యా....! ఈ రాత్రి మీ యింట్లో గడిపివెళ్తానండీ....."
"అబ్బే....! వయసులో ఉన్న ఆడపిల్లలు ఉన్నారిక్కడ... మరోచోట ప్రయత్నించు...." అంటూ వరుసగా అవే సమాధానాలు రావడంతో విసిగిపోయి ఆఖరు ప్రయత్నంగా ప్రశ్న మార్చి అడిగాడు.
"అయ్యా ....! మీ యింట్లో వయసులో ఉన్న ఆడపిల్లలున్నారా....?"
"ఉంటే..... ఏమిటీ....?"
"ఈ రాత్రి గడిపి వెల్దామని....." ❑

00. పిల్లలు తరచుగా ఎస్.టి.డి.కాల్స్ చేయడం వల్ల టెలిఫోన్ బిల్ పెరిగిందని గమనించిన భీమారావు ఇక ముందు పిల్లలెవరూ అరనిముషం కన్నా ఫోన్‌లో మాట్లాడ్డానికి వీల్లేదని చెప్పాడు.
"అరనిముషంలో ఏం మాట్లాడతాం నాన్నా....!" చిరాగ్గా అడిగాడు పెద్దబ్బాయి నారాయణ.
"నేను పెట్టేస్తున్నాను నువ్వు నా నెంబర్‌కి ఫోన్ చెయ్యి....." అనడానికి అరనిముషం కన్నా ఎక్కువ పట్టదుగా....!" అన్నాడు భీమారావు.❑

01. బస్సు ఓ పెద్ద కొండమీదుగా ప్రయాణిస్తోంది. కింద ఎటు చూసినా భయంకరమైన, లోతైన లోయలు కనిపిస్తున్నాయి. కండక్టర్ ప్రయాణీకులతో "అయ్యా! డ్రైవర్ గారి కూతురు పెళ్ళిఉంది. కట్నం కోసం మీకు తోచినంత అందరూ ఇచ్చి పుణ్యం కట్టుకోండి......" అన్నాడు.

"డ్రైవర్ కూతురు పెళ్ళికి డబ్బులు మేమెందుకు ఇవ్వాలయ్యా....?" అన్నారంతా.



"మీ ఇష్టం!. డ్రైవర్ ఆత్మహత్య చేసుకుందామను కుంటున్నాడు. డబ్బు దొరక్క పోతే ఇప్పుడే బస్సులోంచి దూకుతాడట....." అన్నాడు కండక్టర్. అందరూ వెంటనే డబ్బులిచ్చేశారు.

102. "ఏమిటీ న్యూస్‌పేపర్ నుంచి చింపుకుంటున్నావ్...? రాజుని అడిగాడు ఫ్రెండ్ పార్థు..

"బాంబేలో ఒక ఇల్లాలు జేబులు వెతికి డబ్బులు తీసేస్తున్నందుకు భర్త విడాకులు ఇచ్చేశాడుట. ఆ విషయం పేపర్లో వేస్తే చింపు కుంటు న్నాను......" అన్నాడు రాజు.

"అది నీకెందుకు...? " ఆశ్చర్యంగా అడిగాడు పార్థు.

"నా ఫాంటు జేబులో వేసుకుందామని... చెప్పాడు రాజు. ❑

103. ఒకతను పుస్తకాల షాపుకెళ్ళి అక్కడ చాలా రద్దీగా ఉండడంతో అయిదు నిముషాలు ఆగి షాపతన్ని అడిగాడు.

"దొంగతనం చేయడం ఎలా? అనే పుస్తకం ఉందా...?"

షాపువాడు చెప్పాడు.

"దొంగతనం చేయడం ఎలా? పట్టుబడకుండా....."అనే మరో పుస్తకం ఉంది. అది చదవాలి మీరు....."

"ఎందుకు....?"

'ఇందాక మీరు సంచిలో వేసుకున్న పుస్తకం 'దొంగిలిస్తూంటే పట్టుకోవడం ఎలా?' కాబట్టి..." అన్నాడు షాపతను.

104. "డాడీ.....! , డాడీ...!! మా స్కూల్లో నాటకాలు వేయిస్తున్నారు. నాక్కూడా ఓ పాత్ర ఇచ్చారు...." అన్నాడు. అప్పుడే స్కూల్ నుండి వచ్చిన కొడుకు.

"అలాగా....! ఇంతకూ నీకేం పాత్ర ఇచ్చారు....?" అడిగాడు తండ్రి.
"తండ్రిపాత్ర డాడీ...!
"తండ్రి పాత్రా....? కాస్త డైలాగులుండే పాత్ర అడగలేకపోయావా....?' నీర్సంగా అన్నాడు తండ్రి. ❑

105. "ఈ వేళ ఎందుకింత ఆలస్యమైంది...?" చాలా కోపంగా అడిగాడు మేనేజర్.
"అదీ... అదీ..... ఇంటిదగ్గర వంటకు ఉల్లిపాయలు కోస్తుంటే వేలు తెగింది సార్.....!"
నసుగుతూ చెప్పాడు గోవిదం.
"ఛ..... అలా చెప్పడానికి సిగ్గులేదూ....?"
"నిజం సార్....!"
"చాల్లేవయ్యా... చెప్పావు.... నేను ఇరవై సంవత్సరాల నుండి వంటచేస్తున్నాను. కాని ఇంతవరకూ చిన్న గాటైనా పెట్టుకోలేదు తెలుసా.....?" అన్నాడు మేనేజర్. ❑

106. డాక్టర్ కైలాసం కారులో వెళ్తూ తన పేషెంట్‌ను చూడ్డానికి ఓ యింటి ముందు ఆగి పేషెంట్ డాక్టర్ని చూసి "మీ మందులు, మీ వైద్యం మంచిదికాదు. మీరిచ్చినవన్నీ పరమ చెత్త మందులని మరో డాక్టర్ చెప్పాడు. అందుకే అవి వాడుతున్నాను..." అన్నాడు డ్టార్ తిరిగి వెళ్ళిపోతూ అన్నాడు.
"కొద్ది రోజులు ఆగితే నావి చెత్తమందులో ఆ డాక్టర్‌వి చెత్తమందులో పోస్ట్‌మార్టమ్‌లో తెలుస్తుందిలే..." ❑

107. "డాక్టర్....! నాకు కడుపు నొప్పి తగ్గలేదు. పైగా ఎక్కువైపోయింది...."
"మిమ్మల్ని సంవత్సరం పిల్లాడు తినే తిండి తినమన్నానుగా....."
అలాగే తిన్నానండీ...."
"ఏం తిన్నారు.....?"
"చాక్‌లెట్లు, బిస్కట్లు, వేరుసెనక్కాయలు, అరటితొక్కలు, బఠాణీలు, మట్టి పెల్లలు...." ❑

108. ఎనభై ఏళ్ళ ముసలివాడు ఓ డాక్టర్ దగ్గరకెళ్ళాడు.

"డాక్టర్....! నేను ఈ మధ్య ఓ పదహారేళ్ళ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాను. అంతే కాదు తండ్రిని కూడా కాబోతున్నాను. దీనిపై మీ అభిప్రాయం....?" అనడిగాడు.

"నేనో కథ చెప్తాను వినండి. నేనొకసారి అడవికి వెళ్ళాను కాస్తదూరం వెళ్ళేసరికి గాండ్రిస్తూ ఓ పులి వచ్చింది. నా చేతిలో ఓ గొడుగు మాత్రం ఉంది. అంతే....! వెంటనే నేను గురి చూసి పులిమీదకు గొడుగు విసిరాను పులి చచ్చిపోయింది....." అన్నాడు డాక్టర్.

"అబద్ధం...! మీరు గొడుగు విసిరే సమయానికి చాటునుండి ఎవరో తుపాకీ గురిపెట్టి పులిని చంపేసి ఉంటారంటాను నేను...." అన్నాడు ముసలివాడు.

" మీ విషయంలోనూ నేను అదే అంటాను...." అన్నాడు డాక్టర్. ❑

109. దేవదాసు బాగా త్రాగేసి ఇంటికొచ్చాడు. అర్ధరాత్రి కావడంతో భార్యకు అనుమానం రాకుండా, వాసన తెలియకుండా ఓ అద్దం ముందు నిలబడి నోటికి ప్లాస్టర్ అతికించి వెళ్ళి పడుకున్నాడు. పొద్దున్నే భార్య వచ్చి



"మీరు రాత్రి బాగా త్రాగొచ్చారా...?" అనడిగింది.

"అబ్బే.... నేనసలు త్రాగ లేదు...." అన్నాడు దేవదాసు.

" మరి ఈ ప్లాస్టర్ ఎవరు అతికించారు......?" కోపంగా అడిగింది అద్దానికి అతికించి ఉన్న ప్లాస్టర్ చూపిస్తూ. ❑

110. కాకినాడ రైల్వేస్టేషన్‌లో రైలు కదలడానికి సిద్ధంగా ఉంది. రైల్లో కూర్చొని బయటకు చూస్తున్నాడు బాబూరావ్. ఉన్నట్టుండి అతని కళ్ళు కాస్త

దూరంగా నిలబడి తనవైపు చూస్తూ ఏదో చెబుతున్న ఓ వ్యక్తి మీద పడ్డాయి. కాని అతనేం చెప్తున్నాడో బాబూరావుకి సరిగ్గా వినపడ్డంలేదు. పోనీ దగ్గరకెళ్ళి అడుగుదామంటే రైలు కదలిపోతుందేమో అనిపించింది. అతను మాత్రం ఇంకా ఏదో చెబుతున్నట్లే ఉన్నాడు. బాబూరావు టెన్షన్ భరించలేక రైలుదిగి అతని దగ్గరకెళ్ళి "సార్....! ఇందాకట్నుండి మీరు ఏదో మాట్లాడుతున్నారు. కాని ఎనౌన్స్‌మెంట్లు, ట్రెయిన్లహోరు, జనాలహడావిడిలో నాకు విన్పించడం లేదు. ఇంతకూ మీరు మాట్లాడేదేమిటి..?" అన్నాడు.

వెంటనే అతడు చిరాగ్గా " నేనసలు ఏమీ మాట్లాడలేదయ్యా.....! వక్కపొడి నములుతున్నా.... అంతే!" అన్నాడు. ❑

111. భార్య వడ్డించిన అన్నం తింటూ అన్నాడు భర్త.

"ఛ... ఈ వంట అసలు బాగోలేదు. మా అమ్మ చేసే వంటలాగ రుచిగా లేదు..." అని.

"మీ జీతం మా నాన్న జీతం లాగ ఐదువేలు లేదు. మరి నేను దెప్పిపొడిచానా...?" కోపంగా అంది భార్య. ❑

112. చంటిపిల్లాణ్ణి బాగా ఎత్తుగా ఉన్న మంచం మీద పడుకోబెట్టి పక్కింటావిడతో దొడ్డివైపున కబుర్లు చెబుతూ కూర్చుంది. కృష్ణవేణి పిల్లాడు లేచి ఏడుపు మొదలు పెట్టినా ఆవిడ నలు విన్పించుకోవడంలేదు. అంతలో ఆఫీసునుండి వచ్చిన భర్త కోపంగా "నీకసలు బుద్ధుందా....? పిల్లాడు ఏడుస్తున్నా చూడ్డంలేదు. పైగా అసలు వాణ్ణి అంత ఎత్తుగా ఉన్న మంచం మీద ఎందుకు పడుకోబెట్టావు....?"అన్నాడు.

"ఏముందీ...! అంత ఎత్తుమీద నుండి కిందపడితే శబ్దం బయటకు వినిపిస్తుందని...." రుసరుసలాడుతూ చెప్పింది కృష్ణవేణి. ❑

113. "ఏవండీ....! ఈ రోజు మన పెళ్ళిరోజు కదా...! సరదాగా బయటకెళ్ళి తిరిగొద్దామండీ...!" అంది భార్య.

"అలాగే తిరుగుదాం. కాని తాళం చేతులు పక్కింటి వాళ్లకు ఇచ్చి వెళ్దాం. ఎందుకంటే మనిద్దరిలో ఎవరం ముందొచ్చినా వెయిట్ చేయనవసరం లేదు...." అన్నాడు భర్త. ❑

113ఎ. "సార్...! నాకు ఒక గంట పర్మిషన్ ఇస్తే ఇంటికెళ్ళొస్తాన్....." అన్నాడు శ్రీహరి.

"ఎందుకోయ్...! పొద్దున్నే మీ ఆవిడను పుట్టింటికి బస్సెక్కించి వచ్చానన్నావు. ఇక నీకు ఇంటిదగ్గర పనేముటుంది......?" అన్నాడు మేనేజర్.

"మా యిద్దరికీ పెళ్ళయ్యాక మొట్టమొదటిసారి నా భార్య పుట్టింటికి వెళ్ళింది. నా భర్యలేని ఇల్లు ఎంతహాయిగా, ప్రశాంతంగా ఉందో చూడాలని ఉంది సార్.....!" అన్నాడు ఆత్రంగా శ్రీహరి. ❑

114. చాలాకాలం తర్వాత కలసిన మిత్రుడు మధుతో అన్నాడు దాసు.

"ఒరేయ్... మధూ....! మనం కాలేజీలో చదివేటప్పుడు నన్ను అవమానపరిచి ఆడరౌడీలా ప్రవర్తించిన రాణిని చాలా దారుణంగా రేప్ చేశానురా....!

"నిజమా....! మరి నీకు చట్టం శిక్ష విధించలేదా....?

"నూరేళ్లు విధించింది....."

"నూరేళ్ళు....! మనం చట్టంలో ఏనేరానికీ ఇన్నేళ్ళు శిక్షలేదే....!

"అదేరా...! రాణితో నా పెళ్ళి జరిపించారు....." ❑

115. మూడు గంటలసేపు ధారాళంగా ఉపన్యసించిన ఓ రాజకీయనాయకుడు ॥క్షమించాలి చాలా ఎక్కువసేపు మాట్లాడినట్టున్నాను. ఎందుకంటే నాచేతికి వాచీ లేదు....." అన్నాడు.

"చేతికి వాచీలేకపోయినా వెనక కాలెండర్ ఉందిగా....!" అన్నాడు అప్పటికే విసిగిపోయిన ఓ వ్యక్తి. ❑

116. "దేవికా..! నిన్ను సినిమాథియేటర్లో ఒకబ్బాయితో కలసి పళ్ళికిలిస్తూ

ఒకరినొకరు రాసుకుంటూ పక్కింటి పిన్నిగారి కంట్లో పడ్డావట. ఇంతకు ఎవరా అబ్బాయి....? నిలదీసింది తల్లి.

"నూన్‌షోలోనా...? ఫస్ట్‌షోలోనా మమ్మీ....?" అడిగింది కూతురు. ❑

117. ఒక భారీకాయుడు ఒక షాపుకెళ్ళి "నాకొక దోమ తెర చూపించవోయ్....!" అన్నాడు.

"ఇది చూడండిసార్..! ఈ దోమతెరలో ఒక్కదోమకూడా దూరే సందులేదు.. చాలా స్పెషల్ క్వాలిటీ సార్...!" అన్నాడు షాపులో సేల్స్‌మేన్.

"చాల్చాల్లేవయ్యా! ఇక వూరుకో. చిన్న దోమ కూడా దూరే అవకాశం లేని ఈ దోమతెరలో ఇంత భారీకాయుణ్ణి నేనెలా దూరగలను?" అంటూ వెళ్ళిపోయాడా భారీకాయుడు. ❑

118. కమలకు కొత్తగా పెళ్ళయింది. కూతుర్ని చూడ్డానికి వచ్చిన తల్లి "అమ్మా! కమలా అల్లుడుగారు నిన్ను ఎలా చసుకుంటున్నారే?" అంది.

"చాలా బాగా చూసుకుంటున్నారమ్మా! నిదట్లో కూడా నన్నేతల్చుకుంటున్నారు. కానీ..." అంటూ ఆపి పడీ పడీ నవ్వసాగింది.

"ఎందుకే అలా నవ్వుతున్నావ్.....?"

"ఏంద లేదమ్మా....! ఆయనకు నా పేరు సరిగా గుర్తుండక నిద్దట్లో రమ ముద్దుపెట్టు, కళ్యానీ కౌగిలించుకో అంటూ రకరకాల పేర్లతో ఇబ్బంది పడుతూ ఉంటారు. ❑

119. సోషల్ మాస్టారు ఆనంద్‌ని అడిగారు.

"ఆనంద్...! రేడియోకన్నా దినపత్రికలే ఎప్పుడూ గొప్పని అంటారు ఎలా?"

"అగ్గిపుల్లగీసి అంటిస్తే పేపరు వెంటనే అంటుకుపోతుంది. రేడియో త్వరగా అంటుకుపోదు. పైగా కాస్త పెట్రోలు కూడా అవసరముంటుంది. ❑

120. " ఈదోసెలు బాగా మాడిపోయాయి అమ్మగారూ పారేయమంటారా...?
"ఎందుకు పారేయడం? మీ అయ్యగారింకా టిఫిన్ చేయ్య లేదుగా ఉంచు..." ❑

121. విమానం ఆకశంలో ఎగురుతోంది. ఇద్దరు పిల్లలు లోపల ఆడుకుంటున్నారు. ఎయిర్ హెూస్టెస్ ఎంత చెప్పినా వాళ్ళు ఆట ఆపలేదు.



"ఏయ్..! పిల్లలు ఇది విమానం . ఇందులో ఆడకూడదు. కావాలంటే బయటికిపోయి ఆడుకోండి...." అంది కోపంగా. ❑

122. "నా భార్య జ్ఞాపకశక్తితో మేమందరం ఛస్తున్నామనుకోండి. ...." అప్పారావుతో అన్నాడు సుబ్బారావు.
"ఏమన్నా మర్చిపోయి మిమ్మల్ని ఇబ్బంది పెడుతోందా? జ్ఞాపకశక్తి పెరగడానికి ఏదైనా మందుకావాలా?" అడిగాడు అప్పారావు.
"అబ్బే..! జ్ఞాపకానికి మందు అవసరం లేదండీ మతిమరుపుకి కావాలి. ప్రతి విషయం జ్ఞాపకముంచుకొని నాతో తగువుకి దిగుతోంది. అదే అసలు సమస్య" అంటూ వాపోయాడు సుబ్బారావు. ❑

123. "ఈసీసాలోని మందు ఒక చెంచాడు తీసుకొని అందులో నాలుగు చెంచాలునిళ్లు కలుపుకొని త్రాగు....."
"కానీ డాక్టర్...! మాయింట్లో ఒక చెంచా మాత్రమే ఉంది....." ❑

124. ఒక స్వామీజీ ఒకసారి కాత్రేనికోన అనే గ్రామం వెళ్ళాడు. అక్కడ నాలుగు రోజులుండి దుష్టులలో పరివర్తన తీసుకు రావాలనుకున్నాడు. ఒకరోజు ఆయన రోడ్డుమీద నడుస్తుంటే ఒక వ్యక్తి గుప్పుగుప్పుమని సిగరెట్ కాల్చడం చూసి అతని వద్దకు వెళ్ళి "చూడు నాయనా!

ధూమపానం మహాపాపం! రేపు నీవు చనిపోయాక స్వర్గానికి వెళ్ళావనుకో...! అప్పుడు నీ ఉపిరి నుండి ఏమాత్రం సిగరెట్ వాసన వచ్చినా నిన్ను వెంటనే దేవదూతలు నరకంలోకి నెట్టేస్తారు....." అన్నాడు.

"భలేవారు స్వామీ...! ఆ ఊపిరి ఇక్కడ ఆగిపోయాకే కదా మనం స్వర్గానికైనా నరకానికైనా వెళ్ళేది...." వెంటనే సమాధానం చెప్పాడావ్యక్తి.

125. "రామూ! కుక్కజాతికి చెందిన నాలుగు జంతువుల పేర్లు చెప్పు.."

" తల్లికుక్క, తండ్రి కుక్క, పెద్ద పిల్ల కుక్క, చిన్న పిల్ల కుక్క..."❑

126. సైన్సు మాస్టారు విద్యార్థిని అడుగుతున్నారు.

"రవీ! కన్ను, ముక్కు, చెవి వల్ల ఉపయోగాలేమిటి?"

"కళ్లతో అన్నీ చూడొచ్చు. ముక్కుతో శ్వాసపీల్చవచ్చు. చెవులు మీరు గుంజడానికి మెలిపెట్టడానికి పనికివస్తాయి. సార్...! ❑

127. టేబుల్ మీదున్న కాఫీ కప్పుల్లో బూడిద చూసి చాలా కాలం తర్వాత వాళ్లింటికి వచ్చిన దూరపుచుట్టం రాగిణిని అడిగాడు.

"ఈ బూడిదేమిటమ్మాయీ....." అని

"అది మా ఆయనది అంకుల్...!" అంది.

"అయ్యయ్యో! ఎన్నాళ్ళయిందమ్మాపోయి? నాకసలు ఆ విషయమే తెలీదు.. ఇంత చిన్న వయసులో అబ్బాయిని తీసుకుపోయి ఆ దేవుడు నీకు చాలా అన్యాయం చేశాడమ్మా...." అంటూ సానుభూతి కురిపిస్తున్నాడు చుట్టం.

"అహ..! ఆయన పోలేదంకుల్. మా ఆయన మహా బద్ధకం. ఏష్ట్రే తెచ్చుకోలేక అప్పుడప్పుడు అందులో వేసేనస్తూ ఉంటారు. అదిపారబోయ్యాలని ఎప్పటికప్పుడు నేనూ బద్ధకిస్తున్నానంతే....!" అంది రాగిణి. ❑

128. "ఎమ్మెల్యే ఏడుకొండలు కూతురు కుమారిని అడిగింది స్నేహితురాలు.
"కుమారీ! నీకెన్ని సంబాధాలొచ్చినా కాదంటున్నావట. అసలెలాంటివాడు కావాలనుకుంటున్నావు?"
"పెళ్ళి కానంతవరకూ అతడొక అభ్యర్థిలాగ నేనో ఓటరు లాగ ఉండాలి. పెళ్ళయ్యాక మాత్రం గెలిచిన అభ్యర్థిలాగా నేను ఓటేసిన ఓటరులాగా అతనూ ఉండాలి...." తెలివిగా చెప్పింది కుమారి. ❑

129. "బంగారమ్మగారూ..! ఈ వేళ ఉదయం మీ అబ్బాయి రాళ్ళు విసిరికొట్టి మా వీధివైపు కిటికీ అద్దాలు పగలగొట్టాడు. వాణ్ణి ఏం చేయాలంటారు...?" అని కోపంగా అడిగింది తాయారమ్మ.
"కోప్పడకండి.... పిల్లలన్న తర్వాత అల్లరిచేయకుండా ఉంటారా? వాళ్ల ఏదైనా తప్పుచేస్తే శిక్షించడం కాకుండా మంచి మాటలు చెప్పి ఆతప్పు మరోసారి చేయకుండా చూడాలి...." నచ్చచెప్పింది బంగారమ్మ.
"అయితే ఓకే.... నిజానికి అద్దాలు పగలకొట్టింది మా అబ్బాయి. పగిలింది మీ వీధి కిటికీల అద్దాలు వెళ్ళి చూడండి..." నవ్వుతూ చెప్పింది తాయారమ్మ. ❑

130. "నాన్నా...! నాన్నా..! డైనింగ్ రూంలో నల్లపిల్లి దూరింది...." అన్నాడు రమేష్.
"పిల్లులు నల్లగా ఉండి, అవి మనింట్లో ఏదైనా తింటే మనకి చాలా అదృష్టం రా...""
"నిజమే అయ్యుంటుంది నాన్నా....! ఈ వేళ అమ్మ చికెన్ బిర్యానీ చేసింది అది మేమందరం తినేశాము. నీకని ఉంచింది మాత్రం ఇపుడా నల్లపిల్లి తినేస్తోంది...." చెప్పాడు రమేష్. ❑

131. "ఏవయ్యా...! విశ్వనాథం ఈ రోజు కూడా 25 నిముషాలు ఆఫీసుకు లేటుగా వచ్చావు. ఉద్యోగంలో చేరి ఆరు నెలలయింది. మిగతావాళ్లందరూ కనీసం ఎన్ని గంటలకి వస్తున్నారోనన్న విషయమైనా గమనించావా...?" అడిగాడు బాస్ కోపంగా.

"అదెలా కుదురుతుంది సార్...! వాళ్లు రోజూ నేనొచ్చేసరికే సీట్లల
ఉంటున్నారు. మరి......" వినయంగా చెప్పాడు విశ్వనాథం. ❑

132. సైన్సు మాష్టారు పాఠం చెబుతూ మధ్యలో ఓ విద్యార్థిని అడిగారు
"రాముూ ఈ టేబుల్ మీద ఒక గ్లాసు, అందులో ఆసిడ్ ఉన్నాయి
నా చేతిలో ఒక రూపాయి నాణెం ఉంది. నాణెం గ్లాసులో వే
కరుగుందా? లేదా?"
"కరగదు సార్....!"
"ఎందుకు చెప్పు చూద్దాం...."
"చెప్పడానికేముందిసార్....! నాణెం కరిగేటట్లయితే మీరు గ్లాసుల
వేయరుగా......" ❑

133. ఓ హోటల్లో గోడగడియారం ఎప్పుడూ 10 గంటల మీదే ఉండట
చూసి మూడు గంటలకు వచ్చిన ఓ కస్టమర్ అడిగాడు.
"ఏవండీ...! మేనేజర్‌గారూ...! మీరింక ఆ గడియార
బాగుచేయించరా...?"
"బాగు చేయించకపోవడమే మంచిదని పిస్తోందండీ..! ఎవరొచ్చిన
టైము పది అయిందను కొని ఆకలేస్తుందని భోజనం బదులు టిఫి
మరికాస్త ఎక్కువతిని వెళ్తన్నారండీ అన్నాడు మేనేజరు. ❑

134. "రామారావ్...! ఏవయ్యా...! ఈ వేళ ఏకంగా ఆఫీసుకి గంటలేటుగ
వచ్చావ్...?" చిరాకుగా ఫైల్స్ చూసుకుంటూ అడిగాడు మేనేజ
మనోహరరావు.
"ఈ వేళ మా డాబా మీద నుండి కింద పడిపోయానుసార్....!
అందుకు లేటయింది భయపడుతూనే అన్నాడు అప్పారావు.
"వాట్....! వాట్....! నీకు డాబా మీద నుండి క్రిందపడడానికి ఏకంగ
గంటటైం పట్టిందా?" మరింత విసుక్కున్నాడు. ❑

135. "ఇప్పటికి నేను లెక్క పదిసార్లు చేశాను మేడం..." అంది చిట్టి.
"వెరీగుడ్...! ఎన్నిసార్లు చేస్తే అంత బాగా ప్రాక్టీసు అవుతుంది...'
అంది టీచర్.

"కానీ.... ఆన్సరేమిటో తెలియడం లేదు మేడమ్...."

""ఏమిటీ....! అన్ని సార్లు చేసినా ఆన్సరే రాలేదా.....?"

"వచ్చింది మేడం, కాని ఒక్కోసారి ఒక్కొక్క రకం ఆన్సరు వస్తోంది మరి......" ☐

136. టైపిస్టు తార తన సీట్లో కూర్చొని వయ్యారంగా గోళ్లరంగు వేసుకుంటోంది. వచ్చి గంటైనా వర్క్‌మొదలెట్టని తారని చూసి ఒళ్లు మండిపోయింది సీనియర్ టైపిస్టు చిదానందానికి. నెమ్మదిగా సీట్లోంచి లేచి ఆవిడ దగ్గరకొచ్చాడు.



"చూడమ్మా! తారా! నీ వర్క్ గురించి బాస్‌కి కంప్లయింట్ చేద్దామను కుంటున్నాను......" అన్నాడు సౌమ్యంగా.

"తప్పకుండా చెయ్యండి..." అంది గోళ్ళరంగువేసుకోవడంలో పూర్తిగా మునిగిపోయిన తార పరధ్యానంగా.

"మరి నువ్వు వర్కెప్పుడు మొదలెడతావో చెప్పు...." అన్నాడు చిదానందం ఒళ్లుమండి.

"నా గురించి పట్టించుకోవడం మానేసి మీరు సీట్లో కూర్చొని మీ పని మొదలెట్టిన మరుక్షణం..." అంది తార గోళ్లరంగు మెరుపుకి మురిపెంగా నవ్వుకుంటూ. ☐

137. ఓ బిజినెస్ మాగ్నెట్ తన స్నేహితుడితో ఇలా అన్నాడు.

"జీవితంలో ఓ కష్టం తీరిందనుకుంటే మరొకటి వచ్చిపడుతోందిరా! అందుకే నేనొక స్కీమ్ మొదలు పెట్టాను. ఓ యువకుడిని తీసుకొని నాకొచ్చే సమస్యల్ని బాధల్నీ అతనికప్పు చెప్పేస్తున్నా..."

"అయితే అవన్నీ భరించేందుకు అతడికి జీతమెంతిస్తున్నావ్...?"

అడిగాడు స్నేహితుడు.

"అయిదువేలు...."

"ప్రతినెలా అంత డబ్బెక్కడినుంచి తేగలవు..?" సందేహం వెలిబుచ్చాడు.

"అదే అతడి మొదటి వర్రీ అవుతుంది మరి...." ❑

138. "ఈ రాత్రికి మా ఫ్రెండ్ బాబూరావ్‌ని మనింటికి డిన్నర్‌కి పిలుద్దామనుకుంటున్నాను లతా...!" చెప్పాడు ఫోనులో రాజారావ్.

"ఏమిటీ డిన్నరుకా..! మీ కేమైనా బుద్ధుందా అసలు. ఓ మూల వంటవాడు మానేశాడు. స్టౌబర్నర్‌లు సరిగా మండటం లేదు. నానిగాడికి జ్వరం, అప్పుపూర్తిగా తీరిస్తే కాని కిరాణా కొట్టువాడు సరుకులివ్వడు..." ఆమె దండకం పూర్తి కాకుండానే అన్నాడు రాజారావ్.

"అందుకే లతా! పిలవడం పాపం ఆ వెర్రివెధవ పెళ్ళిచేసుకోవాలని తెగముచ్చట పడుతున్నాడు...." అంటూ ఫోను పెట్టేశాడు రాజారావ్.

139. "ప్రకృతిలోని ప్రతిజీవినుండి ఏదో ఒక గుణాన్ని నేర్చుకోవచ్చునన్నారు. పెద్దలు. ఆ ప్రకారం దోమనుండి మనం నేర్చుకోదగినది ఏమిటి...? అనడిగింది టీచర్.

"ఇతరులను కొట్టి (కుట్టి) భాదించి ఆనందించవచ్చు. అదే దోమల నుండి ముఖ్యంగా నేర్చుకొనే అంశమండీ...." అన్నాడు విద్యార్థి.❑

140. "అయామ్‌సారీ....! నిన్ను వారం రోజులు ఎక్కువగా జైల్లో ఉంచాం. పొరబాటున" అంటూ ఖైదీని విడుదల చేశారు జైలు అధికారులు.

"భలేవారండీ తమరు...! ఎప్పుడు విడుదలైతే ఏమిటి...? ఎలాగైనా పదిరోజుల్లోనే మళ్లీ ఇక్కడకి రావాల్సిన వాడినేగా...! ఈసారి వచ్చినప్పుడు ఈ పదిరోజులూ అందులో మినహాయింపు ఇవ్వండి. లెండి....." అన్నాడు ఖైదీ. ❑

141. హైదరాబాద్ మహానగరంలో ఓ షాపులో ఫ్రేముచేసి భారతదేశ నాయకుల ఫోటోలు అమ్ముతున్నారు. మారు వేషంలో ఉన్న మాజీముఖ్యమంత్రి చిదానందం షాపు నిండా మొత్తం తన ఫోటోలే కనిపించడం చూసి పొంగిపోయాడు. ఎంతో సంతోషంగా షాపులోకి వెళ్ళి షాపు ఓనర్ని "చూడు బాబూ....! షాపులో కేవలం చిదానదంగారి ఫోటోలు మాత్రమే వేలాడదీశావు. వీటితో బాటు గాంధీ, నెహ్రూ వంటి జాతీయనాయకులు, పొట్టి, శ్రీరాములు, ఎన్.టి.రామారావు వంటి ప్రాంతీయ నాయకులఫోటోలు కూడా వ్రేలాడదీయలేకపోయావా...? అనడిగాడు.

ఆ షాపువాడు " మీరు చెప్పినట్లు వాళ్లందరి ఫోటోలు ఇక్కడ వ్రేలాడదీశామండి. అవన్నీ పెట్టిన వెంటనే అమ్ముడైపోయాయి. కాని ఈ బోడి చిదానందం ఫోటోలు మాత్రం సంవత్సరం నుండి ఇలాగే వ్రేలాడుతున్నాయి..." అన్నాడు.

అంతే....! ఎందుకడిగానురా బాబూ...! అని మనసులోనే గొణుక్కుంటూ మరేమీ మాట్లాడకుండా వెళ్లిపోయాడు చిదానందం.

142. "ఈ జటిలమైన కేసులో తీర్పు చెప్పాలంటే ఆ ఏడుకొండలవాడే దిగి రావాలి" అన్నాడు తనలో తానే మాట్లాడుకున్నట్లుగా జడ్జిగారు. అక్కడున్న బంట్రోతు బయటకు పరుగెత్తి "ఏడుకొండలూ... ఏడుకొండలూ..." అనరిచాడు. కొద్ది నిముషాల తర్వాత జడ్జిగారి వద్దకు వచ్చి "ఏడుకొండలవాడు రాలేదు సార్....! ఎంత పిలిచినా జవాబులేదు...." అన్నాడు వగరుస్తూ. □

143. కొత్తగా పెళ్ళయింది ఆనందరావుకి భార్యకాపురానికొచ్చింది. ఓ రోజు ఆమెచేసిన రెండు మూడు రకాల వంటకాలు చవిచూసి "ఛి....ఛీ... ఇవసలు వంటలేనా....? పరమ ఛండాలంగా ఉన్నాయి...." అన్నాడు ఆనందరావు.

"అలా కోప్పడకండి... ఒక్క రెండు వారాలు ఓపిక పట్టండి..." వినయంగా అంది భార్య.

"ఏం....? అప్పటికి బాగా తయారు చేస్తావా....?"
"కాదు.... మీరే ఈ వంటకాలకి అలవాటు పడిపోతారు....." ❑

144. కొత్తగా పట్నంలో దిగి మంచి ఏరియాలో ఇల్లు చూసి నివాసమేర్పరచుకుందా కుటుంబం. ఆ సాయంత్రం ఇంటి ఇల్లాలు కూరలు కొనడానికి ఓ షాపులోకి అడుగుపెట్టింది. రెండు ట్రేలలో టమోటాలున్నాయి. రెండు ట్రేలలోనివీ ఒకే రకం టమోటాలు. వాటి ధర అడిగితే మాత్రం "ఒక దాంట్లోవి కేజి పన్నెండు రూపాయలు మరోదానిలోనివి కేజి ఇరవై రూపాయలు...." అన్నాడు షాపువాడు.
" ఈ రెండు ఒకే రకం, కాని ధరల్లో తేడా ఎందుకు...?" అర్థంకాక అడిగిందా ఇల్లాలు.
"ఏముంది మేడం! కొందరు ఎక్కువ ఖరీదైనవే కొందామనుకుంటారు. ఆ మొదటి ట్రేవి అలాంటివారి కోసం. మరి కొందరు వీలైనంత తక్కువ ధరలోనే కావాలనుకుంటారు. ఆ రెండో ట్రేలోవి ఇలాంటి వారి కోసం...." అన్నాడు షాపుఓనరు సవినయంగా. ❑

145. ఓ గుమస్తా ఉద్యోగానికి ఇంటర్వ్యూ జరుగుతోంది. ఇంటర్వ్యూ అధికారి కాండిడేట్‌ని ప్రశ్నించాడు.
"ఏవయ్యా! సూర్యుడు భూమి కెంత దూరంలో ఉన్నాడు.....?
పై నున్న సూర్యుడు భూమికి దగ్గరగా రావలసిన పనిలేదను కుంటాసార్...!" అన్నాడా అభ్యర్థి . ❑

146. "రాజూ...! ప్రపంచంలో ఎన్నో సిటీలున్నాయి. వాటిలో భారీగా కనిపించే, శక్తి వంతమైన సిటీ ఏమిటో చెప్పు....."
"ఎలక్ట్రిసిటీ సార్......!" ❑

147. పాపారావు పాపాయిని గాఢంగా ప్రేమించాడు. పాపాయి లేనిదే జీవించలేననే నిర్ణయానికొచ్చాడు. ఒకరోజు పాపాయి వద్దకు వెళ్ళి "పాపాయీ....! నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. నీ కోసం ఏమైనా చేస్తాను. అంతేకాదు. నీవు నా ప్రేమ కాదంటే చచ్చిపోతాను" అన్నాడు.

పాపాయి పాపారావు ప్రేమను నిర్మొహమాటంగా తిరస్కరించింది. పాపం......! పాపారావు చనిపోయాడు. మరో అరవయ్యేళ్ళ తర్వాత.

148. చిదంబరం సైకిల్ తొక్కుకుంటూ రోడ్డుమీద వెళ్తున్నాడు. అమలాపురం గడియార స్థంభం వద్దకు వెళ్ళేసరికి చాలామంది జనం గుమిగూడి కనిపించారు. చిదంబరం సైకిల్ ఆపి ఒక ఆసామిని "ఏమైంది...?" అనడిగాడు.



"ఏక్సిడెంట్ అయింది......" అని చెప్పి వెళ్ళిపోయాడతను.

చిదంబరం ఏక్సిడెంట్ ఎవరికైందో చూద్దామని జనాన్ని తోసుకుంటూ లోపలికి వెళ్ళబోయాడు. కాని ఎవరూ దారి ఇవ్వలేదు. చిదంబరంకి వెంటనే మెరుపులాంటి ఆలోచన వచ్చింది. "నాన్నా! చచ్చిపోయావా నాన్నా .... ! అప్పుడే నీకు నూరేళ్ళు నిండిపోయాయా....? అని ఏడుపు నటిస్తూ జనాన్ని తోసుకుంటూ లోనికి వెళ్ళాడు.

తీరా లోనికి వెళ్ళి చూస్తూ అక్కడ ఒక గాడిద చచ్చిపడి ఉంది.

149. పోస్టల్ డిపార్టుమెంట్‌లో పనిచేసే కన్నారావు తన మిత్రుడు చిన్నారావు వద్దకు అప్పుకోసం వెళ్ళాడు.

"చిన్నారావు...... నాకొక రెండొందలు అప్పు కావాలిరా...! నీవు రెండొందలు ఇస్తే వాటికి మరో రెండొందలు వడ్డీ కలిపి మొత్తం నాలుగొందలుతో నీ బాకీ తీరుస్తాను......" అన్నడిగాడు.

"నిజంగా..... నాలుగొందలిస్తావా.....? అయితే ఇప్పుడే రెండొందలిస్తాను. మరి నాలుగు వందలు తిరిగి ఎప్పుడిస్తావు...?"

"అయిదున్నర సంవత్సరాల తర్వాత......" 

150. క్లాసులో మాస్టారు పాఠం చెబుతూ విద్యార్థిని అడిగారు.

"గిరీ....! నీవు ఒక పడవలో ప్రయాణిస్తున్నావనుకుందాం. దానికొక చిల్లుపడి నీరు లోపలికి వచ్చేస్తుంటే అపుడు నీవేం చేస్తావు.....?"

"ఆ చిల్లుకుడిపక్కన ఉంటే నేను మరో చిల్లు ఎడమ పక్కన పెడతానండీ.....! ఎందుకంటే కుడి పక్క నుండి వచ్చేనీరు ఎడమ పక్కనుండి బయటకు వెళ్ళిపోతుంది కదా.....! అంటూ సమాధానం చెప్పాడు గిరి. ❑

151. "అమ్మా.....! అమ్మా......! ఈ వేళ క్లాసులో మా టీచరు నన్ను బాగా చితక్కొట్టింది" ఏడుస్తూ చెప్పింది చిట్టి తల్లి తాయారుతో. మరుసటి రోజు తాయారు కూతుర్ని వెంటబెట్టుకొని క్లాసుకు వెళ్ళి "మా అమ్మాయిని ఎందుకు కొట్టారు...?" అని నిలదీసింది.

"మీ అమ్మాయి బాగా అల్లరి చేస్తోంది. మరి అలాంటప్పుడు కొట్టక ముద్దు పెట్టుకుంటామా....?" అడిగింది టీచరు.

"చూడండి మా అమ్మాయి ఈ సారి అల్లరి చేస్తుంటే పక్కమ్మాయిని బాగా చితక్కొట్టండి. ఆ అమ్మాయిని చూసి మా అమ్మాయి బుద్ధి తెచ్చుకుంటుంది......" తెలివిగా సలహా ఇచ్చింది తాయారు. ❑

152. ఒక సినీనటి తన కుంటుంబంతో సహా ఓ కొత్తింట్లో దిగింది. వారం రోజుల తర్వాత భర్తతో "ఏవండీ .....! ఎదురింటి అబ్బాయి నేను వచ్చిన దగ్గర్నుండి నన్ను చూడాలని నా కోసం కర్టెన్లచాటునుండి దొంగ చూపులు చూస్తున్నాడండీ....!" అంది.

"ఓస్....! అంతే కదా....! ఓ పని చెయ్....! రేపు ఉదయం నీవు షూటింగ్‌కి వెళ్ళేముందు ముఖానికి మేకప్ వేసుకోకుండా ఓసారి ఆ అబ్బాయికి కనిపించు. అంతే...! మళ్ళీ నీ ముఖం చూడకుండా తనే కర్టెన్లు వేస్కుంటాడు....." చెప్పాడు భర్త. ❑

153. ఒక బస్సు చాలా వేగంగా వెళ్ళిపోతోంది. అకస్మాత్తుగా ఆ బస్సు నడిపే డ్రైవరు పడీపడీ నవ్వసాగాడు. డ్రైవర్ ఎందుకు నవ్వుతున్నాడో అర్థంకాక

డ్రైవరు పక్కన కూర్చొన్న ఓ ప్రయాణీకుడు "డ్రైవర్ గారూ...! ఎందుకండీ మీరు అంత బిగ్గరగా నవ్వుతున్నారు?" అనడిగాడు.

"ఏమీ లేదండి. ఏదైనా ఘోర ప్రమాదం జరగబోయేముందు దాన్ని గుర్తించగల్గినపుడు నేనిలాగే నవ్వుతూ ఉంటాను......" అన్నాడు డ్రైవర్.

"అదిసరే....! మరిప్పుడు ఎందుకు నవ్వుతున్నారు......?" మళ్ళీ అడిగాడు ప్రయాణికుడు.

"మరికొద్ది సేపట్లో ఘోరప్రమాదం జరగబోతోంది. మన బస్‌కు బ్రేకులు ఫెయిలయ్యాయి....." అసలు విషయం చెప్పాడు డ్రైవర్.

154. ఒక వ్యక్తి బస్టాండులో నిలబడి పేపరు చదువుకుంటున్నాడు. అంతలో మరో వ్యక్తి వచ్చి అతని చేతిలో పేపరు లాక్కుని సీరియస్‌గా చదువుకోసాగాడు.

"ఏవయ్యా....! నీకసలు బుద్ధుందా....! నా చేతిలో పేపరు లాగేసుకొని నీవు చదువుకుంటున్నావేమిటి.....?" అనడిగాడు మొదటి వ్యక్తి.

"చూడండీ....! పేపరు మీది. మీరు ఇంటికి వెళ్ళయినా చదువుతారు. నేను చదివి ఇచ్చేస్తాను కాస్త ఆగండి....." అన్నాడు ఆ రెండో వ్యక్తి.

"కాస్త మీరు నోరు మూసుకుంటారా. మీరు వాటాలు వేసుకోవడం ఆపి ఆ పేపరు ఇటివ్వండి. అది మీదీ, ఆయనదీ కాదు. నాది...." అంటూ అరిచాడు వాళ్ళ వెనుకనే ఉన్న మూడవ వ్యక్తి.

155. "వదినా...! వదినా...! నీకొక షాకింగ్ న్యూస్ చెప్పనా...... ఆ ఎదురింటి విమలమ్మ కూతురు రాత్రి ఎవడో పనికిమాలిన వెధవతో లేచిపోయిందట....." చంకలు గుద్దుకుంటూ సంతోషంగా చెప్పింది కమలమ్మ.

"అంతేనా....! నీకింకా షాకింగ్ న్యూస్ చెప్పంటావా వదినా....! ఆ విమలమ్మ కూతుర్ని లేపుకుపోయింది మీ అబ్బాయేనట..." అసలు విషయం చెప్పింది రమణమ్మ. ❑

156. ఇద్దరు వ్యక్తులు బస్టాండులో నిలబడి ఉన్నారు. వాళ్ళ సంభాషణ ఇలా ఉంది.

"సార్...! మిమ్మల్నెక్కడో చూసినట్లుంది అసలు మీది ఏ ఊరు...?"

"పల్లంకుర్రు......"

"నిజమా! అరె మాదీ పల్లంకుర్రే........."

"మీది ఏ వీధి........?"

"బ్యాంకు వీధి........."

"హా....! మాదీ బ్యాంకు వీధే........"

"మీ ఇల్లెక్కడా.......?"

"బ్యాంకుకి ప్రక్కన. మరి మీ ఇల్లు......"

"అరె .....! మాదీ బ్యాంకు పక్కనే ఉన్న డాబాలో పై అంతస్తు...."

"అరె...... మాదీ అంతే.......! పై అంతస్తే......."

ఈ సంభాషణ విన్న మూడోవ్యక్తి చిరాగ్గా "అదేమిటయ్యా! మీ ఇద్దరివీ ఒకే ఊరు, ఒకే వీధి, ఒకే ఇల్లు అంటున్నారు. ఎప్పుడూ ఒకర్నొకరు చూచుకోలేదా....?" అన్నాడు.

"భలేవారే.....! ఎందుకు చూసుకోము....? మేమిద్దర అన్నదమ్ములం. ఎంతసేపటికీ బస్సురావట్లేదని టైంపాస్ కోసం ఇలా మాట్లాడుకుంటున్నాం అంతే....!" అంటూ అసలు విషయం చెప్పారు ఆ ఇద్దరిలో ఒకరు. ❑

157. అప్పారావు ఓ ప్రైవేటు కంపెనీలో ఇంటర్వ్యూకి వెళ్ళి సెలెక్ట్ అయ్యాడు.

"చూడు అప్పారావ్....! నీ జీతం ప్రస్తుతం వెయ్యి రూపాయలు. రెండవనెల రెండువేలు. మూడవనెల మూడువేలు. ఈ విధంగా

ప్రతినెల వెయ్యి రూపాయల చొప్పున పెరుగుతూ ఒక సంవత్సరానికి నీ జీతం పన్నెండు వేలు అవుతుంది..." అన్నాడు మేనేజరు.

"అలాగా సార్...! అయితే నేను సంవత్సరం తర్వాత వచ్చి జాయిన్ అవుతాను..." అంటూ బయటకెళ్ళిపోయాడు అప్పారావు. ❑

158. రాఘురావు తన ఐదేళ్ళ కొడుకుని తీసుకొని సర్కస్ చూడ్డానికి వెళ్ళాడు. సర్కస్ మధ్యలో ఒక ఫీట్‌ని తన కొడుక్కి చూపిస్తూ "అలా చూడరా...! ఆ అమ్మాయి సన్నని తీగ మీద ఎంత ధైర్యంగా నడిచి వెళ్తుందో....!' ' అన్నాడు.

"ఏమిటి నాన్నా...! అక్కడొక సన్నని తీగ ఉందా...! నేనింకా గాల్లో నడుస్తుందేమో అనుకున్నాను...." అంటూ పెదవి విరిచాడు కొడుకు.

159. "మొన్న నేను నాన్న దగ్గర పడుకుంటాను......." అన్నాడు కిట్టు.

"కాదు ...... మొన్న నేను నాన్న దగ్గర పడుకున్నాను......." అంది టీచర్ వాక్యాన్ని సరిచేస్తూ.

"బహుశ నేను పడుకున్నాక, పడుకొని ఉంటారు....." అన్నాడు కిట్టు.

160. కిషోర్ వెళ్ళి కొట్లో సిగరెట్లు కొన్నాడు. అక్కడున్న ఓ వ్యక్తి అది చూసి "బాబూ! నీవు ఆనందరావు గారి అబ్బాయివి కదూ...?" అనడిగాడు.



"ఔనండీ.....! అన్నాడు కిషోర్.

"అరె ఇంత చిన్న వయసులో ఈ పాడు సిగరెట్లు కాలుస్తున్నావా? తప్పుకదూ....! ఈ విషయం మీ నాన్నకు తెలిస్తే ఎంత బాధపడతాడో తెలుసా...!?" అన్నాడా వ్యక్తి.

"ఈ సిగరెట్లు నాకోసం కాదండి. మా తమ్ముడి కోసం....." చెప్పాడు కిషోర్. ❑

161. "ఒరేయ్...! నానీ! చిన్నాగాడు ఎందుకురా అలా గుక్కపట్టి ఏడుస్తున్నాడు. వాడు ఏది అడిగితే అది ఇమ్మాన్నాగా......" బయటనుండి విన్పిస్తున్న ఏడుపు విని వంటింట్లో నుంచి కేక పెట్టింది నాగమణి.

"వాడు అడిగింది ఇచ్చానమ్మా.....! అందుకే ఏడుస్తున్నాడు....." చెప్పాడు నాని.

"ఏమిచ్చావు....?"

"పచ్చి మిరపకాయ....." 

162. విపరీతమైన కడుపునొప్పి వస్తోందని డాక్టరు దగ్గరకు వెళ్ళాడు బొర్రయ్య.

"డాక్టర్..... నాకు కడుపులో విపరీతమైన నొప్పి వస్తోందండి....." చెప్పాడు.

"ఎప్పట్నుండి....?" అడిగాడు డాక్టర్.

"మధ్యాహ్నం మూడు గంటలకు ఒక అరటిపండు తిన్నాడు డాక్టర్.....! అంతే....!! నొప్పి ప్రారంభమైంది...."

"చిత్రంగా ఉందే...! అరటిపండు తింటే కడుపునొప్పా...!? అసలు మీరు ఉదయం నుండి ఏం తిన్నారో చెప్పండి....!" ఆరా తీస్తూ అడిగాడు డాక్టర్.

"ఉదయం నాలుగు ప్లేట్లు ఇడ్లీతిని, తర్వాత ఎనిమిది పెసరట్లు తిన్నాను. కాసేపటి తర్వాత ఐదు ఐస్క్రీంలు తిన్నాను. తర్వాత బేకరీకెళ్ళి తొమ్మిది కేకులు తిన్నాను. తర్వాత భోజనం చేసి పది అరటిపళ్ళు తిన్నాను. తర్వాత నాలు జాంగ్రీలు, అరడజను కాజాలు, ఓ పది పూతరేకులు తిని ఓ రెండు జామకాయలు కూడా తిన్నాను డాక్టర్. కాని ఇవి ఏమి తిన్నా ఏమి అనిపించలేదు. ఆ తర్వాత ఒక్క అరటిపండు తిన్నాను. అంతే....! నొప్పి ప్రారంభమైపోయింది....." అంటూ ఆపసోపాలు పడసాగాడు బొర్రయ్య. 

163. "కృష్ణా! నువ్వు ఒక చేత్తో డ్రైవింగ్ చెయ్యగలవా....?" కారు నడుపుతున్న కృష్ణను అడిగింది రుక్మిణి.

"ఓ నేను డ్రైవింగ్‌లో చాలా ఎక్స్‌పర్ట్‌ని......." హుషారుగా అన్నాడు గర్ల్ ఫ్రెండ్ మెప్పు పొందాలని కృష్ణ.

"అయితే వెంటనే ఓ చేత్తో నీ ముక్కులోంచి నోట్లోకి కారిపోతున్న చీమిడి తుడుచుకో....." అంది రుక్మిణి. ❑

164. "ఏమయ్యా! గుడ్డోణ్ణి అన్నావ్...! క్రింద పడ్డనాణాన్ని ఎలా తీసుకుంటున్నావ్...?"

"గుడ్డోణ్ణి కాను మూగోణ్ణి బాబయ్యా..." ❑

165. ఆఫీస్ లంచ్ టైంలో భోంచేస్తున్న ఇద్దరు మిత్రుల సంభాషణ

"విన్న నాకు తలనొప్పిగా ఉంది మధ్యాహ్నం పర్మిషన్ తీసుకొని ఇంటికి వెళ్ళాను కదా...! అక్కడ ఇంటి దగ్గర నేనేం చూశానో తెలుసా...?"

"ఏం చూశావేమిటి...?"

"మా ఆవిడ పక్కన ఎవడోపడుకున్నాడు....."

"అయ్యయ్యో...! అప్పుడు నువ్వేం చేశావ్....?"

"చప్పుడు చేయకుండా మెల్లగా వంటింట్లోకి వెళ్ళి స్టౌ వెలిగించి కప్పు కాఫీ కాచుకుని త్రాగాను....."

"అది సరే..... నీ భార్య పక్కన పడుకున్న వాడి సంగతి ఏం చేశావ్....?"

"ఏడ్చాడు వెధవ..... వాడి కాఫీ వాడే కాచుకొని తాగుతాడులే, అని చప్పుడు చేయకుండా మళ్ళీ బయటికొచ్చేశాను......." ❑

166. "హలో....! రంగారావు గారేనా....?"

"ఔనండీ...! మీరెవరు.....?"

"నాపేరు గంగరాజు. నేను మీ భార్యను కిడ్నాప్ చేశాను. రేపు సాయంత్రానికి మీరు లక్షరూపాయలు తీసుకొని ఊరిచివరికి వస్తే ఆమెను వదిలేస్తాను. లేదంటే చంపేస్తాను."

"బాబ్బాబూ....! నీకు పుణ్యం ఉంటుంది. నీక్కావలసిన లక్షరూపాయలూ తీసుకొచ్చి ఇస్తాను కాని దయచేసి నా భార్యను మాత్రం వదలొద్దు....." ❑

67. "రాజూ...! హిందూ దేవాలయాల్లో పూజారి చేసే ప్రతి పనికి ఒక ప్రత్యేకమైన కారణముంటుంది. గుళ్ళోకి వచ్చిన భక్తులకు బొట్టెందుకు పెడతాడో చెప్పు..." క్లాసులో విద్యార్థిని అడిగారు తెలుగు మాస్టారు.

"ఒకసారి ప్రసాదం తీసుకున్నవాడు మళ్ళీ వస్తే గుర్తుపట్టడానికి సార్....!" చెప్పాడు విద్యార్థి. ❑

38. అప్పల్రాజు దొంగతనం చేసినందుకు కోర్టులో హాజరు పరిచారు. వాదన పూర్తి అయ్యాక "దొంగతనం చేసిన నేరానికి అప్పల్రాజుకు వెయ్యిరూపాయలు జరిమానా విధిస్తున్నాను......" అన్నారు జడ్జిగారు. "సార్..... ! నాదగ్గర ప్రస్తుతం ఎనిమిది వందలున్నాయి. ఒక్కసారి నన్ను బయటకు విడిచిపెడితే మిగతా రెండొందలు కూడా తీసుకొచ్చి కట్టేస్తాను......" కొన్ని క్షణాలు "అంటే ఇంటికెళ్ళి తీసుకువస్తావా....?"

"అబ్బే......! ఇంటికెందుకండీ....! ఒక్కసారి కోర్టుచుట్టూ తిరిగొచ్చి కట్టేస్తాను......" ❑

69. "ఎందుకురా వాసూ.....! అంత ఎక్కువగా తాగుతావ్.....! అడిగాడు రవి.

"ఉల్లిపాయలంటే నాకిష్టం. అవి తిన్నాక వాటి వాసన పోవడం కోసం విస్కీ తాగుతాను. విస్కీ తాగాక దాని కంపుని చంపడానికి మళ్ళీ ఉల్లిపాయలు తింటాను......" సమాధానం చెప్పాడు శశి. ❑

). "హరీ....! శ్రీ కృష్ణదేవరాయులు ఎవరు......?

"మా నాన్న సార్.....!"

"వాట్....? మరి భీష్ముడు ఎవరు.......?

"మా తాతయ్య......"

"కృష్ణుడెవరు........?"

"మా చిన్నాన్న......"

"సత్యభామ ఎవరు......?"

"మా అమ్మసార్....!"

"ఓహ్.... ! మరీ తలపోటు సమాధానాలు చెబుతున్నావ్. అసలు నువ్వెవరు..?"

"నాటకాల నరసింహం కొడుకును సార్....!" ❑

171. "అమ్మా....! అమ్మా.....! త్వరగా రావే... నాన్న బూటు లేసులదాకా బురదలో కూరుకుపోయారు."



కంగారుగా వంటగదిలోకి పరుగెత్తుకు వచ్చి చెప్పాడు బాబిగాడు.

"అయితే ఏమిటంత కంగారు....? బురదలోంచి నడుచుకొని బయటకి రావచ్చుగా...." తాపీగా అంది బాబిగాడి తల్లి.

"అది కాదమ్మా. నాన్నగారు తలకిందులుగా బురదలో పడ్డారు...." ❑

172. "యోగీ...! పక్కింటి కిషోర్‌ని కొట్టావట నిజమేనా.......?"

"నిజమే నాన్నా...! నన్ను తిట్టాడు మరి......."

"నీకసలు బుద్ధుందా.....? ఎవరైనా తిడితే అలా కొట్టేయడమేనా.....?"

"ముందొకసారి తిడితే ఊరుకున్నాను. రెండోసారి వెధవ అని తిడితే కొట్టాను..."

"ముందు ఏమని తిట్టాడు....?"

"గాడిద కొడకా అని......" ❑

173. ఒళ్ళంతా కట్లుకట్టుకుని ఉన్న మిత్రుణ్ణి చూసి ఆందోళనగా అడిగాడు కుమార్.

"ఏమిట్రా.. ! ఒళ్ళంతా ఈ కట్లు....? ఏమైందీ.....?"

"ఏముందీ.....! ఇవి మాయరోజులు. పరోపకారం చేయబోయాను. అంతే పట్టుకొని చితక బాదారు........"

"పరోపకారం చేస్తే కొట్టారా....! ఏం చేశావ్.....?"

"నిన్న కాలేజి నుండి ఇంటికి వెళ్లేటపుడు రొడ్డుమీద నడుస్తున్న ఒకమ్మాయి పైట జారిపోయింది. గబుక్కున నేను వెళ్ళి సర్దాను. అందుకే ఈ శాస్తి......" ❑

174. "సార్..! సార్...! నాకు ఒక్క వారం రోజులు సెలవు కావాలి సార్...!

"ఎందుకు.....?"

"షిర్డీ సాయిబాబా దర్శనం చేసుకొని రావడానికి సార్......!"

"భలే వాడివోయ్......! మొన్ననే కదా... షిర్డీ వెళ్లోచ్చావ్....! మళ్ళీ ఎందుకు....?

"దారిలో ఎలాంటి ప్రమాదాలు జరక్కుండా, క్షేమంగా ఇంటికి చేరుకుంటే మళ్ళీ దర్శనానికి వస్తానని మొక్కుకున్నాను సార్....!"

175. "ఇంతకు ముందునన్ను రంభ, ఊర్వశి, మేనక అని పొగిడే వారు. ఇప్పుడు ఒక్కసారైనా అలా పిలవడం లేదేం?" అడిగింది భార్య.

"జీవితాంతం అబద్దాల్తో బ్రతకడం మంచిది కాదనిపించి మానేశాను...." చెప్పాడు భర్త. ❑

176. "ఎప్పుడూ మీరు ఇదే ఫేన్‌ని రిపేరింగ్‌కు తెస్తున్నారేమిటి సార్....?"

"మా ఆవిడ ప్రతీసారి చచ్చిపోతానని ఫేన్‌కి ఉరిపోసుకుంటోంది. దాని బరువుకి ఫేన్ విరిగిపోతోందే తప్ప అది చావడం లేదు..." ❑

177. "హల్లో! ఇన్‌స్పెక్టర్ గారేనా...? మీరు అర్జంటుగా రావాలి. ట్రాఫిక్‌లో పెద్ద ఏక్సిడెంట్ అయింది సార్...!"

"అక్కడ బీట్ కానిస్టేబుల్‌కి చెప్పొచ్చు కదయ్యా....!

"ఏక్సిడెంట్ జరిగింది ఆయనకేనండీ...." ❑

178. "హలో....! టూటౌన్ పోలీస్ స్టేషనా?"

"ఔను... ఎవరు మాట్లాడేది....?

"నేను సార్... : ఫోర్‌నాట్‌టు కానిస్టేబుల్ని. ఇక్కడ వినాయక సెంటర్‌లో కారు ఏక్సిడెంట్ అయ్యి ఒక వ్యక్తి చనిపోయాడు. మీరు అర్జెంటుగా రావాలి...."

"అది మన స్టేషన్‌లోకి రాదయ్యా...! త్రీ టౌన్ వాళ్ళది. వాళ్ళకు ఫోన్ చేసి అప్ప చెప్పేయి...'

"అయితే... అతని మెడలో బంగారు గొలుసు, చేతి ఉంగరాలు, డబ్బున్న సూట్‌కేసు అన్ని అప్ప చెప్పేయమంటారా......?"

"ఇవన్నీ ఉన్నాయా...? అరె... భలేవాడివే... నేనేదో పరధ్యానంలో అన్నాను. అది మన స్టేషన్‌లోకే వస్తుంది. నేనిప్పుడే వస్తున్నాను. అక్కడే ఉండు...." ❑

179. ఒక పల్లెటూరి పుల్లయ్య పట్నం వచ్చాడు. పట్నంలో అతనికి ఏదైనా కొనాలనిపించి ఒక షాపుకి వెళ్ళాడు. షాపతన్ని "సార్....! ఆ టి.వి. ఎంత...?" అనడిగాడు. షాపతను ఓసారి పుల్లయ్యను ఎగాదిగా చూసి "అది అమ్మడానికి కాదు....." అన్నాడు. కాని పుల్లయ్యకు మాత్రం అది కొనాలనిపించింది. వెంటనే బయటకెళ్ళి కాసేపటి తర్వాత ఒక సిక్కువాడి వేషం వేసుకొచ్చి "సార్...! నాకు ఆ టి.వి. కావాలి...." అన్నాడు.

"భలేవాడివే.... ఇంతకు ముందొకసారి చెప్పాను కదా...! అది అమ్మడానికి కాదు...." అన్నాడు షాపతను. వేషం మార్చినా తనను ఎలాగుర్తుపట్టాడో అర్థం కాలేదు పుల్లయ్యకు. అయినా ఆశ చావక

కాసేపటి తర్వాత బుడబుక్కల వాడివేషం వేసుకువచ్చి "అయ్యా! ఆ టి.వి. ఎంతకు అమ్ముతారేమిటి....?" అన్నాడు.

"మళ్ళీ వేషం మార్చుకువచ్చావన్న మాట.. అది మాత్రం నీకు అమ్మనయ్యా.." అన్నాడు. అలా మరో రెండు వేషాలు మార్చాడు పుల్లయ్య. షాపతను గుర్తుపడుతూనే ఉన్నాడు. ఆఖరున పుల్లయ్య షాపు అతనితో "అయ్యా....! నేనిప్పటికి ఐదువేషాలు వరకూ మార్చాను. ప్రతిసారీ మీరు గుర్తుపట్టేస్తున్నారు. మీరు నాకా టి.వి. అమ్మకపోయినా ఫర్వాలేదు. నన్నెలా గుర్తు పట్టారో మాత్రం చెప్పండి.. అన్నాడు.

షాపతను నవ్వుతూ "చూడు.... ఈలోకంలో దాన్నెవడూ కూడా టి.వి.అనడు. అది మా షాపులో అవసరాన్ని బట్టి పెట్టిన రిఫ్రిజరేటరు. అంటూ అసలు విషయం చెప్పాడు. ❑

180. ఒక వ్యక్తి నడి రోడ్డుమీద పడుకొని తన కుడిచెవిని రోడ్డుకు ఆనించి ఏదో వింటున్నట్లు కనిపించాడు భీమారావుకి వెంటనే అతని వద్దకు వెళ్ళి

"సార్...! మీరు చెవి రోడ్డుకు ఆనించి ఏం చేస్తున్నారు సార్...!?" అనడిగాడు.

" ఎ.పి - 31, టి - 1071 లారీ గంటకు ఎనభైకిలోమీటర్ల వేగంతో ముందుకు దూసుకుపోతోంది......" చెప్పాడతను.

"అరె....! ఆవిషయం మీరు అంత కరెక్టుగా ఎలా చెప్ప గల్గుతున్నారు.....? అశ్చర్యంగా అడిగాడు భీమారావు.

"ఐదు నిముషాల క్రితం నేను ఆ లారిలోంచే కిందపడ్డానయ్యా బాబూ....!" మూల్గుతూ చెప్పాడా వ్యక్తి. ❑

181. సమ్మక్కా, సారక్కా నల్లా దగ్గర నీళ్ళు పట్టుకుంటూ మాట్లాడు కుంటున్నారు.

"వదినా...! నీకొడుకు కాపురం ఎట్లుందీ....?"

"ఏం సెప్పమంటవు వదినీ....! నా కోడలు ఒక రాక్షసి. నా కొడుకుని అమాయకుణ్ణి చేసి కొంగుకు ముడేసుకుని తిప్పుకుంటున్నది. ఏ మందు పెట్టిందో, ఏం మాయసేసిందో గాని ఆడు పెండ్లాం మాటకు ఎదరు సెప్పడు. ఏం సేయమంటే అది కిక్కురు మనకుండా సేస్తడు..."

"అట్లనా వదినీ...! మరి కూతురు కాపురం ఎట్టున్నదే.....?"

"ఏమాటకామాట సెప్పాలే అమ్మా....! నా అల్లుడు ఎంతమంచోడను కుంటున్నావ్....! అస్సలు నా కూతురు మాటకు ఎదురు సెప్పడు. నా కూతురు ఏం జెప్పినా మంచిగా సేస్తడు. అట్లాంటి అల్లుడు ఎక్కడోగాని కన్పించడంటే నమ్ము...." ❑

182. "ఇందాక నీకు అతి ముఖ్యమైన ఉత్తరాన్ని ఇచ్చానే.. దాన్ని పోస్టు చేసేశావా...?" యజమాని నౌకర్ని ప్రశ్నించాడు.

"చేసేశాను సార్....! ఇవిగోండి........" అంటూ డబ్బులిచ్చాడు నౌకరు.

"అదేమిటోయ్...! ఈ డబ్బులు స్టాంపులుకొని కవరుకు అతికించడానికి ఇచ్చాను కదా! తిరిగి తెచ్చాశావేమిటి....?" ఆశ్చర్యంగా అడిగాడు యజమాని.

"స్టాంపులు కొనే అవసరం కలగలేదండి, ఎవరూ చూడకుండా ఉత్తరాన్ని పోస్టు డబ్బాలో వేసేశాను..." తన తెలివికి తనే మురిసిపోతూ చెప్పాడు నౌకరు...." ❑

183. "ఎంత చెప్పినా మీరు సిగరెట్లు త్రాగడం మానడం లేదు. నాకంటే అవే ఇష్టమా...!" "ఛ....నాకు సిగరెట్టంటే పరమ అసహ్యం. అందుకే వాటిని కాల్చి కాల్చి బూడద చేసి అవతల పారేస్తాను. ❑

184. ఓచోట బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్ పని జోరుగా సాగుతోంది. మేస్త్రి కూలీల పనిని జాగ్రత్తగా పర్యవేక్షిస్తున్నాడు. హఠాత్తుగా ఆ మేస్త్రి గోతిలోంచి పారతో మట్టితీసి బయటకు వేస్తున్న ఒక కూలీ దగ్గర ఆగిపోయాడు.

"నువ్వోకసారి గోతిలోంచి బయటకు రా..." అన్నాడు కూలీతో.

కూలీ బయటకు వచ్చాడు.

కూలీ గోతిలోంచి బయటకు వచ్చాడు.

అలా ఆ కూలీ చేత గోతిలోకి, బయటకి అయిదుసార్లు దూకించాడు మేస్త్రి.



"ఏంది సార్...! నాతో ఆటలాడ్త ఉండారు..." ఆరోసారి అడిగాడు విసుగెత్తిన కూలీ.

"ఏం లేదు నువ్వు పారతో వేసే మట్టికంటే నీ కాళ్ళకి అంటుకొని బయటకు వస్తున్న మట్టే ఎక్కువగా ఉంది. అందుకనీ...." మెల్లగా చెప్పాడు మేస్త్రి. ❑

185. "నువ్వు పెద్ద మోసగాడివి. ఎన్నో సార్లు కోర్టుకు వచ్చి అబద్ధాలు చెప్పావు. ఇకపైన నువ్వు ఏం చెప్పినా నేను దాన్ని వ్యతిరేకంగా నమ్ముతాను...." అన్నాడు జడ్జి..

"మహాప్రభో..! నేను పచ్చిమోసగాడిని, నేను చెప్పేవన్నీ అబద్ధాలు. నేను మీరు విధించే శిక్షకు అర్హుడిని..." అన్నాడు తెలివిగా దొంగ.

186. ఫోన్ గురించి ఏమీ తెలియని బంగారమ్మ ఇంటికి కొత్తగ ఫోనొచ్చింది.. కొడుకును కోపంగా "ఏరా...! ఫోన్ ఎత్తకుండా అల చూస్తున్నావ్...?" అంది .

"అది ఇంకా మ్రోగలేదు కదమ్మా....!" అన్నాడు కొడుకు.

"ఛ నువ్వు ఆఖరి క్షణం వరకూ ఏమీ చెయవు. మ్రోగే వరకూ ఆగాలా.....!? విసుక్కుంది బంగారమ్మ. ❑

187. "రాధాబాయిగారూ...! ఎదురింట్లో అద్దెకు ఉమాదేవి దిగింది చూశారు...! ఆవిడ నిజంగా మగాడై పుట్టాల్సింది. ఎక్కడో ఏదో తప్పు జరిగి పొరబాటున ఆడదానిలా పుట్టిందంటే నమ్మండి....."

"ఎందుకండీ! అలా అంటున్నారు....."

"ఔనండి....!! నిన్న ఆవిడ చెతి వంటరుచ చూశాను. అచ్చం మా ఆళ్ళు చేసినట్లు చాలా అద్భుతంగా ఉంది మరి...." ❑

188. "ఏవండీ! అర్జెంటుగా మనం ఈ ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోవాలి. పక్కింటి కాంతమ్మ గారితో వేగలేక చస్తున్నాను....." అంది బార్య భర్తతో.

"ఎమైందిప్పుడు...? " అడిగాడు భర్త.

"వారం రోజుల క్రిందట వందరూపాయలు అవసరమని తీసుకెళ్ళి ఇంతవరకూ తిరిగివ్వలేదు......"

"పోనీలేవే... డబ్బులకు ఇబ్బందిగా ఉండి తీసుకువెళ్లుంటుంది. ఇచ్చేస్తుందిలే..."

"మొన్న గ్లాసుడు పంచదార, సోలెడు కందిపప్పు, కేజీ బియ్యం కూడా తీసుకెళ్ళింది....."

"సరుకులు అయిపోయుంటాయి. తెచ్చుకున్నాక ఇచ్చేస్తుందిలే....."

"అంతటితో ఆగితే పర్వాలేదండి. రాత్రి మాకోడలు ఊరెళ్ళింది. మా అబ్బాయి గోడవచేస్తున్నాడు. ఆరెంౘ్రోజులు మా అబ్బాయిదగ్గరకు మీ కోడల్ని పంపిచండి..." అంది.. ❑

39. "ఏమిట్రా రాజేష్....! ఉన్నట్టుందడి కారుస్పేరు పార్టుల బిజినెస్ పెట్టావు..?"

"ఏముందీ....! మెన్న మాంచి స్పీడుగా వెళ్తూ నాకారు చెట్టుకి గుద్దేసింది. కారు రిపేరింగ్ చేయడానికి కూడా పనిచేయకపోవడంతో పార్టులన్నీ విప్పేసి ఇలా అమ్ముతున్నాను..." ❑

0. "అమ్మా ....! అన్నయ్య వాళ్ళకు ఈ వేళ ప్రొగెస్ రిపోర్ట్ ఇచ్చారు. లెక్కల్లో అన్నయ్యకు ఒకే ఒక్క మార్కు వేశారు. అన్నయ్యదాని పక్కన సున్నవేసి పదిచేశాడు. తల్లికి కంప్లైంట్ చేశాడు వాసు.

"అలాగా....! అది చాలా తప్పుడుపని. వాడి సంగతి నేను చూస్తాను కాని అదేస్థానంలో నీవు కనుక ఉంటే ఏం చేసేవాడివి" అదిగింది తల్లి.

"నేనైతే ఒకటికి ముందు తొమ్మిది వేసి ఉండేవాడిని.... " చెప్పాడ
వాసు. ❑

191. రాజమండ్రి గోదావరి గట్టుమీద ఓ సాయంసంధ్యవేళ కొంతమంది ప్రకృతి అందాలు చూస్తూ విహరిస్తున్నారు. అకస్మాత్తుగా ఒక లావు పాటావిడ కాలుతూలి నదిలో పడిపోయింది. జనం అంత కొయ్యబారిపోయి చూస్తున్నారే తప్ప ఏ ఒక్కరూ ఆవిడను రక్షించే ప్రయత్నం చేయడం లేదు. అంతలో ఓ పల్లెటూరి ఆసామి గబుక్కున నదిలోకి దూకి ఆవిడ మునిగిపోకుండా కౌగిలించుకున్నాడు. ఈలోగ దూరంగా ఉన్న బోటు ఒకటి అటువైపు వచ్చి ఇద్దరినీ ఒడ్డుకు చేర్చింది

ఒడ్డున ఉన్న వాళ్ళంతా ఆ పల్లెటూరి ఆసామిని. అతని ధైర్య సాహసాల్ని తెగపొగిడేయసాగారు. అంతా విని ఆసామి కోపంగా" అయిందేదే అయిందిగానీ, నిజం చెప్పండి. ముందు మీలాగే నిలబడి చూస్తుంటే నన్ను నదిలోకి తోసేసిన వెధవ ఎవడు...?" అన్నాడు.

192. "మీ స్నేహితుడు చెట్టుమీద నుండి క్రిందపడి తల పగిలి చనిపోయాడట కదా...?"



"ఔను......"

"పాపం .....! అసలు చెట్టెక్కకుండా ఉండుంటే ఇలా ప్రాణం మీదికి వచ్చుండేది కాదు..."

"ఏం చేస్తాం....? వాడి చావు అలా రాసిపెట్టుంది మరి....."

"ఇంతకూ చెట్టెందుకు ఎక్కినట్లు.....?"

" ఉరేసు కోవడానికి త్రాడు కట్టబోయాడు....." ❑

193. "కాంతం......! ఇంకా వంటయిందా.....? లేదా..?

"లేదండీ....!"

"సరే...! అయితే నేను హోటల్ కెళ్ళి భోంచేసేస్తాను....."

"ఒక్క పదినిమిషాలు ఆగండి......"

"ఏం....? పదినిముషాల్లో వంటరెడీ చేసేస్తావా....?"

"కాదు..... నేను కూడా తయారై మీతోబాటు హోటల్ కొస్తాను....."

194. రామ్‌లాల్ దొంగనోట్లు ముద్రిస్తున్నాడు. పొరబాటున అరవైరూపాయల నోట్లు ముద్రించేసాడు. తర్వాత వాటినెలా మార్చాలా అని తీవ్రంగా ఆలోచించి ఓ చిన్న పల్లెటూరు చేరుకున్నాడు. పల్లెటూరి వాళ్ళను సులభంగా బోల్తా కొట్టించ వచ్చన్నది అతని ప్లాన్. పల్లెటూరిలోని ఓ బట్ల కొట్టుకు వెళ్ళాడు.

"సార్....! నాకు అర్జెంటుగా ఈ అరవైరూపాయల నోట్టకు చిల్లర కావాలి. కావాలంటే మీరు కొంత కమిషన్ తీసుకొండి...." అన్నాడు షాపువాడితో. షాపువాడు నోట్లన్నీ తీసుకొని చిల్లర ఇచ్చాడు. రామ్‌లాల్ వేగంగా బయటకు పరుగెత్తి ఒకచోట ఆగి ఆ నోట్లు చూస్కుంటే అవి ముప్పైరూపాయల నోట్లు. ❑

195. రెండు చీమలు అడవిలో వెళ్తున్నాయి. అంతలో వాటికి ఒక ఏనుడు ఎదురైంది. అందులో ఓ చీమ రెండో చీమతో "ఏనుగు ఒంటరిగా వస్తోంది. దాంతో మనం యుద్ధం చేద్దామా?" అంది. వెంటనే రెండోది "ఎందుకులే పాపం......! ఒంటరిగా ఉంది. వదిలేద్దాం...." అంది.

196. చిట్టి వాళ్ళ నాన్న చిట్టితో "చూడు... చిట్టీ! ఎవరైనా మనింటికి వచ్చి సరదాగా నిన్ను ఏమైనా అడిగితే తియ్యతియ్యగా సమాధానాలు చెప్పాలి..." అన్నాడు. కాసేపటికి చిట్టివాళ్ళ అంకుల్ వచ్చాడు.

"చూడు పాపా నీపేరేంటి...?" అన్నాడు.

"పాలకోవా..." అంది చిట్టి.

"గుడ్.... మీ అమ్మ పేరు.....?

"మైసుర్ పాక్....."

" మీనాన్న పేరు......."

"కాజా...."

"మీ చెల్లాయి పేరు....?"

"లడ్డు......"

"మీ రెక్కడ ఉంటున్నారు...?"

"మిఠాయి డబ్బాలో...." 

197. భర్త ఆఫీసునుండి రాగానే భార్య "ఏమండోయ్...! మరో కొద్ది రోజుల్లో మన మధ్యకి మూడో వ్యక్తి రాబోతోంది...." అన్నది. భర్త పట్టరాని ఆనందంతో భార్యను చేతుల్తో పైకెత్తేసి గిరాగిరా తిప్పి మంచం మీద పడుకోబెట్టి "డాళింగ్...! ఎన్నాళ్ళకు శుభవార్త చెప్పావు....! ఇంకొద్ది రోజుల్లో మన మధ్య మనకు పుట్టేపాపా ఆటల్తో ఆనందంలో ముంచెత్తు తుందన్న మాట......" అన్నాడు.

"చాల్లెండి మీ సంబరం త్వరలో మా అమ్మ రిటైరయ్యి మనతోనే ఉండిపోడానికి రాబోతోంది....." అంటూ అసలు విషయం చెప్పింది భార్య. 

198. ముకుందరావుకి కొత్తగా పెళ్ళయింది. భార్య కాపురాని కొచ్చింది. ఆమె భోజనం వడ్డిస్తూ భర్తతో" ఏమండీ....! నేను కూరలు బాగా చేస్తానండీ... ముఖ్యంగా వంకాయ మసాలా, బంగాళాదుంప కుర్మా అద్భుతంగ చేస్తాను..." అంది భర్తకూరలు రుచి చూసి "ఇంతకూ ఇందుల వంకాయ మసాలా ఏది? బంగాళా దుంప కుర్మా... ఏది?" అన్నాడు.

199. ఇద్దరు అమ్మాయిలు మాట్లాడుకుంటున్నారు.

"రాణీ...! నీవు ఏం చదవాలను కుంటున్నావు....? అడిగింది వాణి.

"ఏం చదివినా డాక్టరు, లాయరు మాత్రం చదవను.... అంది రాణి.

"ఎందుకని.....?" అడిగింది వాణి.

"మనం ఎంతో కష్టపడి సెలెక్ట్ చేసుకున్న చీరను డాక్టర్ చదివితే తెల్లకోటుతోను, లాయర్ చదివితే నల్లకోటుతోను కప్పేయాలి....." అంది రాణి. 

200. "ఏమిటయ్యా! ఇవి చపాతీలా....! ఇలాగేనా చపాతీలు చేసేది....?" అడిగాడు ఓ పెద్దమనిషి మేనేజర్ని.

"ఇదిగో చూడండి...! నేను మీరు పుట్టకముందు నుండి చపాతీలు చేయిస్తున్నాను.
ఇంతవరకూ నా చపాతీలు బాగోలేదన్న వాళ్లు లేరు..." అన్నాడు మేనేజర్.
"అయితే అయుండొచ్చు. కానీ నేను పుట్టకముందు చేయించిన చపాతీలు ఇప్పుడా అమ్మడం...?" ఇసుక్కున్నాడా పెద్దమనిషి. ❑

201. "ఆ ఇరవై మూడో నెంబర్ బెడ్ మీదున్న స్త్రీకి స్పృహవచ్చిందా...?" అడిగారు డాక్టర్.
"వచ్చింది డాక్టర్....? !" చెప్పింది నర్స్.
" ఏం చేస్తోంది....?"
" ఆ దెబ్బతగిలిన చేతుల్తోనే మొఖానికి పౌడర్ రాసుకుంటుంది.....?

202. సంతాన లక్ష్మి తన ఆరుగురు పిల్లల్ని తీసుకుని ఆర్టీసీ బస్సెక్కుతోంది. ఇద్దరు పిల్లల్ని ఆమె చంకన వేసుకోవడంతో మిగిలిన



నలుగురు తమను ఎత్తుకోమని గోల చేస్తున్నారు. వాళ్ళను సముదాయించడానికి సంతాన లక్ష్మి నానా అవస్థలు పడుతోంది. ఆమె అవస్థను చూసి కండక్టర్ "ఏవమ్మా....! నీపిల్లలందర్నీ తీసుకొచ్చి ఎలా ఇబ్బందులు పడే బదులు, కొంతమందిని ఇంటిదగ్గరే వదిలేయొచ్చుగా....." అన్నాడు.
"ఆమాత్రం తెలివి తేటలు నాకూ ఉన్నాయి. నేనిపుడు తీసుకొచ్చింది సగం మందినే. ఇంకా ఆరుగురు పిల్లలు ఇంటిదగ్గరున్నారు....." చెప్పింది సంతానలక్ష్మి. ❑

203. ఒక అర్ధరాత్రి డాక్టర్‌గారింట్లో ఫోన్ మ్రోగింది.

"హల్లో.....!" అన్నాడు డాక్టర్ విసుగ్గా.....

"డాక్టర్ గారూ! మీరు అర్జెంటుగా మాయింటికి రావాలి. మా అబ్బాయి నేను నవలరాస్తుంటే గబ్బుక్కున వచ్చి పెన్ను మింగేశాడు...." అందో గొంతు.

"సారీ.....! ఇప్పుడు రావడం కుదరదు. ఉదయాన్నే వచ్చి చూస్తాలెండి...."

"మరి అంతవరకూ ఏం చేయాలి? అదుర్దాగా అడిగిందా గొంతు.

"మరో పెన్నుతో రాసుకోండి." ❑

204. జంబులింగం అర్జెంటుగా రైల్వేస్టేషన్‌కి వెళ్తున్నాడు. ఓ తోట దగ్గర ఆగి ఓ రైతును "ఏవండీ....! నేనిపుడు ఈ తోటకు అడ్డంబడి వెళ్తే పదిగంటల రైలు దొరుకుతుందంటారా?" అనడిగాడు.

"తోటలో ఆంబోతు మిమ్మల్ని చూస్తే పదిగంటల రైలేం ఖర్మ....! తొమ్మిదిగంటల రైలే దొరుకుతుంది..." చెప్పాడు రైతు. ❑

205. "రామూ....! మీ గేదె పాలిస్తుందా...?"

"అదివ్వదు... మేమే పితుకుతాం...." ❑

206. గోపాలరావు హోటల్లో కూర్చొని గొప్పలు చేప్పేస్తున్నాడు. సొరకాయలు నరికేస్తున్నాడు. తను ఏమైనా చేయగలనన్నాడు.

"నువ్వు చెప్పేవన్నీ నిజమా.....?" అదిరిపడి ఎదురుసీట్లో కూర్చొన్న చొక్కారావ్.

"నీ కసలు ఆ డౌట్ రాకూడదు. కూలీచేసుకుని బ్రతికే వాడి దగ్గర్నుండి రాజకీయ నాయకుల వరకూ నా వల్ల ఎన్నో సహాయాలు పొందారు. ఉదాహరణకు నీవు చేయలేని పని ఏదైనా నాకు చెప్పు నేను చెసి చూపిస్తాను...." అన్నాడు గోపాల్రావు.

"అయితే నేను తిన్న ఈ టిఫిన్ బిల్లు నేను చెల్లించలేను. నీవు చెల్లించు చూద్దాం..." అన్నాడు చొక్కారావు. ❑

207. "అపర్ణా! నామీద నీకు నమ్మకం లేదా...? అలా దూరంగా కూర్చున్నావ్...?"
"నే తెచ్చుకున్న జంతికలు, చేగోడీలు అయిపోగానేవచ్చి నీ పక్కన కూర్చుంటాలే...." ❑

208. " ఏమయ్యో...! ఈ టోపీ ధర ఎంత...?"
"నలభై రూపాయల ఎనభై పైసలు...."
"అయ్య బాబోయ్...! ఈ ధర పెట్టి చెప్పులే కొనుక్కోవచ్చు...."
"నిజమే.....! కానీ అవి తలమీద పెట్టుకుంటే చూసేవాళ్ళు నవ్వుతారే...."

209. "నా కాండక్ట్ మంచిదని సర్టిఫికెట్ పెట్టినా ఉద్యోగం ఇవ్వలేదురా...." అన్నాడు బ్రహ్మం.
"ఇంతకూ ఆ సర్టిఫికెట్ ఎవరిచ్చారేమిటి....?" రామం.
"సెంట్రల్ జైలు వాళ్లు...," ❑

210. "రాణి.....! నీ విశాల హృదయంలో కాస్త చోటిస్తావా...?" అర్థించాడు రాజు.
"ప్రస్తుతం కుదరదు రాజూ...! నాలుగురోజులు పోయాక కనపడు అప్పటికి ఖాళీ అయితే చూస్తా...." అంది రాణి. ❑

211. ఇద్దరు బార్యా భర్తలు పోట్లాడుకున్నారు. మాట్లాడుకోవడం మానేశారు. ఆ రోజు రాత్రి భర్త ఈ విధంగా ఒక చీటి వ్రాసి భార్య తలదిండువద్ద పెట్టాడు. "రేపు ఉదయం ఆరు గంటలకు ఆఫీసుకు వెళ్ళాలి. కాబట్టి 5 గంటలకు నిదురలేపు..." అని ఉందందులో. మర్నాడు తనకు మెలుకువ వచ్చేసరికి టైం తొమ్మిది అయింది. ఉదయాన్నే భార్య నిదురలేపనందుకు కోపంగా తిట్టడానికి వంటగది వైపుకు వెళ్ళబోయి తన తలదిండువద్ద కనిపించిన చీటి చూసాడు. అందులో "టైం ఐదు అయింది ఇక నిద్రలేచి ఆఫీసుకు తయారవండి....." అని ఉంది.

212. "రాజేంద్ర, రమణి ప్రేమించుకున్నారు. సినిమాలు, షికార్లు తిరిగారు. ఓ రోజు "రాజేంద్ర ....! ఇప్పుడు నాకు మూడో నెల....." అంది రమణి.
"ఊరుకో రమణీ...! ఆడవాళ్ళు వయస్సు అబద్ధం చెబుతారని తెలుసుకాని, మరీ ఇంత తక్కువ చెబితే ఎవరు నమ్ముతారు రమణీ....!" అన్నాడు రాజేంద్ర. ❑



213. "సుజాతా...! నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. నీ కోసం ఏమైనా చేస్తాను. చివరికి కొండమీద కోతిని తెమ్మన్నా తెస్తాను....." ఉద్వేగంగా అన్నాడు కన్నారావు. "సరే... అలాగే పట్రా... ఈవేళ కాలేజీలో కోతుల మీద రిసెర్చి చెయ్యాలి....." ఠక్కున చెప్పింది సుజాత.

214. పేపరు చదువుకుంటున్న భర్తతో అంది భార్య..
"ఏమండోయ్.......! మన రాజిగాడు వారం రోజుల నుండి నడవడం మొదలెట్టాడు....."
"అలాగా...! ఐబాబోయ్.... అయితే ఈపాటికి చాలా ఊళ్ళు దాటి వెళ్ళిపోయి ఉంటాడు పరధ్యానంగా అన్నాడు భర్త. ❑

215. "ఏమండీ....! ఈ ఊళ్లో సెలూన్ షాపుకి ఎలా వెళ్ళాలండి..." ఓ దానయ్యను అడిగాడు సెలూన్ షాపుకి దారి తెలియని పెద్దమనిషి.
"ఏఊళ్ళోనైనా సెలూన్ షాపుకి జుట్టు, గెడ్డం బాగా పెంచుకునే వెళ్ళాలండి.." అంటూ వెళ్ళిపోయాడు ధానయ్య. ❑

215ఎ. ఒక వీక్లీలో సెక్స్ స్పెషలిస్ట్ సమాధానాలు చదివి భార్యకు విన్పిస్తున్నాడు వెంకట్రావు. "ఎవరో ఓ సోదరి రాసిందోయ్...! తనకు తన భర్త వల్ల ఎలాంటి సుఖం లభించడం లేదట. చీకటి పడగానే ఈమె భర్త పడుకొని పొద్దున వరకు నిద్రలేవడట....." ఇంకా చదవుతున్నాడు వెంకట్రావు.

"అరె... నేను పంపి రెండు వారాలైన పూర్తికాలేదు అప్పుడే ప్రింట్ అయిందే..." అంటూ నోరు జారింది భార్య. ❑

216. పోలీసు స్టేషనుకు అయాసపడుతూ పరుగెత్తుకెళ్లాడు చిదానందం. అక్కడున్న ఇన్‌స్పెక్టర్ "సార్....! నన్ను అర్జెంటుగా లాకప్‌లో వెయ్యండి...." అన్నాడు.

"ఎందుకు ...? నువ్వేం నేరం చేశావ్...?" ఆ శ్చర్యంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఒక లావుపాటి దుడ్డుకర్ర తీసుకుని నా భార్య నెత్తిమీద కొట్టాను సార్...!"

"అంటే అక్కడికక్కడే చనిపోయిందా ఆవిడా.....?"

"లేదుసార్.. అదే దుడ్డుకర్ర తీసుకుని నన్ను తరుముకు వస్తోంది..... ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ చెప్పాడు చిదానందం.

217. ఒకచోట కొంతమంది ఆడాళ్ళు చేరి తమ గొప్పలు చెప్పుకుంటున్నారు ఒకావిడ అంది. "నేను కట్టే చీరలు ఈ ఊళ్ళో ఎవరూ కట్టలేరు. నావన్నీ ఖరీదైన చీరలేకాక, రోజూ రెండు చీరలు మారుస్తాను..."

"ఆ మాత్రానికే గొప్పా....? మీరు రోజుకు రెండు చీరలు మారిస్తే నేను రోజుకు అరడజను చీరలు మారుస్తాను....." అంది అక్కడకు వచ్చిన చాకలి. ❑

218. సుబ్బారావు, రంగారావు ఆఫీసులో చాలా గొడవ పడుతున్నారు. మాటామాటా పెరిగి పోతోంది. "నన్ను అనవసరంగా రెచ్చగొట్టకు కొట్టానంటే ముప్పై రెండు పళ్ళూ రాలిపోతాయి..." అన్నాడు సుబ్బారావు.

"నన్ను మరీ రెచ్చగొడుతున్నావు. శ్యామ్ కొపం వస్తే అరవైనాలుగు పళ్లూ రాలిపోగలవ్...." అన్నాడు రంగారావు.

వీళ్ళ గొడవను ఆపాలని అక్కడకొచ్చిన అప్పారావు ఆశ్చర్యంగా "భలేవారే... రంగారావ్ గారూ....! మీరు కోపంలో ఏం మాట్లాడు

తున్నారో మీకే తెలియడం లేదు. మనిషికి ఉండేవి ముప్పైరెండు పళ్లే కాని మీరు అరవైనాలుగు అంటున్నారు. చూశారా...!" అన్నాడు.
"ఆవిషయం నాకూ తెలుసు. మా ఇద్దరి మధ్యా నీవు వస్తావనీ తెలుసు. మీ ఇద్దరి పళ్ళు కలిసి అరవైనాలుగన్న మాట...." విడమరచి చెప్పాడు రంగారావు. ❑

219. "రంగా...! ఈ రోజు రాత్రికి నువ్వు మా యింటికి రావాలోయ్...!
"ఎందుకు...?"
"అబ్బే ఏం లేదు నేను కొత్తగా కుక్కను కొన్నా. అది దొంగల్ని పసికడుతుందో, లేదో చూద్దామని....." ❑

220. "ఎదురింటి బాబూరావుగారు చూడండి. భార్యను వెనకాల స్కూటర్‌మీద కూర్చోబెట్టుకుని సినిమాలకు, షికార్లకు తీసుకు వెళ్తారు. ఏనాడైనా మీరు కూడా



అలా తీసుకుని వెళ్ళారా....?" అంది భర్తతో భార్య.
"నాకు తీసుకు వెళ్దామనే ఉంది. కాని నాతో షికార్లుకు రావడానికి ఆవిడ వప్పుకుంటుందో లేదో అని సందేహం వెలిబుచ్చాడు భర్త.❑

221. "ఏమిటే.... నీకసలు బుద్ధుందా...? నాకు కళ్ళు సరిగ్గా కనిపించడం లేదని పొద్దున మీ అమ్మకు చెబుతున్నావు. నాకు అన్నీ సరిగానే కనిపిస్తున్నాయి. ఇంకోసారి ఇలాంటి కబుర్లు చెబితే చెంప పగలగొడతాను. జాగ్రత్త ...." అన్నాడు లింగబాబు.
"అయ్యయ్యో నేను మీ అత్తగార్ని బాబు...! అమ్మాయి వంటగదిలో ఉంది. వెళ్ళిచూడు....." బెంబేలు పడుతూ అంధి అత్తగారు. ❑

222. "నీకొడుకుతో తిరిగినా కూతురు నెలతప్పింది. దీనికి ఏమిటి నీ సమాధానం....?"" అడిగాడు అరుణాచలం.

"నీకూతురు ఒక్కనెలే కదా తప్పింది మరి నా కొడుకు నీ కూతురు కూడా తిరిగి బి.ఎ. మూడు సంవత్సరాలు తప్పాడు. మరి దీనకి నీ సమాధానం ఏమిటి?" అన్నాడు సింహచలం. ❑

223. పెద్ద పేరున్న ఒక కాన్వెంట్ తన కొడుకును జాయిన్ చేయడానికి తీసుకొచ్చాడు విష్ణుమూర్తి.
"మా అబ్బాయిని మీ కాన్వెంట్‌లో యూకేజీలో చేర్చుకోవాలండీ.... ' ' అడిగాడు హెడమేడమ్‌ని.
"కమాన్ వెల్‌కం. మరి మీరు గాని, మీ మిసెస్‌గాని పోస్టుగ్రాడ్యుయేట్ చదివి ఉండాలి..." తమ కాన్వెంట్ కండిషన్ చెప్పింది హెడ్ మేడమ్.
" మా అబ్బాయి చదువుకి, మా చదవుకీ సంబంధం ఏమిటండీ...?' ' ఆశ్యర్యంగా అడిగాడు విష్ణుమూర్తి.
"మరి హోం వర్క్ ఎవరు చేస్తారు....?" ప్రశ్నించింది మేడమ్. ❑

224. ఉదయం ఆరుగంటలకు చిన్నారావు మార్నింగ్ వాక్ పూర్తిచేసుకొని ఇంటికొచ్చాడు. "ఏమిటే అమ్మాయి... ఈ రోజు కూడా మీ ఆయన క్లబ్‌కు వెళ్ళి ఫాంట్, షర్ట్ పోగొట్టుకున్నాడా....? డ్రాయరు, బనీనుతో ఇంటికొచ్చాడు...." అనుమానంగా అడిగింది బామ్మగారు చిన్నారావు భార్య కళ్యాణిని. " భలేదానివే భామ్మా......! నీకు గొప్ప అనుమానం అనుకో. ఆయన క్లబ్‌కి వెళ్ళలేదు. మార్నింగ్ వాక్‌కి వెళ్ళి వస్తున్నారు...." వివరించింది కళ్యాణి తన బామ్మగారికి.
"ఎక్కడయితే ఏం లేమ్మా...! బట్టలు పోయాయిగా ......" నిట్టూర్చింది. బామ్మగారు. ❑

ּ. "రాధా....! ఈ రోజు మనింటికి నా ఫ్రెండ్‌ను పార్టీకి పిలిచాను. నువ్వు అర్జెంటుగా టేబుల్ ఫేన్ ఐరన్ బాక్స్, ఫిలిప్స్ టేప్ రికార్డర్, టేబుల్ లాంప్ ఇవన్నీ తీసి అటకమీద దాచేయి...." అన్నాడు కృష్ణ.
"ఇవన్నీ దాచేయడం ఎందుకు....? మీ ఫ్రెండ్స్‌కు ఏమైనా దొంగబుద్ధి ఉందా...? అనుమానంగా అడిగింది రాధ.

అబ్బ అలాంటిదేమి లేదు. కాకపోతే వాళ్ళ వస్తువులు వాళ్లు గుర్తుపట్టేస్తారేమోనని భయం......" నసుగుతూ చెప్పాడు కృష్ణ. ❑

226. "నా భార్య అల్లారు ముద్దుగా పెంచుకునే జిమ్మీ అనే కుక్కపిల్ల నాలుగు రోజులుగా కనిపించడం లేదు. కుక్క వంటినిండా బొచ్చు పెరిగి తెల్లగా, బొద్దుగా, ముద్దుగా ఉంటుంది. ఈ కుక్కపిల్లను తీసుకొచ్చి మాకు అప్పగించిన వారికి ఐదు వేల రూపాయలు బహుమతి ఇవ్వబడును - ఇట్లు భజగోవిందం....." అని పేపర్లో ప్రకటన చదవి ప్రక్కనే ఉన్న బజగోవిందాన్ని" ఏరా....! ఈ ప్రకటన ఇచ్చింది నీవేనా....?" అనడిగాడు కోదండం.

"ఔను నేనే ఇచ్చాను......" అన్నాడు భజగోవిందం.

"నీకు బుద్ధి లేదట్రా... ఈ కుక్కపిల్ల కోసం ఐదు వేలరూపాయలు వృధాగా ధారపోస్తావా....?"

"ఆ కుక్కపిల్లను ఎవరూ తీసుకురాలేరు లేరా.....?

"ఎందుకని.....?"

"సరిగ్గా నాలుగు రోజుల క్రిందట దాని పీక నులిమి చంపేసి నేనే దాన్ని కాలువలోకి విసిరేసాను... నవ్వుతూ అసలువిషయం చెప్పాడు భజగోవిందం. ❑

227. సెంట్రల్ జైలులో తన జైలర్ మిత్రుణ్ణి కలుసుకోవడానికి వెళ్ళాడు అవినాష్.

జైలర్ విచారంగా ఉండటం చూసి "అలా డల్‌గా ఉన్నావేంటి....?" అనడిగాడు.

"ఆగస్టు 15 సంధర్భంగా నిన్న మా జైలులో ఖైదీలంతా కలసి రామలీల అనే నాటకం వేశారు....." అన్నాడు జైలర్.

"అయితే....."

"ఆ నాటకంలో లక్ష్మణుడు చనిపోయాడు. హనుమంతుడు పాత్రదారి సంజీవిని పర్వతం తీసుకురావడానికి వెళ్ళాడు......"

239. "మీకు పెళ్ళయింది. ఇంట్లో అందమైన భార్య ఉంది. పైగా మీరు చదవుకున్నారు అయినా మీరు చాలా నీచంగా మీ పక్కింటావిడను ఎందుకు రేప్ చేశారు....? అడిగాడు జడ్జి.

"నాకు రేచీకటి జడ్జిగారూ....! ఆవిడే నా భార్య అనుకొని అలా ప్రవర్తించాను. ఇది నా తొలి తప్పుగా భావించి విశిచిపెట్టేయండి జడ్జిగారూ...! అన్నాడు ముద్దాయి. ❑

240. ఓ పేషెంట్ ఓ నర్సింగ్ హోంలోకి వెళ్ళడానికి మెట్టెక్కుతున్నాడు. అంతలో ఓ ఇద్దరు వ్యక్తులొచ్చి అతన్ని భుజాలమీద మోసుకుపోయి ఒక ఛైర్‌లో కూర్చోబెట్టారు. తర్వాత ఓ కూల్‌డ్రింక్ ఇచ్చారు. ఆ తర్వాత విసనకర్రతీస్కుని విసరసాగారు. ఇదంతా చూసి ఆ పేషెంట్ "ఏమిటోయ్...! ఇన్ని మర్యాదలు చేస్తున్నారు...? మీ హాస్పిటల్ కొత్తగా ప్రారంభించారా...?" అన్నాడు నవ్వుతూ.

"అదేమీ లేదండీ...! మా డాక్టర్‌గారి సంగతి తెలిసి ఈ మధ్య పేషెంట్లు ఏవరూ రావడం లేదు. చాలా కాలం తర్వాత వచ్చిన పేషెంట్ మీరు.. అందుకనీ..." అంటూ వివరించారా కాంపౌండర్లు. ❑

241. "ఇంత డార్క్ కలర్ చీర నీకెందుకే....?" అడిగాడు భర్త. "ఇలాంటి కలరంటేనే మన స్టీలు సామన్ల వాడికి ఇష్టమండీ....!' అంది భార్య.



242. ఒకావిడ ఆయాసపడుతూ వచ్చి పళ్ళ దుకాణంలో ఓ పెద్ద ఏపిల్ బేరమాడింది. తర్వాత ఏపిల్‌ను కోసిపెట్టమని దుకాణదారుని అడిగింది.

"ఎనిమిది ముక్కలుగా కోయమంటారా...?" ప్రశ్నించాడు దుకాణదారుడు.

"వద్దు. .... వద్దు..... ఎనిమది ముక్కలు తినకూడదు. నేను డైటింగ్ చేస్తున్నాను. కాబట్టి నాలుగు ముక్కలు కొయ్యి చాలు....." అందావిడ.

243. బస్సులు, లారీలు, కార్లుతో రద్దీగా ఉండే రోడ్డుని దాటుతున్నారు ఇద్దరు మిత్రులు. ఇంతలో ఒక లారీ ఒక స్నేహితుడికి బాగా ప్రక్కనుండి దూసుకుపోయింది.

"జాగ్రత్తగా లేకపోతే ఈ రోడ్డుమీద ప్రాణాలేపోతాయి...." హెచ్చరించాడు శ్రీను. జ్యోతిషం మీద బాగా నమ్మకమున్న రవి "నాకు ఆయుష్షు చాలా వుంది. కనీసం డబ్భైఏళ్ళు బతుకుతాను. నా ఆయుష్షురేఖ చూడు. జెర్రిపోతులా ఎంతలావుగా ఉందో..." అన్నాడు. "చూస్తుంటే ఆ రేఖ నీకు కనిపిస్తుంది. నాకు కనిపిస్తుంది. మరి ఆ డ్రైవర్లకు ఎలా కనిపిస్తుంది....?" ప్రశ్నించాడు శ్రీను. ❑

244. 'ఆకలితో అలమటిస్తున్నా....' అని అరచిగోలచేస్తున్న ఓ ముష్టివాడికి ఒకతను పది రూపాయలిచ్చి "ఈ పదిరూపయల్తో శుభ్రంగా ఏదైనా కొనుక్కొని తిను. సారాయి త్రాగడానికి మాత్రం ఖర్చు చేయకు..." అని సలహా ఇచ్చాడు.

ఆ సలహా విన్న బిచ్చగాడు "డబ్బు ఎలా ఖర్చు చేయాలో తెలిస్తే మీరు నాకు ఈ పది రూపాయలు ఇచ్చేవారు కాదు...." అన్నాడు ఎదురు సలహా ఇస్తూ. ❑

245. ఒకావిడ డాక్టరు దగ్గర కొచ్చింది. "డాక్టర్...! మా ఆయనకు నోట్లోంచి పొగలు వస్తున్నాయి. ముక్కులోంచి కూడా వస్తున్నాయి, రింగురింగులుగా కూడా వదుల్తున్నారు" అంది. "చూడమ్మా...! సిగరెట్లు కాల్చేవాళ్ళు ఆ పొగ నోట్లోకి లాక్కుని మళ్ళీ నోట్లోంచి, ముక్కులోంచి బయటకు వదలడం మామూలే..! అయినా అలా చూస్తుంటే మనక్కూడా తమాసాగా ఉంటుంది. ఇందులో కంగారు పడాల్సింది ఏమీలేదు..." అన్నాడు డాక్టర్. "సిగరెట్లు తాగితే

233. కాలేజీలో లెక్చరర్ విద్యార్థులనుద్దేశించి చెబుతున్నాడు.
"మహిళలకు 33 శాతం రిజర్వేషన్ కల్పించడం చాలా గొప్ప విషయం. చాలా ఆరోగ్య కరమైన విషయం కూడా....
అది విన్న అబ్బాయిలు కాస్త చిరాకుగా మొహాలు తిప్పుకున్నారు. అమ్మాయిలు మాత్రం ఆనందంగా చప్పట్లుకొట్టారు. కొన్నినిముషాల మౌనం తర్వాత "ఈ రిజర్వేషన్ వంట చేయడంలో కూడా కల్పిస్తే చాలా బావుండేది....." అన్నాడు ఆ భార్యా భాదితుడైన లెక్చరర్.❑

234. మేనేజర్ రంగనాథ్ ఏదో మేటర్ చెబుతున్నాడు. స్టెనో వాసంతి రీఫిల్‌తో నోట్ చేసుకుంటోంది. "వాసంతీ....! రీఫిల్‌తో వ్రాస్తున్నావు పెన్నులేదా...?" ఆశ్చర్యంగా అడిగాడు రంగనాథ్.
"ఉంది సార్... ! కాని నేను ఆరోనెల గర్భిణిని...."
"అయితే ఏమిటి?"
"డాక్టర్ బరువులు ఎత్తొద్దన్నారు......." ❑

235. ఓ ప్రముఖ టీవీ కంపెనీ వాళ్లు ఒక క్విజ్ నిర్వహించారు. అందులో గెలుపొందిన వాళ్ళను విదేశాలకు పంపడానికి నిర్ణయించారు. ఆ పోటీలో మొత్తం నాలుగు జంటలు గెలుపొందాయి. మూడు ఆంధ్రజంటలు. ఒక తమిళజంట. నాలుగు జంటలు విదేశాలకు వెళ్లారు. ఓ రోజు సాయంత్రం భర్తలు నలుగురు బయటకూర్చొని మాట్లాడుకుంటున్నారు.
"ఈ రోజు మనం నలుగురం కలసి ఒక వెరైటీ చేసి మన భార్యలను గొప్ప థ్రిల్ చేద్దాం...." అన్నాడు తమిళ భర్త.
"ఏం చేద్దామంటావ్....?" అడిగారు ఆంధ్ర భర్తలు.
"మంచి గుమగుమలాడే వంటచేసి మన భార్యలకు తినిపిద్దాం...."
"ఓస్...! వెరైటీ అంటే ఏమిటో అనుకున్నాం. ఇది రోజూ ఇంటి దగ్గర చేసే దేగా....!" అన్నారు ఆంధ్ర భర్తలు. ❑

236. ఓ చోట మందుబాబులు మందు కొడుతూ కూర్చొన్నారు. వాళ్ళకు మందువల్ల కలిగే నాష్టాల గూర్చి చెప్పి మందు మాన్పించాలని వాళ్ళదగ్గరకెళ్ళాడు బుచ్చిబాబు.

"సారాయి త్రాగడం మంచిది కాదు. అది మనల్ని మ్రింగేస్తుంది. కాబట్టి మనందరం మందు విడిచిపెట్టేయాలి. ఉదాహరణకు ఒక పెద్ద పాత్రలో నీళ్లు, మరో పాత్రలో సారాయి ఉన్నాయనుకోండి. అప్పుడక్కడికి ఓ గాడిద వస్తే ఆ రెండిటిలో ఏం త్రాగుతుంది."

"నీళ్ళు గ్రాతుంది...." అన్నాడో మందుబాబు.

"ఎందుకని....? " మళ్ళీ అడిగాడు బుచ్చిబాబు.

"అది గాడిద కాబట్టి...." చెప్పాడు మరో మందుబాబు. ❑

237. ఓ పల్లెటూరి వాడు పట్నం వెళ్ళాడు. భోరున వర్షం కురుస్తోంది. అతడు ఆటో దగ్గరకెళ్ళి "గడియార స్థంభం దగ్గరకొస్తావా...?" అనడిగాడు.

"వస్తాను. కాని బోరున వర్షం కురుస్తోంది. కాబట్టి మీటర్‌కు ఏదైనా ఎగస్ట్రా ఇవ్వాలి.. " అన్నాడు ఆటోవాడు.

వెంటనే పల్లెటూరి వాడు భుజం మీద తువ్వాలు తీసి ఆటోవాడికిస్తూ "ఇదిగో....! ఈ తువ్వాలు మీటర్‌మీద వెయ్యి....." అన్నాడు. ❑

238. పెళ్ళి పీటల మీద తనపక్కనున్న అమ్మాయిని చూసి "మోసం....! దగా....!! కుట్ర....!!! నాకు సన్నగా ఉన్న అమ్మాయిని చూపించి ఇపుడు ఈ లావుగా ఉన్న అమ్మాయితో పెళ్ళి జరిపిస్తున్నారు.... అంటూ అరిచాడు పెళ్ళికొడుకు.

"కోప్పడకు బాబూ...! నిజానికి మా అమ్మాయి లావే ! పెళ్ళి కావట్లేదన్న బెంగతో చిక్కిపోయి సన్నగా అయిపోయింది. ఇప్పుడు పెళ్ళి కుదిరిన ఆనందంతో బాగా తిండితిని లావెక్కిపోయింది. అంతే....!" అంటూ వివరించాడు పెళ్ళికూతురు తండ్రి. ❑

'అందులో భాదపడాల్సిందేముంది...?" మళ్ళీ అర్థం కాక అడిగాడు అవినాష్.

"ఇంకేమిటి...? అలా సంజీవిని తేవడానికి నిన్న వెళ్ళిన ఖైదీ ఇంకా తిరిగిరాలేదు....." చెప్పాడు జైలర్. ❑

228. కుండశేశర్వంలో వేలాదిమంది భక్తులు పుష్కరస్నానాలు చేస్తున్నారు. ఉన్నట్టుండి ఓ పదేళ్ళ కుర్రాడు "రక్షించండి...! రక్షించండి...!! మా అక్కమునిగి పోతోంది....." అని అరవసాగాడు. వెంటనే నలుగురు కుర్రాళ్ళు నదిలోకి దూకి ఓ ముసలామెను తీసుకొచ్చి "చూడు బాబూ....! వేమెంత ప్రయత్నించినా మీ అక్కను తీసుకు రాలేకపోయాం. కాని మీ బామ్మకూడా మునిగిపోతుంటే ఈమెను మాత్రం రక్షించగలిగాం...." అన్నారు. "ఫర్వాలేదండి, నిజానికి నదిలో మునిగిపోయింది మాబామ్మే...! కాని మా బామ్మ మునిగిపోయిందని అరిస్తే మీరు నదిలో దూకరని మా అక్కమునిగి పోతోందని అరిచాను....." అంటూ వివరించాడా కుర్రాడు. ❑

29. భర్తను అడుగుతోంది భార్య.

"ఏవండీ...! మొన్న మనమ్మాయిని చూడ్డానికి వచ్చిన అమెరికా సంబంధం వాళ్లు ఏమైనా కబురు పంపారా....."

"అయ్ బాబోయ్...! వాళ్ళు పచ్చి మోసగాళ్ళు. వాళ్ళకు మాత్రం మనమ్మాయిని చేయను.

"ఎందుకని....?"

"ప్రస్తుతం అబ్బాయి ఏం చేస్తున్నాడు అని అంటే అమెరికా అధ్యక్షుడు అన్నారుమరి"..... ❑

రఘునాథ్ మానవ అవశేషాల మీద ప్రయోగాలు చేస్తున్నాడు. ఓ సారి అతని మిత్రుడు దివాకర్ అతని ప్రయోగశాలకు వెళ్ళాడు. అక్కడ ఓ మనిషి పుర్రెను చూసి "అదెవరిది...?" అనడిగాడు.

"అది ప్రముఖ సైంటిస్ట్ న్యూటన్‌ది...." అన్నాడు రఘునాథ్.
"అలాగా... ! మరి ఆ పక్కనున్న చిన్నపుర్రె ఎవరిది...?
"అదీ న్యూటన్‌దే....! అతని చిన్నప్పటిది..." అన్నాడు రఘునాథ్.❑

231. దుర్గకు పెళ్ళి చూపులు జరుగుతున్నాయి. పెళ్ళివారు "అమ్మాయ్....! నీకు పాటలు పాడటం వచ్చా....? అనడిగారు.
"వచ్చండీ.....! అంది దుర్గ.
"అయితే ఓ పాట పాడు......." అన్నారు వాళ్ళు.
"అమ్మో...! నాకు భలే సిగ్గు........ మీరంతా బయటకు వెళ్తే పాడతాను...."
"పర్వాలేదమ్మా.... మేమంతా బయటకెళ్ళామనుకొనేపాడు లేదా కళ్ళుమూసుకొని పాడు...." అన్నారు వాల్ళు మళ్ళీ.
"మీరు బయటకెళ్తేనే పాడతాను.. " ఖచ్చితంగా అంది దుర్గ.
"అక్కా.....! ముందు నువ్వుపాట మొదలుపెట్టవే....! తర్వాత వాళ్లే బయటకు పారిపోతారు......" అన్నాడు ఇంట్లోంచి దుర్గ తమ్ముడు చిన్న. ❑

232. జోగినాధం పేపరు చదువుతోంటే క్రిందివిధంగా ప్రకటన కనిపించింది.
"కొన్ని వేల సంవత్సరాల క్రిందట కనిపెట్టబడిన అదృశ్యవాహిని ఖరీదు. కేవలం రు. 500/- మాత్రమే . ఇది ధరించి మనం అందరినీ చూడవచ్చు. కాని మనల్ని ఎవరూ చూడ లేరు...."
ప్రకటన చదివిన జోగినాధం ఆత్రంగా ఆ అడ్రస్‌కు డబ్బు పంపాడు. అతనికో పార్సిల్ వచ్చింది అది విప్పి చూస్తే



అందులో ముస్లింలు ధరించే ఓ "బురఖా" ఉంది. ❑

పొగలువస్తాయి కరక్టే. కాని మా వారు అసలు సిగరెట్లు త్రాగరు. మరి పొగలు ఎక్కడినుండి వస్తున్నాయో అర్థం కావడం లేదు...." అందావిడ. ❑

246. బొర్రబాబు హోటల్‌కు వెళ్ళాడు. ముందుగా నాలుగు ప్లేట్ల ఇడ్లీ తెప్పించుకుని తిన్నాడు. తర్వాత ఒక థమ్సప్ త్రాగాడు మళ్ళీ రెండు పెసరట్లు తిని ఓ ఐస్‌క్రీం తిన్నాడు. మళ్ళీ ఉల్లిదోసె, మసాలాదోసె తిని టీ త్రాగాడు. మళ్ళీ రెండు ప్లేట్ల పూరీ తినసాగాడు. ఇదంతా చూసి సర్వర్ అడిగాడు "సార్....! మీకు తిండి తినడం అంటే చాలా సరదా అనుకుంటా....." అని.

"అబ్బే...! నాకివేమీ ఇష్టం కాదు. కడుపులో బాగోనప్పుడు డాక్టర్ ఇచ్చే "బై కార్బొనేట్ సోడా అంటే చాలా ఇష్టం. అందుకే ఇలా చెత్తచెత్తగా తిని కడుపులో అజీర్తి చేశాక ఆ సోడా త్రాగుతా..." అని చెప్పాడు బొర్రబాబు. ❑

247. శ్రీ సాయి మెడికల్ షాపు కెళ్ళి 'ఏవండీ...! వెక్కిళ్ళు తగ్గడానికి ఏవైనా టాబ్లెట్లు ఇవ్వండి..." అంది రాధ.

షాపు ఓనర్ సత్తిబాబు చాచిపెట్టి చెంపమీద కొట్టాడు.

"ఎందుక్కొట్టారు...?" కోపంగా అడిగింది రాధ.

"చూశారా..! చూశారా....!! మీ వెక్కిళ్ళు తగ్గిపోయాయి. అలా అకస్మాత్తుగా చిన్న షాక్ ఇస్తే వెక్కిళ్ళు తగ్గిపోతాయన్న మాట...." అన్నాడు సత్తిబాబు.

"బావుంది వరస... వెక్కిళ్ళు నాక్కాదు బయట నిలబడ్డ మా ఆయనకి...." చెప్పింది రాధ. ❑

48. ప్రముఖ సినీతార మాధుర్య కార్లో వేగంగా వెళ్తోంది. ఓ చోట సడెన్‌గా కారు ఆపించి అక్కడున్న ముష్టివాడికి పది రూపాయలు ధర్మంచేసి మళ్ళీ వేగంగా వెళ్ళిపోసాగింది.

"మేడమ్...! అతనికి ఏకంగా పదిరూపాయలు ధర్మం చేశావు. ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు ఆమె పి.ఎ.

"గతిలేక వేషా లకోసం వీధులవెంటపడి తిరుగుతున్న నాకు మొట్టమొదట హీరోయిన్ ఛాన్స్ ఇచ్చిన నిర్మాత అతను. ఆ సినిమాతో నా పాత్రకు గుర్తింపు వచ్చి ఈ స్థాయికిఎదిగాను. కాని సిన్మా ఫ్లాప్ అవడం వల్ల అతను ఆ స్థాయికి దిగిపోయాడు." చెప్పింది మాధుర్య.

249. "రాజూ....! నువ్వు పెద్దయ్యాక ఏం చదువుతావురా...?"

"డాక్టర్ కోర్స్ చదువుతాను. అందుకే ఇప్పట్నుండి జీవశాస్త్రం గణిత శాస్త్రాలను నేర్చుకొంటున్నాను...

"జీవశాస్త్రం డాక్టర్ చదువుకి పనికొస్తుంది. కాని గణిత శాస్త్రం ఎందుకు...?"

"బిల్లులు రాసివ్వడానికి..."

250. "మా వాడికి ఏదైనా మంచి ఉద్యోగం ఇప్పించండి..." ఒక మ మంత్రి దగ్గరకొచ్చి అడిగాడు అప్పారావు.

"అర్నెల్ల క్రిందటే కదా....! మంచి ఉద్యోగం ఇప్పించాను..." ఆశ్చర్యంగా అన్నాడు మంత్రి.

"మీ పదవి పోగానే మావాడ్ని ఉద్యోగంలోంచి తీసిపంపేశారండి....."

251. "ఏరా రవీ...! పక్కింటి శ్రీనుని కొట్టావట తప్పుకదూ....?"

"ముందుతిడితే ఏమీ చేయలేదు. రెండోసారి వెధవ అని తిడితే కొట్టాను నాన్న..!"

"ముందేం తిట్టాడు....?"

"గాడిద కొడకా అని..."





252. ఓ జ్యోతిష్యుడు ఓ చెట్టుకింద ఇలా బోర్డుపెట్టుకొని కూర్చొన్నాడు. "ఇక్కడ మీకు కలిగే సందేహాలన్నింటికి జోష్యం చెప్పబడును. ఫీజు రు. 20/- ప్రతి ఒక్కరు రెండు ప్రశ్నలు మాత్రమే అడగాలి...." అని

జ్యోతిష్కుడు చెయ్యిచూసి "నిన్ను పెళ్ళి చేసుకొనేవాడు ఆనంద్. కా అదృష్టం మాత్రం వినోద్‌దే...." అన్నాడు. ❑

266. "ఏమ్మా...! నువ్వు ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టడం ఇదే ఫస్ట్ టైమా...?' సీతారత్నాని అడిగాడు ఇంటర్వ్యూలో మేనేజర్.

"అవునండీ...! ఎలా కనిపెట్టారు....?" ఆశ్చర్యంగా అడిగింది సీతారత్నం.

బయోడేటాలో పుట్టిన స్థలం అంటే శకుంతల హాస్పిటల్ వార్డ్‌నెంబ 10 అని రాసి ఉంటేనూ..." అన్నాడు మేనేజర్. ❑

267. అర్థరాత్రి పన్నెండు అవుతోంది. పల్లెటూరు నుండి పట్నం వచ్చిన పాపయ్య అడ్రస్ దొరక్క అ సందూ, ఈ సందూ తిరుగుతున్నాడు. అకస్మాత్తుగ ఓ కానిస్టేబుల్ వచ్చి పాపయ్య



నెత్తిమీద ఉన్న ఓ మూటను చూసి "ఏయ్... ఆమూట ఎవరిది..?" అన్నాడు.

"నాదేనండీ.....! " భయంగా అన్నాడు పాపయ్య.

"ఊరూ.......? పేరూ.....?

"పేరు నాపేరేనండీ.... కాని ఊరు మాత్రం ఊరోళ్ళందరిది....." అన్నాడు పాపయ్య. ❑

ఓ గవర్నమెంటు ఉద్యోగి డాక్టర్ దగ్గరకెళ్ళి "డాక్టర్...! డాక్టర్....!! నాకు తలలో ఓ గుండు సూది దిగిపోయింది. అర్జెంటుగా తీయాలి...." అన్నాడు కంగారుగా "అంతకష్టమైన పని నువ్వేం చేశావ్...?" ఆశ్చర్యంగా అడిగాడు డాక్టర్.

"ఫైల్‌మీద తలపెట్టి నిద్రపోయా....? అన్నాడా ఉద్యోగి. ❑

2 9. చేపలు తింటున్న చెంచురామయ్యకి గొంతులో ఒక ముల్లు గుచ్చుకు పోయింది. దాంతో కంగారుపడి వెంటనే డాక్టరు దగ్గరకి పరిగెత్తాడు. డాక్టరు ముల్లును ఏమాత్రం నొప్పి కలగకుండా, చాలా సున్నితంగా జాగ్రత్తగా తీశాడు.

"డాక్టర్‌గారూ...! ముల్లును చాలా చక్కగా తీశారు. ఫీజు ఎంత ఇమ్మంటారు. అన్నాడు చెంచురామయ్య.

"ఆ ముల్లు మీ గొంతులో గుచ్చుకొని మీకు భయం పుట్టించి, కంగారు పెట్టినపుడు మీరిద్దామనుకున్న దాంట్లో నగమిచ్చినా సంతోషమేనండీ...." అన్నాడు ఆ బ్రతకనేర్చిన డాక్టర్. ❑

270. ఇద్దరు పల్లెటూరి రైతులు ట్రెయిన్లో ప్రయాణం చేస్తున్నారు. ట్రెయిన్ ఎక్కేముందు వాళ్ళు ట్రెయిన్లో తినడానికి ఓ డజను అరటి పళ్ళు కొనుక్కున్నారు. రైలు పరిగెడుతూ ఉంది. ఓ రైతు అరటిపండు తీసుకొని తినసాగాడు. అంతలో రైలు ఓ టన్నెల్‌లో ప్రవేశించింది. వెంటనే అరటిపండు తింటున్న రైతు కంగారుపడి పెద్దగా రెండో రైతుతో అన్నాడు.

"ఓరేయ్....! నీవు అరటిపండు తిన్నావా..?

"ఇంకా తినలేదు...? ఎందుకని...?" అడిగాడు సందేహంగా రెండోరైతు.

"సంతోషం....! నువ్వు చాల అదృష్ణవంతుడివి. నేను అరటిపండు తిన్నాను అంతే! గుడ్డివాణ్ణి అయిపోయాను. నాకంటికి ఏమీ కనిపించడం లేదు..... అన్నాడు మొదటి రైతు చాలా భాధగా. ❑

271. "డాక్టర్....! నాకు రానురాను మతిమరుపు మరీ ఎక్కువైపోతోంది."

"ఎలా చెప్పగలుగుతున్నారు....?"

"ఒక్కోసారి పక్కవాడి జేబనుకొని నా జేబు కత్తిరించేసుకుంటున్నాను." ❑

272. అప్పుల అప్పారావును కోపంగా అడిగాడు వడ్డీల విశ్వనాథం.

"గడపొచ్చు కాని దానికో చిక్కొచ్చింది...."

"అదేమిటీ...?"

"బోసు చేసిన ఆప్రయోగం ఫెయిలైపోయింది. అందుకని డబ్బులు లేకుండా ఇల్లు గడవదు అనే కొత్త తసిద్ధాంతాన్ని మళ్ళీ రూపొందించాడు...." చెప్పాడు శేషు. ❑

259. కొత్తగా పెళ్ళయిన కూతుర్ని అత్తవారింటికి పంపుతూ తల్లి పెళ్ళి కొడుకు తల్లితో "వదిన గారూ...! మా అమ్మాయిని ఎంతో గారాబంగా, ప్రేమతో పెంచాం. దానికి అసలు ఏడుపంటేనే తెలియదు. ఇక నుంచి మీరే జాగ్రత్తగా చూసుకోవాలి...' అంది. " అంతగా చెప్పాలా వదినా....! ఏడుపంటే ఏమిటో నేను నేర్పుతానుగా... మీరేమీ ఆలోచించనవసరం లేదు......." చెప్పింది పెళ్ళికొడుకు తల్లి. ❑

260. ఒక వ్యక్తి భార్యకు రవ్వల నక్లెస్ కొనడానికి జ్యూయలరి షాపు కెళ్ళాడు. ఓ నక్లెస్ చూసి "ఇదెంత.....?" అనడిగాడు.

"ఇరవైవేలు...." చెప్పాడు షాపువాడు.

"బాబోయ్...!" అన్నాడా వ్యక్తి.

మళ్ళీ ఇంకో నక్లెస్ చూసి "ఇదెంత....?" అనడిగాడు.

"రెండు బాబోయ్‌లు....' చెప్పాడు షాపువాడు. ❑

!61. రంగనాయుడు దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చొన్నాడు. అంతలో అతని మిత్రుడొకడు వచ్చి "ఏమిటి ఆలోచిస్తున్నావ్....?" అన్నాడు.

"నా అనంతరం నా ఆస్తిలో రెండు లక్షలు నా పెద్దకొడుక్కి, రెండు లక్షలు చిన్న కొడుక్కి, లక్ష నా కూతురికి ఓ లక్ష నా భార్యకు వీలునామా వ్రాసాను..." అని చెప్పాడు రంగ నాయుడు.

"మరైతే ఇంకా ఆలోచనెందుకు....?" అడిగాడు మిత్రుడు.

"అంత డబ్బు ఎలా సంపాదించాలా.....! అని...." చెప్పాడు రంగనాయుడు. ❑

262. "మా అబ్బాయి అస్తమానం నోట్లో వేలుపెట్టుకొని చీకుతున్నాడండి, అంతే కాదు మట్టి కూడా నోట్లో వేసుకుంటున్నాడు....." డాక్టర్తో చెప్పింది సావిత్రమ్మ.

"కంగ్రాణ్ణి తీసుకు రాలేదా.....? అయినా ఈ వయసులో ఇవన్నీ మామూలే. మీరేమీ కంగారు పడాల్సిన అవసరం లేదు...." సర్ది చెప్పాడు డాక్టర్.

"నాకేమీ కంగారు లేదండీ..! మీ కొడలే కంగారు పండుతోంది..." చెప్పింది సావిత్రమ్మ. ☐

263. పిసినారి పాపారావు తన భార్యను తీసుకొని అమలాపురం గడియార స్థంభం నుండి బస్టాండుకు వెళ్తూ మధ్యలో గణపతి స్వీట్ స్టాల్ ముందు ఆగి భార్యను "ఒసేవ్ కాంతం...! ఇంకొక గులాబ్ జాం తింటావేమిటే...? అనడిగాడు. భార్య ఆశ్చర్యంగా "అదేమిటండీ....! నేనసలు ఒక్క గులాబ్ జాం కూడా తినలేదుగా....!" అంది.

"ఛ... ఇంత మతిమరుపైతే ఎలాగోయ్...? మనకు పెళ్ళైన కొత్తలో వచ్చి ఇదే స్వీట్ షాపులో ఓ గులాబ్ జాం తిన్నావు. గుర్తు లేదూ...?" అన్నాడు పాపారావు. ☐

264. "రమా....! నీకసలు బుద్ధుందా...? టైం ఇపుడు ఎనిమిదైంది...? ట్యూషన్ నుండి రావడానికి ఇంతలేటా..? ఆలస్యంగా ఇంటి కొచ్చిన కూతురిపై కోప్పడింది తల్లి.

"నా రోమియో నా వెంట పడ్డాడమ్మా....!" అంది రమ.

"మరి ..... నువ్వు వేగంగా నడచి రావచ్చుగా......!" రెట్టించింది తల్లి.

"నేను వేగంగానే నడిచానమ్మా...! ఆ రోమియోనే నెమ్మదిగా నడిచేవాడు...." అంటూ చెప్పింది రమ. ☐

265. గజలక్ష్మి జ్యోతిష్కుడి దగ్గరకెళ్ళి అడిగింది. "నన్ను ఆనంద్, వినోద్ పెళ్ళి చేసుకోవాలను కుంటున్నారు. ఇద్దరిలో ఆ అదృష్టవంతుడెవరో చెప్పండి...." అని.

జోగినాథం అక్కడి కొచ్చి అతని చేతికి ఇరవైరూపాయలిచ్చి " ఇరవై రూపాయలకు రెండు ప్రశ్నలంటే చాలా అన్యాయం. నేను మూడు ప్రశ్నలడగొచ్చా...?" అన్నాడు.

"అడగకూడదు. ఆ... ఇపుడు మీ రెండో ప్రశ్న అడగండి...." అన్నాడా జోష్యుడు. ❑

253. యోగి పిచ్చివాళ్ళ మీద రీసెర్చ్ చేస్తున్నాడు. దానికి కావలసిన థియరీ కోసం అతను ఓసారి పిచ్చాసుపత్రికి వెళ్ళి ఒక్కొక్క పేషెంట్ వివరాలు కనుక్కోసాగాడు. దానికి డాక్టర్ సహాయం చేయసాగాడు.

ఒకతను ఓ బొమ్మను ముందర వేసుకొని ఏడుస్తున్నాడు.

"ఇతనిది ఓ విచిత్రమైన ప్రేమకథ. ఇతడు ఒక యువతిని ప్రేమించాడు. ఆమె ఇతడిని కాదని వేరొకతన్ని పెళ్ళిచేసుకుంది. అందుకని ఇతడు పిచ్చివాడైపోయాడు...." అన్నాడు డాక్టర్.

యోగి అతని కథవిని నిట్టూర్చి పక్కగది దగ్గరకు వెళ్ళాడు. అక్కడొకడు వెర్రినవ్వులు నవ్వుతూ, జుట్టు పీక్కుంటూ వెకిలి చేష్టలు చేస్తున్నాడు.

"ఈగదిలో వున్నతను ఆమెను పెళ్ళాడిన యువకుడు...." చెప్పాడు డాక్టర్. ❑

254. "కుంకుడుకాయలు కేజీ ఎంత...?"

"పది రూపాయలు...."

"రెండురూపాయలకిస్తావా...?"

"తల గుండు గీయించుకో తల్లీ...! ఆ రెండు రూపాయలు కూడా మిగిలిపోతాయి...." ❑

255. "మీ ఆయన నిన్నెలా చూసుకుంటున్నాడమ్మా..? " కొత్తగా పెళ్ళయ్యాక అమ్మగారింటికి వచ్చిన కూతుర్ని అడిగింది తల్లి.

"ఏం చూస్కోవడంలే అమ్మా...! ఎప్పుడు చూసినా నిద్రపోవడమే.." అని అసంతృప్తిగా అంది కూతురు.

మరి నేను ముందే చెప్పాను కదా..! అసలు ఈ గవర్నమెంటు ఉద్యోగుల్ని పెళ్ళి చేసుకుంటే ఇంతేనని.... " అంది తల్లి. ❑

256. సినిమాల్లో హీరో ఛాన్సులకోసం ప్రయత్నిస్తున్న చక్రవర్తి వేషాలకోసం స్టూడియోలు చుట్టూ తిరిగి వచ్చేసిరికి ఇల్లంతా చిందర వందరగా ఉంది. బెడ్‌రూంలో చీర, జాకెట్ చిరిగి, జుట్టురేగి, బొట్టు చెదిరి భార్య ఏడుస్తూ కూర్చొని ఉంది. చక్రవర్తికి పట్టరాని కోపం వచ్చింది." ఎవడు? వాడెవడు? నిన్నిలా చేసిన దుర్మార్గుడెవడు? వాడి అంతుచూస్తా... నరికి పోగులు పెడతా... అంటూ చిందులేశాడు.

"ఆయనేనండి డైరెక్టర్ శంకర్రావు....వా...." అంటూ మళ్ళీ భోరుమంది.

అంతే ....! చక్రవర్తి కోపం మాయమైపోయింది.

"నిజంగా.....! ఆయనేనా..? ఇప్పుడైనా నాకు హీరో చాన్స్ ఇస్తానని ఏమైనా చెప్పాడా..?" ఆశగా అడిగాడు చక్రవర్తి. ❑

257. చంద్రరావుని అడిగాడు సత్యం

"ఏరా.....! ఇదివరకు బాగా ఎక్కువగా త్రాగేవాడివి. పైగా నీకు మందుకి తోడు మిక్చర్, జీడిపప్పు, సోడా ఉండేవి. ఇప్పుడేమైనా ఇవ మానేశావా? లేదా...?"

"కొంతవరకూ మానేశానురా..!" అన్నాడు చంద్రరావు.

"అంటే ఇదివరకులా రోజు త్రాగకుండా వారానికోసారి త్రాగుతున్నావా....?"

"అహ ...! మిక్చర్, జీడిపప్పు, సోడా మానేశాను. తర్వలోనే మందు కూడా మానేయాలని అనుకుంటున్నాను......" చెప్పాడు చంద్రరావు.

258. శేషు, వాసు మాట్లాడకుంటున్నారు. "ఓరేయ్...! వానూ మన బోసు పైసా ఖర్చులేకుండా ఇంటిని గడపొచ్చని ఓ సిద్ధాంతం కనిపెట్టాడురా...!" అన్నాడు శేషు.

"నిజమా .....! చాలా బాగుందే...! అలాగైతే మనమందరం కూడా ఆ సిద్ధాంతాన్ని పాటించి ఖర్చులేకుండా ఇంటిని గడపొచ్చుగా.....! ఆశగా అన్నాడు వాసు.

"ఏరా.....! తప్పించుకొని తిరుగుతున్నావ్...? నా బాకీ ఎప్పుడు చెల్లిస్తావ్...?"

"వారం ఆగండి సార్....!

"నిజంగా వారం రోజుల్లో ఇస్తావా...?

"కాదు ఎప్పుడిచ్చేది చెబుతాను....." అన్నాడు అప్పారావు. ❑

273. "మా ఆఫీసుకి కొత్తగా వచ్చిన ఆఫీసర్ చాలా స్ట్రిక్టురా...!" అన్నాడు మహేంద్ర.

"ఏం అంత కరుకు మనిషా...?" అడిగాడు సురేంద్ర.

"ఔన్రా... ఆఫీసులో అందరూ ఒకేసారి కాకుండా వంతుల వారీగా నిదురపోవాలని స్ట్రిక్ట్ ఆర్డర్స్ జారీ చేశాడు...." చెప్పాడు మహేంద్ర.

274. నాగేంద్ర ఓ పుస్తకాల షాపుకెళ్ళి పుస్తకాలన్నీ చూస్తున్నాడు. షాపువాడు ఓ పుస్తకం తీసి "సార్.....! మీరు ఈ పుస్తకం తీసుకోండి...." అన్నాడు.

"ఏమిటది...?" అన్నాడు నాగేంద్ర.

"కోరికలు నెరవేర్చుకొనే మార్గాలు. ఈ పుస్తకం చదివితే మీకున్న సగం కోరికలు నేరవేరినట్లే....' చెప్పాడు షాపువాడు.

"అయితే రెండు పుస్తకాలివ్వండి....." అన్నాడు ఆశగా నాగేంద్ర. ❑

275. "ఒకటో తేదీన జీతం తీస్కుని జేబుదొంగ కొట్టేశాడని నీతో అబద్ధం చెప్పి, పేకాటకు, త్రాగుడుకు డబ్బు తగలేసిన పాపాత్ముణ్ణి నన్ను క్షమించు అరుణా...! అన్నాడు భర్త.

"మీ చేతికి ఇమ్మని మీ స్నేహితుడిచ్చిన నాలుగు వేల రూపాయలతో మీకు చెప్పకుండా పట్టుచీర కొనుక్కున్న మహావంచకిని మీరు కూడా నన్ను క్షమించండి...." అంది భార్య. ❑

276. బస్సు యాక్సిడెంటు కేసు కోర్టులో విచారణ జరుగుతోంది. డ్రైవర్ని జడ్జి ప్రశ్నిస్తున్నాడు. "ఏవయ్యా...! డ్రైవరూ నువ్వు నడుపుతున్న పల్లంకుర్రు నుండి కాకినాడ వెళ్లే బస్సు గెద్దనాపల్లిలో మాదమ్మ అనే ఆడమనిషిని చంపింది ఔనా....?

"ఔనండీ.....!"
"మరి ప్రమాదం జరిగిన తర్వాత వెనకనుండి జనం అరుస్తూ, గోలచేస్తున్నా కూడా నువ్వు బస్సు ఎందుకు ఆపలేదు....?"
"అది నాన్‌స్టాప్ బస్సండీ..గెద్దనాపల్లిలో ఆపకూడదు....." అన్నాడు డ్రైవరు. ❑

277. "కృష్ణా ...! నిన్న నీ కిచ్చిన సుఖనిద్రకు మార్గాలు" అనే పుస్తకం పూర్తిగా చదివావా...." అడిగాడు విష్ణు.
"రాత్రి చదువుదామనే పుస్తకం తెరిచాను. కాని ఈలోగ మత్తుగా నిద్రముంచుకొచ్చేసింది. అందుకే చదవలేకపోయాను...." చెప్పాడు కృష్ణ. ❑



278. మా అబ్బాయికి మీకు తెలిసిన మంచి సంబంధం ఒకటి చూడండి. దించిన తల ఎత్త కూడదు....." అన్నాడు సన్యాసిరావు.
"పాతపేపర్లు ఏరుకునే ఒకమ్మాయి ఉంది. చూస్తారా......?" అడిగాడు అప్పారావు. ❑

279. "ఎందుకురా అలా ఏడుస్తున్నావు.....?
"అమ్మ కొట్టింది డాడీ....!"
"ఈ మాత్రం దానికే ఏడ్వాలా....? భరించాలి నేనెప్పుడైనా ఏడ్చానా? చెప్పు...? ❑

280. "డాడీ....! రాత్రిళ్ళు మీకు భయమేస్తుందా...?
"అబ్బే...! నేనెవరికీ భయపడను. అయినా నీకెందుకొచ్చిందా అనుమానం..."
"మరి, రాత్రి మమ్మీ దగ్గరే ఎందుకు పడుకుంటారు...? ❑

281. పిట్టగోడదగ్గర ఇరుగింటావిడ, పొరుగింటావిడ మాట్లాడుకుంటున్నారు.
"అల్లూరి సీతారాజుని బ్రిటీష్‌వాళ్ళు కాల్చి చంపారట. అయినా గాంధీగారు ఇంకా 'అహింస', 'అహింస' అంటున్నారు.

"ఇలా అయితే మనకి స్వతంత్రం ఎప్పుడొస్తుందో ఏమిటో...?"
అప్పుడే అక్కడికొచ్చిన ఒకతను కోపంగా చెప్పాడు.
"మనకి స్వాతంత్ర్యం వచ్చి యాభై సంవత్సరాలైంది. ఇప్పటికైనా మీకబుర్లు ఆపుతారా? లేదా...?" ❑

282. అనుకున్న ప్రకారం శేషు, భవాని పార్క్‌లో కలుసుకున్నారు.
"నేను రాత్రంతా మన గురించి ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చాను భవానీ.." అన్నాడు శేషు...
"ఏమిటది....? త్వరగా చెప్పు....?" అంది భవాని.
"మనిద్దరం కలసి కొన్ని రోజులు ఎక్కడైనా గడుపుదాం. ఒక వేళ అప్పుడు మనకు సరిపడదనీ, పొరబాటు చేశామనీ అనుకుంటే ఎవరిదారిన వాళ్లు వెళ్ళిపోవచ్చు..." అన్నాడు శేష/ ఆవేశంగా.
"ఆలోచన బాగానే ఉంది కాని ఆ తర్వాత పొరబాటును ఎవరు పెంచుకుంటారు?" అనుమానంగా అడిగింది భవాని. ❑

283."డాక్టర్ గారూ..! నా కుడికాలు ఒకటే నొప్పిగా ఉందండీ...! నొప్పి భరించలేకుండా ఉన్నాను. మీరే కాపాడాలి అన్నాడు రైతు రంగన్న.
"పెద్ద జబ్బేమీకాదు. వయస్సు ముదరలా. అందువల్లే......" అన్నాడు డాక్టర్.
"అదికాదు డాక్టర్....! నా రెండు కాళ్ళకు ఒకటే వయస్సు కదా...! మరి ఎడమకాలు బాగానే ఉందిగా....!" అన్నాడు రంగన్న. ❑

284. "నేనీ వాక్యం పూర్తిచేసేలోగా నువ్వొక పచ్చి అబద్ధం చెబితే నీకు వందరూపాలిస్తాను..." అన్నాడు సూరి.
"అదేమిట్రా.... వెయ్యి రూపాయలిస్తానని వందకు తగ్గించేశావ్....?" అన్నాడు తెలివిగా రవి. ❑

285. "శివయ్యా....! నువ్వేదో ఉత్తముడివనీ, పెద్దమనిసివనీ చాలా భ్రమపడ్డాను...."
"నీ విషయంలో నేనూ అలాగే పెద్దమనిషివనుకొని భ్రమపడ్డాను...."
"నువ్వనుకున్నది కరెక్ట్. నేను పొరబడ్డాను....." ❑

286. కాట్రేనికోన శివారున ఓ కట్టుకర్రకు కట్టబడి బాగా మేతమేస్తూ ఉంది ఒక గేదె. దాన్ని చూసిన పరంధామయ్య కాస్త దూరంలో పని చేసుకుంటున్న కూలీని పిలిచి "గేదె చాలా బావుంది. పాలు బాగ ఇస్తుందనుకుంటా... ఇంతకూ ఎవరిదిది?" అనడిగాడు.
"గేదె ఎవరిదో తెలీదుకాని పక్కనున్న దూడ మాత్రం తెలుసండీ...."
"సరే! దూడెవరిదో చెప్పు...."
"ఆ గేదెదే... " చెప్పాడు కూలీ. ❑

287. అంబాజీపేట నుండి ఎదుర్లంక వెళ్ళే బస్సు వాయువేగంతో దూసుకుపోతోంది. మురమళ్ళలో దిగడానికి డోర్ దగ్గరకొచ్చి నిలుచున్నాడు రామనాధం. డ్రైవర్ బస్సు ఆపలేదు. బస్సు అలాగే దూసుకుపోతోంది. రామనాధం కోపంగా "ఏవయ్యా...! డ్రైవరూ...! మురమళ్ళలో బస్సు ఆపలేదూ...? చాలా దూరం తీసుకొచ్చావ్...!" అన్నాడు "కాస్త దగ్గరకొచ్చి నన్ను లేపొచ్చు కదయ్యా....! బస్సు స్టార్ట్ చెయ్యగానే మాంచి నిద్రపట్టేసింది...." అన్నాడు ఆవలిస్తూ డ్రైవర్.

288. "ఏమిటోరా సూర్యం....! ఈ ఆడవాళ్ళకు అసలు డబ్బంటే లెక్కలేకుండా పోతోంది. మా ఆవిడైతే మరీనూ....! డబ్బులు ఏమైన చెట్లకు కాస్తున్నాయనుకుంటుందోఏమో..! అన్నాడు చిరాగ్గా చిదంబరం.
"ఏమైందిరా అలా విసుక్కుంటున్నావ్....?" అడిగాడు పీతాంబరం.
"విసుక్కోక ఏం చేయాలి....? నేనెంతో కష్టపడి సంపాదిస్తుంటే మా ఆవిడ నా పుట్టినరోజుకి వెయ్యిరూపాయలు అడుగుద్ది. దాని పుట్టిన రోజుకి వెయ్యి అడుగుద్ది. పిల్లల పుట్టిన రోజుకి ఐదు వందలు అడుగుద్ది. పండగలొస్తేనే ప్రతి పండక్కి వెయ్యి రూపాయలు అడుగుద్ది. డబ్బంటే అసలు లెక్కలేదు....."
"ఇంతకూ ఈ డబ్బంతా ఏం చేస్తుందంటావ్.....?" సందేహంగా అడిగాడు పీతాంబరం.

"ఇంతవరకూ నేనెప్పుడు డబ్బులివ్వలేదుగా తెలియడానికి...." అన్నాడు చిదంబరం. ❑

289. "మా మేనేజర్‌కు ఎప్పుడు ఇంటి జ్ఞాపకమే........"



"ఏమైందేమిటి.....?"

"మధ్యాహ్నం భోజనాలు పూర్తి కాగానే ఆయన కేరేజీతో బాటు మా అందరి కేరేజిలు కూడా కడిగేస్తారు...." ❑

290. "హమ్మయ్య.....! నీతోమాట్లాడిన ఈ రెండు గంటలూ రెండు క్షణాల్లాగ దొర్లిపోయాయి. నీతో మాట్లాడ్డం వల్ల నా తలనొప్పి పూర్తిగా పోయింది...."

"తలనొప్పి ఎక్కడికీ పోలేదు నీ దగ్గర నుంచి నాకు వచ్చిందంతే...."

291. రామ్‌లాల్, ప్యారేలాల్ వాళ్ళకొట్లో బేరాల గురించి తెగ గొప్పలు చెప్పుకుంటున్నారు.

"మా కొట్లో బేరాలు చాలా బ్రహ్మాండంగా సాగుతున్నాయి. రాత్రింబవళ్ళు ఒకటే బేరాలు ఉండటం వల్ల తలుపులు ముయ్యడమే మానేశాము...." అన్నాడు రామ్‌లాల్.

"మీ దుకాణంలో కంటె మా దుకాణంలో ఇంకా ఎక్కువ రద్దీగా ఉంది. అందుకని నేను తలుపులు తీయించి మొత్తం పొయ్యిలో పెట్టించేశాను...." అన్నాడు ప్యారేలాల్. ❑

292. పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుండి కానిస్టేబుల్ కనకరాజు స్టేషన్‌కి ఫోన్ చేసి మాట్లాడుతున్నాడు.

"హలో...! ఎస్.ఐ.గారేనా...?

"ఔను.... నువ్వెవరు....?

"నేను సార్...! కనకరాజుని. అమలాపురం వెంకటరామ థియేటర్

ఎదురుగా పెద్ద దోపిడీ జరిగిపోయింది. అందరూ పారిపోయారు ఒక్కడు మాత్రం దొరికాడు. పోయిన సొమ్ము లక్షరూపాయలు...."

"అలాగా....! వాణ్ణి వెంటనే స్టేషన్‌కు తీసుకురా....! నిజాన్ని కక్కిద్దాం...!"

"నిజం వాడే కక్కేసాడు సార్.....!"

"ఏమన్నాడు.....?"

" లూఠీలో లక్షరూపాయలు పోగొట్టుకున్నానన్నాడు సార్.....!" ❑

293. "ఏరా తమ్ముడూ....! ఎక్కడికి పరిగెత్తుతున్నావ్....?" కంగారుగా వెళ్తున్న తమ్ముణ్ణి అడిగింది అక్క.

"అందరూ సూర్యగ్రహణం చూడ్డానికి వెళ్తున్నారు. అందుకని నేనూ వెళ్తున్నా...."

"కాస్త దూరంగా ఉండి చూడు. దగ్గరకెళ్లే ప్రమాదం...." అంది అక్క.

294. రెండు నెమళ్ళను తీసుకొని పోలీస్ స్టేషన్ కెళ్ళాడు అమాయకరావు.

"ఇవిగోసార్....! ఇవి రోడ్డు పక్కన దొరికితే తీసుకొచ్చాను....." అన్నాడు ఇన్‌స్పెక్టర్‌తో.

"ఇవి ఇక్కడి కెందుకు....? జూకి తీసుకెళ్ళవయ్యా..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అమాయకరావు వెళ్ళిపోయి మళ్ళీ మర్నాడు ఆ రెండు నెమ్మళ్ళనూ తీసుకొని వచ్చాడు.

"ఏవయ్యా....! పెద్దమనిషీ....! వీటిని మళ్ళీ ఇక్కడకు తెచ్చావ్....! నిన్న జూకి తీసుకెళ్ళమని చెప్పానుగా....!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కోపంగా.

"నిన్న జూకి తీసుకెళ్ళి వీటిని జూ అంతా తిప్పి చూపించాను సార్...! మరి ఈ వేళ సినిమాకి తీసుకెళ్ళమంటారా...?" అడిగాడు అమాయకరావు.

295. "ప్రమాదం జరిగినపుడు మీలో బాగా త్రాగి కారు నడిపిందెవరో చెప్పండి...?" గద్దించాడు ఇన్‌స్పెక్టర్.

"అందరం త్రాగే ఉన్నాం సార్...! కాని డ్రైవర్‌కి డోసు చాలక మందు కోసం వెనక సీట్లోకి వచ్చాడు అంతే.....!" అంటూ వివరించాడు త్రాగుబోతుల్లో ఒకడు. ❑

296. లావుపాటి లావణ్య తన స్నేహితురాలు శరణ్య ఇంటి కెళ్ళింది. శరణ్య పిండివంటలు చేసి ఇరవై గారెలు, పాతిక మసాల వడలు, పాతిక పునుగులు పెట్టింది. లావణ్య మొత్తం అన్నీ లాగించేసి ఓ వడ, ఓ గారె, ఓ పునుగు ఉంచింది.

"ఈమూడు ఎందుకు ఉంచేశావ్...? ఫర్వాలేదు ఇవికూడా తిను..." అంది శరణ్య.

"నీ కంటికి నేను తిండిపోతులా కన్పిస్తున్నానేమిటే...? ఇంకేమీ తినలేను. పైగా ఈ మధ్య డైటింగ్ చేస్తున్నాను....." అంది లావణ్య.

297. "సార్...! ఈ నాలుగేళ్ళ నుండి మన కంపెనీలో నలుగురు మనుషుల పనిని నేనొక్కడినే చేస్తున్నాను. నా జీతం మీరస్సలు పెంచలేదు....." బాధపడ్డాడు గుమస్తా గుర్నాధం మేనేజర్ దగ్గరకెళ్ళి.

"ఏమిటీ.....! నువ్వు నలుగురు మనుషుల పనిచేస్తున్నావా? అయితే ఆ మిగతా ముగ్గురు ఎవరో చెప్పు. నీ చేత పని చేయిస్తున్నందుకు వెంటనే వాళ్ళను పీకి పారేస్తాను...." గర్జించాడు మేనేజర్. ❑

298. చాలాకాలం తర్వాత కన్పించిన ఇద్దరు మిత్రులు మాట్లాడుకుంటున్నారు.

"ఏరా....! సుభాష్... చాలాకాలానికి కన్పించావ్. ఎలా ఉన్నావ్...?"

"1997 వరకూ ఏ చీకూ, చింతా లేకుండా హాయిగా ఉన్నానురా....!"

"మరి ఆ తర్వాత ఏమైంది.....?

"నాకు పెళ్ళయింది...." ❑

299. "రోజూ రాత్రి భోజనాలు పూర్తయ్యాక నేను చెప్పే మాటలు వినడానికి నా భార్య చెవి కోసుకుంటుందంటే నమ్మండి...." అన్నాడు జోగినాధం.

"ఏమిటా మాటలు...?" అడిగాడు రంగనాథం.

"వాటిని అలావదిలెయ్, నేను కడుగుతాను, నేను తోముతాను మొదలైన మాటలు...." అన్నాడు జోగినాథం. ❑

300. "మొట్టమొదటిసారిగా నా భార్య నేను చెప్పిన మాట వెంటనే విన్నాధోయ్....!" ఆనందంగా అన్నాడు ఆనందరావు.

"ఏం చెప్పావ్...?" అడిగాడు అర్జునరావు.

"మొన్న మా ఇల్లు అంటుకుపోతుంటే ఇంట్లోంచి బయటకు వచ్చేయమన్నాను. అంతే..! చెప్పీ చెప్పగానే వచ్చేసింది....." ❑

301. క్లాసుకు ఆలస్యంగా వచ్చిన ఇద్దరు విద్యార్థులపై కొప్పడుతున్నాడు మాష్టారు.

"ఏరా....! హరీ..! క్లాసుకెందుకింత ఆలస్యమైంది....?"

"నానీ రూపాయి నాణేం రొడ్డుమీద పడిపోతే వెతుకుతున్నాను. కన్పించలేదండీ....."

"నానీ....! మరి నీకెందుకు ఆలస్యమైంది....?

"నేను ఆ రూపాయి నాణేం మీద నిలబడ్డానండీ...." ❑

302. "లాటరీలో రెండు లక్షలు గెల్చుకున్నావ్. ఇంకా బాధ పడుతూ కూర్చున్నావేమిట్రా....?"



"నేను కొన్నవి రెండు టిక్కెట్లు. రెండోదానికి కనీసం ఒక్క రూపాయి కూడ తగల్లేదు మరి...." ❑

303. "మీ అమ్మాయికి సావిత్రి అని మీ అత్తగారి పేరు పెట్టుకున్నావ్. అవిడంటే నీకు ఎంత ప్రేమ నాగమనీ...!" అంది రాజమణి.

"ప్రేమ పాడా....! నేనెలాగూ మా అత్తగార్ని తిట్టలేనుగా.. అందుకని..."

304. "హర్షవర్ధనుడు ఏ యుద్ధంలో మరణించాడురా సోమూ....?"
"ఆయన చేసిన ఆఖరి యుద్ధంలోనండీ..." ❑

305. తొమ్మిదేళ్ళ చిన్నా వాళ్ళనాన్నను అడిగాడు
"నాన్నా.....! నీ తల వెంట్రుకలు తెల్లబడుతున్నాయేమిటి....?"
"నువ్వు చేస్తున్న ఒక్కో వెదవ పనికీ ఆలోచిస్తుంటే నాతలలో ఒకో వెంట్రుక తెల్లబడుతోంది..." అన్నాడు తండ్రి. తండ్రిని ఎగాదిగా చూసి అన్నాడు మళ్ళీ చిన్నా.
"ఇప్పుడు అర్థమైంది నాన్నా.....! తాతయ్య తల మొత్తం ఎందుకు తెల్లబడిపోయిందో..." ❑

306. "పెళ్ళికాక ముందు అమ్మాయి బాగా పొదుపు చేస్తుంది అని చెబితే మంచిదే కదా... అని పెళ్ళి చేసుకున్నాను...."
"మరి ఇప్పుడేమైంది.....?"
"గెడ్డాన్ని కత్తిపీటతో గీసుకోమంటోంది.." ❑

307. పెళ్ళి జరుగుతోంది. అప్పుడే వచ్చి రాణిని చూసి "రండి...! రండి....!!" అంటూ నవ్వుతూ ప్రక్కకూర్చిలోకి ఆహ్వానించింది వాణి.
"మిమ్మల్ని నేనెక్కడా చూసినట్లు లేదు. నేను మీకు తెలుసా...?" ఆశ్చర్యంగా అడిగింది రాణి.
"అబ్బే....! రెండేళ్ళ క్రితం నేను బోడసకుర్రు పెళ్ళికి వచ్చాను. అపుడు చూసిన మీ మెళ్ళో కాసులపేరుని చూసి గుర్తుపట్టాను..." అంది వాణి.

308. "మీరు చాలా కష్టపడి నా భార్యను కాపాడారు. మీకు ఎంత ఇమ్మంటారు....?" అడిగాడు రాజశేఖరం.
"ఎంతైనా ఇవ్వండి. మీ దృష్టిలో మీ భార్య విలువ ఎంతనుకుంటే అంత ఇవ్వండి."
ఆశగా అన్నాడు డాక్టర్. వెంటనే అతని చేతిలో పదిపైసల నాణెం పెట్టి వెళ్ళిపోయాడు రాజశేఖరం. ❑

9. "అదేమిటే...! మీ ఆయన పదినిముషాలకోసారి నీ నెత్తిమీద నీళ్లు చల్లుతున్నాడు?"
"నా నెత్తిమీద కాదు. నేను పెట్టుకున్న పూలమీద. ఆయన పూలకొట్లో పనిచేస్తారు...." ❑

10. కానిస్టేబుల్ అడిగాడు అమ్మాయిని
"మిమ్మల్ని గట్టిగా ముద్దుపెట్టుకున్న రోమియో ఎవరో తెలియకుండా ఎవరి పైన కేసు పెడతాం. అయినా ముద్దుపెట్టుకుంటుంటే అతని ముఖం చూడకుండా ఎలా ఉన్నారు మీరు...?"
"తన్మయత్వంతో కళ్లుమూసుకోవడం వల్ల చూడలేదు..." అం అమ్మాయి. ❑

11. "సినీ నటిని పెళ్ళి చేసుకోవడం తప్పని పెళ్ళయ్యాక తెలిసింది.... అన్నాడు రుషి.
"ఏమైందేమిటి...? " అడిగాడు శశి.
"మరో ఆరునెలల వరకూ మా శోభనానికి కాల్షీట్స్ లేవంది....." ❑

12. "మామయ్యా...! నాకు మీ అమ్మాయి ప్రవర్తన అసలు నచ్చడం లేదు వంట నాచేత చేయిస్తోంది. బట్టలు నన్నే ఉతక మంటోంది. చివరిక అంట్లుకూడా నా చేతనే తోమిస్తోంది. ఇలాగైతే ఇక మీ అమ్మాయితో కాపురం చేయలేను..."
"ష్....ఊరుకో అల్లుడూ...! ఇలాంటి విషయాలు వీధిలోనా మాట్లాడేది? వంట గదిలోకి వెళ్ళి వంటచేస్తూ మాట్లాడుకుందాం పద..." ❑

313. "వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చేయమన్నారు."
"కాని నేను మాత్రం ఒకే ఒక్క అబద్ధమాడి దేవిని పెళ్ళి చేసుకున్నాను.."
"ఏమని అబద్ధమాడావ్....?"
"నాకు గతంలో పెళ్ళికాలేదని....." ❑

314. నాగేష్ పెట్టె సర్దుకుంటూంటే అడుగున ఒక స్లిప్ కనిపించింది అది ఐదుసంవత్సరాల క్రిందట టైలరింగ్‌షాపులో బట్టలు కుట్టడానికి ఇచ్చిన బట్టలతాలుకు రశీదు. ఆ స్లిప్ తీసుకొని టైలర్ దగ్గరకెళ్ళి తన బట్టలు ఇమ్మన్నాడు నాగేష్. టైలర్ లోపలికి వెళ్ళి అరగంట తర్వాత తిరిగొచ్చి "సార్...! మీ బట్టలకు ఇంకా చిన్న చిన్న పనులున్నాయి రెండ్రోజుల్లో రండి..." అన్నాడు. ❑

315. రాజ్యలక్ష్మి ఓ కథరాసి భర్తకు వినిపిస్తోంది. "భర్త ఆఫీసు నుండి వచ్చాడు. అంతే....! భార్య భర్తను బెడ్ రూంలోకి లాక్కొచ్చిగాఢంగా కౌగిలించుకొని ముద్దుల్తో ముంచేయ సాగింది..."



"ఎందుకు...? భర్తకు ఆరోజే జీతం అందిందా....?" అడిగాడు భర్త. ❑

316. "ఆరునెలలుగా నన్ను వదిలేసి విడాకులు ఇవ్వడానికి కూడా సిద్ధపడ్డ నాభర్త నాకు మగపిల్లాడు పుట్టగానే కాపురానికి తీసుకొచ్చాడు ప్రమీలా....!"

"అదృష్టవంతురాలివి నాకు మగపిల్లాడు పుట్టగానే నా భర్తనాకు విడాకులు ఇచ్చేశాడు సుశీలా..."

"ఎందుకని.....?

"ఆయన వేసక్టమీ చేయించుకున్న సంవత్సరానికి పిల్లాడు పుట్టాడులే..."

317. "సార్ ...! మెడికల్ కాలేజీ వాళ్ళు అర్జెంటుగా ఒక శవాన్ని పంపమని ఫోన్ చేశారు." అంది నర్సు.

"అలాగా....! అయితే పదో నెంబరు బెడ్‌మీదున్న పేషెంటును ఆపరేషన్‌కు సిద్ధం చెయ్యి...." చెప్పాడు డాక్టరు. ❑

18. మామగారితో కోపంగా అన్నాడు అల్లుడు.

"మొన్న సక్రాంతికి మీరు స్కూటర్ ఇచ్చారు గుర్తుందా....?"

"ఇచ్చింది ఎందుకు గుర్తుండదు...?"

"దాని ఓనర్ పోలీసుల్తో సహా వచ్చి నిన్న దాన్ని పట్టుకుపోయాడు...."

319. "యుద్ధాలవల్ల కలిగే నష్టాలేమిటో చెప్పరా కిట్టూ...." ప్రశ్నించాడు టీచర్.

"ఇంట్లో జరిగే విషయాలు బయటచెబితే తాట వలిచేస్తామని మా మమ్మీ, డాడీ చెప్పారు సార్...!" అమాయకంగా చెప్పాడు కిట్టూ.

320. "ఏమిట్రా.....! గుండు చేయించావ్.....? తిరుపతి వెళ్ళావా? లేక అప్పనపల్లి వెళ్ళవా....?"

"అదేమీ లేదురా.... నిన్న మా ఆవిడ తలస్నానం చేయించింది......"

321. "మా ఆయన భీముడు లాంటివారు...." చెప్పింది మహిజ.

"అంత బలంగా, కండపుష్టితో ఉంటారా....?" అడిగింది వనజ.

"కాదు.... అంత ఎక్కువగా తింటారు..." చెప్పింది మహిజ ❑

322. "రాజూ.....! పతివ్రతలంటే ఎవర్రా....?"

"నలుగురైదుగురు మగాళ్ళతో కాపురంచేసే ఆవిడ సార్. ఉదాహరణ ద్రౌపది...." ❑

323. "సబ్ ఇన్‌స్పెక్టర్ గారూ...! నిన్న నేను ఊళ్లో లేనపుడు మా యింట్లో పడ్డ దొంగను ఓసారి చూడనిస్తారా...?"

"ఎందుకు...?"

"వాడితో ఓ విషయం మాట్లాడాలి....."

"దేని గురించి....?

"అదేనండి... అంత సులువుగా మా ఆవిడని స్థంభానికి కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కేయడం ఎలా సాధ్యమైందో తెలుసుకుందామని...."❑

324. "ఏవండోయ్...! ఇప్పడే మీ కోసం మీ మేనేజర్ వచ్చి వెళ్ళాడు..."

"అలాగా...? ఏం చెప్పావ్...?

"నా బట్టలు ఉతుకుతున్నారని చెబితే బావుండదని వంటచేస్తున్నారని చెప్పాను...." ❑

325. పాపారావు పరమ పిసినారి అతని తీరు చూస్తే అలాంటి పిసినారి అసలు లోకంలోనే ఉండడు అనిపిస్తుంది



ఓసారి భార్య దగ్గరకు చిన్న పొట్లాం తెచ్చి "పంచదార ఇదుగో....! దాచిపెట్టు...." అన్నాడు.

"ఈ కొంచెం పంచదార దాచిపెట్టాలా.... ? అయినా ఇదెక్కడ తెచ్చారు..?" ఆశ్చర్యంగా అడిగింది భార్య.

"బయట అరుగుమీద చీమలు తీసుకువెళ్తుంటే జాగ్రత్తగా వాటి నోట్లోంచి గంట సేపట్నుండి తీసి తెచ్చాను..." చెప్పాడు పాపారావు.

326. సుందర్రావు భార్య కమలమ్మకు జ్వరంగా ఉందని హాస్పిటల్‌కు తీసుకెళ్ళాడు.

డాక్టరు దర్మామీటరు తెచ్చి ఆమె నోట్లో పెట్టి "నోరుముయ్యి..." అన్నాడు.

ఆమె నోరు మూసేసింది తర్వాత డాక్టరు రీడింగ్ చూసి మందులు రాసిచ్చాడు.

సుందర్రావు భార్యను తీసుకెళ్ళి బయట కూర్చోబెట్టి మళ్ళీ డాక్టరు దగ్గర కొచ్చాడు.

"డాక్టర్...! ఇంధాక నా భార్య నోట్లో పెట్టారే.... అది నాక్కావాలి...." అన్నాడు.

"ఓ అదా...! ధర్మామీటర్ అయినా అది మీ కెందుకు....?" అడిగాడు డాక్టరు.

"ఇన్నాళ్ళూ నేను మూయించలేని నా భార్యనోరు అది మూయించిందిగా.... అందుకు.." చెప్పాడు సుందర్రావు.

327. "ఇదిగో.... మీ అబ్బాయిని కాస్త అదుపులో పెట్టుకోండి. మా యింట్లో ఉన్న టీ.వీ మీద రాయి విసిరాడు..." అన్నాడు జగ్గారావు.

"రాయి టీవీకి తగిలిందా...?" అడిగాడు అన్నారావు.

"లేదు.... కొంచెంలో తప్పిపోయింది....."

"అలాగయతే అది మా కుర్రాడు విసిరింది మాత్రం కాదు..." తేల్చేశాడు జగ్గారావు. ❑

328. సత్యమూర్తి టాక్సీలో కొత్తపేట వెళ్తున్నాడు. టాక్సీ వేగంగా వెళ్తుండడంతో ఆనందంగా "డ్రైవర్...! నువ్వు చాలా ఎక్స్‌పర్ట్‌వోయ్...! అబ్బ... నాకైతే ఏకంగా విమానంలో వెళ్తున్న అనుభూతి కలుగుతోంది. ఇంత స్పీడ్ డ్రైవింగ్ నేను జన్మలో చూడలేదంటే నమ్ము. ఇంకాస్త వేగం పెంచినా ఫర్వాలేదు..... హూ....." అన్నాడు. "మీరు ఊర్కోండిసార్.. ఇందాకట్నుంచి కారుబ్రేకులు పడక ఛస్తున్నాను....'" కంగారుగ చెప్పాడు డ్రైవర్. ❑

329. "మీ అబ్బాయి నిద్రలో నడిచేవాడు. ఇపుడు ఆ అలవాటు మానుకున్నాడా? లేదా?"

"మానుకున్నాడు..... కాని ఇపుడు నిద్రపోయేటపుడు పక్కలో సైకిల్ పెట్టుకొని నిద్రపోతున్నాడు......."

"అదెందుకు.....?"

"నడవడం విసుగ్గా ఉందట. ఇప్పుడు సైకిల్‌పై పోతున్నాడు.........."

330. "డాక్టర్.....! నాలో నేను మాట్లాడేసుకుంటున్నాను......."

"డోంట్ వర్రీ....... చాలామంది ఇలాగే మాట్లాడేసుకుంటారు ........."

"అదికాదు డాక్టర్........! నాలోనేను ఇంగ్లీషు మాట్లాడేసుకుంటున్నాను. నాకు ఇంగ్లీషు ఒక్క ముక్క కూడా అర్థమయ్యి చావదు......"

331. "బద్ధకం వదిలించుకోవడం ఎలా.....?" అనే పుస్తకాన్ని రాస్తున్నానని ఓసారి చెప్పావు. పూర్తయిందా....?" అడిగాడు కృష్ణమూర్తి.

"రెండు సంవత్సరాల నుండి ఓ పది పేజీలు మాత్రం రాశాను. బద్ధకం వల్ల స్పీడ్‌గా రాయలేకపోతున్నాను..... అంతే....!" చెప్పాడు బద్ధకంగా భట్టుమూర్తి. ❑

332. సైక్రియాట్రిస్టు ముకుందరావు పేషెంట్స్‌ను చూస్తున్నాడు. కన్నారావును అడిగాడు.

"ఆ........ నీ సమస్యేమిటో చెప్పవోయ్......." అని.

"ఏమిటో అర్థం కావడం లేదురా...... ఈ మధ్య ప్రతివాణ్ణి నా ఫ్రెండ్‌లాగా భావించేస్తున్నాను. నీయబ్బా..... అసలు నా జబ్బు ఏమిటంటావురా..... వెధవాయ్.......?" అన్నాడు కన్నారావు. ❑

333. "ఓరి భగవంతుడా.......! నీవే కనుక ఉంటే అర్జెంటుగా తాజ్‌మహల్‌ని కాశ్మీర్‌లోకి మార్చాలి..." అన్నాడు వాసు.

"ఒరేయ్ వాసూ....! నీకేమైనా మతిపోయిందా...? తాజ్‌మహల్‌ను కాశ్మీర్‌లోకి మార్చడమేమిటి....?" అడిగాడు వాసువాళ్ళ నాన్న.

"ఔను నాన్న పొద్దున్న పరీక్షలో తాజ్‌మహల్ ఎక్కడుంది అంటే కాశ్మీర్‌లో అని రాశాను...." చెప్పాడు వాసు. ❑

334. ఓ పార్కులో ప్రేయసీ ప్రియులు మాట్లాడుకుంటున్నారు.

"నవీన్ ....... నువ్వు త్రాగుతావా....?"

"త్రాగను......."

"సిగరెట్లు కాలుస్తావా.......?"

"కాల్చను........"

"బ్లూ ఫిలింటు చూస్తావా.......?"

"అసలు ఎప్పుడూ చూడను......."

"పేకాట ఆడతావా.......?"

"అందులో ఓనమాలు కూడా తెలియవు......"

"అంటే......నీకు ఒక్క వ్యసనం కూడా లేదన్నమాట...."

"ఎందుకు లేదూ....! తరచూ అబద్ధాలు చెబుతూంటాను...."

335. వెంకట్రామయ్యగారి కారు ఆగిపోయింది. దాన్ని నలుగురు మనుషుల్తో తోయించుకుంటూ ప్రసాద్ మెకానిక్ షెడ్డుకు తీసుకు వెళ్ళాడు. రిపేరింగ్ కోసం అయిదువేలు వసూలుచేసి "రెండ్రోజుల్లో రండి సార్....!" అన్నాడు. రెండ్రోజుల తర్వాత వచ్చారు వెంకట్రామయ్య.



"ఏవయ్యా ప్రసాద్.....! కారు బాగు చేశావా....?" అడిగారు.

"అయింది సార్....! వెనకాల తొయ్యాలి....."

"ఇంకా తొయ్యాలా.....! రిపేరింగ్ కోసం ఐదువేలు వసూ చేశావ్... ఇంక నీవు రిపేరింగ్ చేసిన లాభం ఏమిటయ్యా...?" కోపం అడిగారు వెంకట్రామయ్య.

"భలేవారే సార్...! మీరు కారు తీసుకొచ్చేటపుడు నలుగు తోయాల్సి వచ్చేది. కాని ఇప్పుడు మాత్రం ఇద్దరు తోస్తే చా నడుస్తుంది...." సర్ది చెప్పాడు ప్రసాద్. ❑

336. "ఏమిటి పిన్నిగారూ....! ఈవేళ అంతకోపంగా ఉన్నారు....." సుందరమ్మను అడిగింది నరసమ్మ.

"ఇవాళ సరదాగా ఆర్టీసీ బస్టాండులో బరువుతూగే మిషన్ ఎక్కి రూపాయి కాయిన్ వేస్తే.... ఒకేసారి ఇద్దరు ఎక్కకూడదు అన్న కార్డు వచ్చింది...." కోపంగా అంది. ❑

337. ఎస్.ఐ. సీరియస్‌గా అడిగాడు "ఇక్కడ పుల్లయ్య పెళ్ళాం ఉరిపోసుకొని చనిపోయిందట. ఏడీ ఆ పుల్లయ్య ఎక్కడున్నాడు....?"

"పక్క ఊళ్ళో పెళ్ళి చూపులకెళ్ళాడు సార్.....!" ❑

338. "చూడు లతా.... నిన్నెంతగా ప్రేమించానో తెలుసా....! డబ్బుపోసి పెళ్ళి

చేస్కున్నా..... నీ దాసుడిలా బ్రతికా... ఇంత చేసిన నాకు ఒక్క సహాయం చేయవా....?"

"ఏమిటది.....?"

"విడాకులు...... విడాకులిచ్చి నన్ను సంతోషంగా ఉండనివ్వు లతా....!!"

339. "ఏవండీ.....! బజారుకా...?"

"ఔనే....... బజారుకే....."

"నేనూ వస్తా..... అలా వెళ్తూ వెళ్తూ సినిమా చూసిపోదాం. ఏం...?"

"అలాగే....."

"సిన్మా చూస్తే నాకొకటే కళ్ళు మంటలు. అద్దాలు తీసుకుందాం....."

"సరే....."

"అయ్యో....! సినిమాకెళ్ళడానికి చీరలు లేవు. చీర కూడా తీసుకుందాం...."

"ఊ..... అలాగే......"

"రావడానికి చెప్పులు లేవు. ఇప్పుడెలా.....?"

"నా నెత్తిన ఎక్కిరా...."

"ఎక్కడానికి స్టూలెక్కడ......?"

"ఉరేసుకుందామని లోపలిగదిలో ఉంచాను...."

"ఆ.... వచ్చిన తర్వాత ఉరేసుకుందురులేగాని ముందు బజారుకు పదండి...." ❑

340. "సోడా ముప్పావులా అయితే రూపాయి అంటారేం...?" అన్నాడు కోపంగా లింగరామయ్య.

"సోడాకయితే అదే రేటండి. కాని మీరు సోడాలో గోళీ కూడా మింగేశారు కదండీ! దాంతో కలిపి రూపాయి....." చెప్పాడు సీతారామయ్య.

341. "ముప్పై రెండేళ్ళ సర్వీస్ పూర్తయింది సార్...! ఈవాల్టితో నా పోస్ట్‌మేన్ ఉద్యోగానికి పుల్‌స్టాప్ పెట్టేశా. వస్తా సార్...." బాధగా చెప్పాడు బాస్‌తో.

"అది సరే.... ఇన్నేళ్ళ అనుభవంతో మన డిపార్ట్‌మెంట్ గురించి రెండు మాటలు చెప్పి పోరాదటయ్యా...." అడిగాడు బాస్.

"రిటైర్‌మెంట్ తర్వాత నాకు రావలసిన చెక్‌ని ఎలా పంపినా పర్వాలేదు కాని దయచేసి పోస్ట్ ద్వారా మాత్రం పంపకండి సార్....!' ' విషాదంగా అన్నాడు పోస్ట్‌మేన్. ❑

342. "పక్కింటాయన ఎందుకూ పనికిరాని సన్నాసటండి. పక్కింటావిడ చెప్పింది..." భర్తతో అంది పంకజాక్షి.

"నా మీద నువ్వేమీ చెప్పలేదు కదా....! అనుమానంగా అడిగాడు భర్త.

"మీరెంత అమాయకులండీ....! నేనేమీ చెప్పకపోతే ఆవిడెలా చెబుతుంది...?" నవ్వుతూ నిజం చెప్పేసింది పంకజాక్షి. ❑

343. "హాపీ బర్త్ డే టూ యూ ప్రమీలా టీచర్.....!" అంటూ ఏక కంఠంతో బర్త్‌డే విషెస్ చెప్పారు పాతిక మంది పిల్లలు. టీచర్ చేతికి రెండు పెద్ద



పెద్ద పాకెట్లు అందించారు. టీచర్ ఆనందంగా మొదటి పాకెట్ విప్పింది. అంతే....! ఆమె ముఖం కొవ్వొత్తిలా వెలిగింది. ఎందుకంటే అందులో పెద్ద కేకొకటి ఉంది. రెండవ పేకెట్ విప్పింది. అందులో పాతిక పేపర్ ప్లేట్లు, ఒక చాకు కనిపించాయి. టీచర్ ముఖం మాడిపోయింది. ❑

344. "గీతా! సరదాగా బడటకెళ్ళి ఎంజాయ్ చేసి వద్దామా?" అడిగాడు భర్త.

"అలాగే వెళ్దాం. నేను పక్కింటావిడతో కలసి సినిమాకెళ్తాను. మరి మీరెక్కడికి వెళ్తున్నారు.....?" అడిగింది భార్య. ❑

345. "ఏమ్మా.....! మీ వారు విడాకులు కోరుకుంటున్నారు. మరి నువ్వేమంటావు....?" అడిగాడు జడ్జి.

"నాకేం అక్కర్లేదు. అవేవో వారికే ఇచ్చేయండి...." అంటూ వెళ్ళిపోయిందా ఇల్లాలు. ❑

346. ఆరేళ్ళ టింకూ చేతికి కొన్ని ఉత్తరాలు ఇచ్చి పోస్టు చేసి రమ్మనాడు అరవిందరావు.

పావుగంట తర్వాత ఉత్తరాలు పట్టుకొని వెనక్కి వచ్చేశాడు టింకూ.

"ఏరా టింటూ....! ఉత్తరాలు పోస్టులో వేయకుండా తెచ్చేశావేం...?" అడిగాడు అరవిందరావు.

"మరీ.... నేను ఉత్తరాలు డబ్బాలో వేద్దామనే వెళ్ళాను. కాని ఎవడో దొంగాడు తాళం తీసి ఉత్తరాలన్నీ పట్టుకెళ్ళిపోతున్నాడు. అందుకే ఉత్తరాలు వేయకుండా తెచ్చేశా...." అన్నాడు టింకూ. ❑

347. ఓ హోటల్‌కు నిప్పంటుకుంది. ఫైర్ సర్వీస్ వాళ్ళు వచ్చి మంటలు ఆర్పసాగారు. అప్పుడో-పెద్దమనిషి క్రిందికొచ్చి అక్కడున్న జనంతో "ఇంత పెద్ద అగ్ని ప్రమాదం జరిగినా నేనేమీ కంగారు పడలేదు. తాపీగా లేచి మొహం కడుక్కుని, టై కట్టుకొని, వాచీకి కీ ఇచ్చి చేతికి పెట్టుకుని, తల దువ్వుకొని, సిగరెట్ వెలిగించుకొని వచ్చాను తెలుసా...?" అన్నాడు విజయగర్వంతో.

"అన్నీ బాగానే ఉన్నాయి కాని, వాటితోబాటు బట్టలు కూడా వేసుకుని వస్తే చాలా బాగుండేది....." మర్యాదగా అన్నారెవరో జనంలోంచి. ❑

348. ఇద్దరు పరిచయస్తులు మాట్లాడు కుంటున్నారు.

"మీకేదో ఫ్యాక్టరీ ఉందని గతంలో ఓసారి చెప్పిన గుర్తు. ఇపుడెలా నడుస్తోంది....?"

"ఇదివరకు ఉండేది. మొన్నామధ్య అగ్ని ప్రమాదం జరిగి మొత్తం కాలిపోయింది. మాకు తీరని నష్టం కల్గించింది..."

"అరరె.... నాకు తెలీదే.... ఇంతకూ మీ ఫ్యాక్టరీలో ఏం తయారయ్యేవి?"

"అగ్ని ప్రమాదాల్ని అరికట్టే ఫైర్ ఇంజన్లు....." ❑

49. సర్కస్‌లో ఓ భయంకరమైన అంశం ప్రదర్శింపబడుతోంది ఓ అందమైన అమ్మాయి సింహం చేత మొహమంతా నాకించుకుంది ఆ అంశాన్ని ప్రేక్షకులు ఊపిరి బిగబట్టి చూశారు." మీలో ఎవరైనా ఇలా చేయగలరా....?" ప్రేక్షకుల వంక చూస్తూ ప్రశ్నించాడు ఆ సర్కస్ మేనేజర్.

"ఓ... నేను రెడీ...... అన్నాడో ప్రేక్షకుడు అమ్మాయి ముఖం వైపు ఆశగా చూస్తూ. ❑

350. ఇద్దరు పిసినారులు మాట్లాడుకుంటున్నారు.

"నేను టి.వి. అస్తమానం పెట్టను. వార్తలు ఒక్కటే పెడతాను. కరెంటు ఆదా అవుతుందనీ...."

"నేనైతే వార్తలు ముగించేముందు ముఖ్యాంశాలు మరోసారి అని చెప్పేటపుడు మాత్రమే పెడతాను....." ❑

351. ఆరోజు ఏప్రియల్ ఒకటవ తేదీ. చిట్టిబాబుకి కంటి ఆపరేషన్ పూర్తయింది. కళ్ళకున్న కట్లు విప్పి "ఇపుడు కళ్ళు తెరచి చూడు...." అన్నాడు డాక్టర్. చిట్టిబాబు నెమ్మదిగా కళ్ళు తెరచి గాలిలో చేతులు ఆడించి తడుముకొని "డాక్టర్.....! డాక్టర్....!! నాకు కళ్ళు కనిపించడంలేదు...." అని అరవసాగాడు. అది చూసి డాక్టర్ నవ్వుతూ "ఈ రోజు ఏప్రియల్ ఫస్ట్. నువ్వు ఏప్రియల్ ఫూల్.... ఏప్రియల్ ఫూల్..." అంటూ చంకలు గుద్దుకోసాగాడు. ❑

352. "ఏవోయ్.... ! కొత్తకారు కొని నిన్ను డ్రైవర్‌గా పెట్టాను. అప్పుడే దాని టైరు పంక్చర్ చేశావు. అసలు అదెలా జరిగింది.....?"



" ఒక బ్రాందీ సీసా మీద నుండి కారుని పోనిచ్చాను సార్......!"

"ఆ బ్రాందీ సీసా నీ కంటికి కనపడలేదా.... ?"

"లేదు సార్.....! అది ఓ తాగుబోతు వెధవ ఫాంటు జేబులో ఉంది...."

353. "బాబయ్యా... బాబయ్యా.... గుడ్డివాణ్ణి ఓ రూపాయి ధర్మం చేయండి బాబయ్యా. .!"

"అబద్ధం నీవు గుడ్డివాడివి కాదు. నీకు ఓ కన్నుకనిపిస్తోంది......"

"పోనీ అర్థరూపాయి ఇవ్వండి బాబయ్యా........" ❑

354. శేషారావుగారి అమ్మాయికి పెళ్ళి సంబంధం కోసం కొంతమంది డాక్టర్ అబ్బాయిల ఫోటోలు తెచ్చి చూపించాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"అయ్యా.....! ఈ ఫొటోల్లోని వాళ్ళంతా డాక్టర్లే. వీళ్ళందరూ లక్షకు పైనే కట్నం అడుగుతున్నారు. చూసుకోండి మరి......" అన్నాడు పేరయ్య.

"బాబోయ్....! నేనంత కట్నం ఇచ్చుకోలేను. కాస్త ఛీప్‌గా చూసిపెట్టవయ్యా....."

"అయితే పాతికవేల రూపాయల్లో ఓ నకిలీ డాక్టరున్నాడు. ఆ సంబంధం ఖాయం చేద్దామంటారా....?" అడిగాడు పేరయ్య. ❑

355. "హేమా.....! నిన్ను నేను ఎంత గాఢంగా ప్రేమిస్తున్నాను....."

"అలాగా....! కిషోర్... అయితే నువ్వు తప్పకుండా నా పెళ్ళికి వచ్చి తీరాలి....." ❑

356. ఓ పల్లెటూరివాడు ట్రెయిన్‌లో ప్రయణం చేస్తున్నాడు. అతని పక్కన ఇద్దరు పట్నం అమ్మాయిలున్నారు. వాళ్ళు పల్లెటూరి వాణ్ణి ఏడిపించాలని అందులో ఒకమ్మాయి "నువ్వు అచ్చం స్టుపిడ్‌లా ఉన్నావు," అంది. మరో అమ్మాయి "స్టుపిడ్ మాత్రమే కాదు స్కాండ్రల్‌లా కూడా ఉన్నాడు అంది. వెంటనే పల్లెటూరివాడు "ఏమిటో మీరు పొగిడేస్తున్నారు కాని మీరన్నమాటలకి మీరు సూటయినట్లు నాలాంటివాళ్ళు అసలు సూటవరండి......" అన్నాడు. ❑

357. పులి, జింక కలసి ఒక హోటల్‌కు వెళ్ళాయి.
"నాకో బేల్‌పూరి...." ఆర్డర్ చేసింది జింక.
"మరి మీ పులి స్నేహితుడికో......!" అడిగాడు సర్వర్.
"అతనికి ఆకలిగా లేదు....." చెప్పింది జింక.
"అతనికి ఆకలి లేదని నీకెలా తెలుసు....?"
"ఎలా ఏమిటీ.....?" అతనాకలిగా ఉంటే నేనిక్కడ ఎదురుగా కూర్చొని ఉండేదానినా.....?" ఎదురు ప్రశ్న వేసింది జింక. ❑

358. ఆఫీసులో కొత్తగా జాయిన్ అయిన జూనియర్ క్లర్క్ సీనియర్ క్లర్క్‌ని అడిగాడు.
"ఏమిటి సార్...! మీరు అలా డల్‌గా ఉన్నారు...
"నిన్న ముగ్గురు అమ్మాయిల్ని పెళ్ళి చూపులు చూద్దామని వెళ్ళాను. కాని ఏ ఒక్కరూ కూడా నాకు పిల్లనివ్వడానికి ఇష్టపడలేదు...."
"అయ్యో..... అలాగా....! మరిప్పుడు ఏం చేద్దామనుకుంటున్నారు....?"
"ఇక చేసేదేముంది? ఉన్న ఇద్దరి పెళ్ళాల్తోనే సరిపెట్టుకుందామనుకుంటున్నాను. ❑

359. రాజమ్మ బట్టల షాపు కెళ్ళింది. సేల్స్‌మేన్ చీరలు చూపిస్తున్నాడు. రాజమ్మకు వాటిలో ఓ చీర బాగా నచ్చడంతో అది తీసి" చూడబ్బాయి ఈ చీర చాలా బావుంది. ఎర్రటి, తెల్లటి పూవులు వాటి చుట్టూ లతలు చాలా బావున్నాయి. కాని పైన ఉన్న పచ్చ పువ్వులు మాత్రం బాగోలేదు. చీర అందాన్ని తగ్గిస్తున్నాయి....." అంది సేల్స్‌మేన్‌తో.
"ఫర్వాలేదు తీసుకోండి మేడమ్.... ఎందుకంటే మీరొకసారి చీరను ఉతికారంటే ఆ పూవులు మొత్తం వెలసిపోతాయి...." చెప్పాడు సేల్స్‌మేన్. ❑

360. "రాజూ...! మీకు ఏనుగుతొండం చూస్తే ఏమి గుర్తొస్తుంది....?"
"వినాయకుడు సార్....!"
"మరి వినాయకుడి బొజ్జ చూస్తే.....?"
"మీరే గుర్తొస్తారు సార్....!" ❑

361. గంగరాజుతో అన్నాడు లింగరాజు.



"ఈ రోజు మా యింట్లో ఉన్న అలారం మొట్ట మొదటిసారిగా నన్ను నిద్ర లేపింది...."

"అంత గట్టిగా అలారం కొట్టిందా.....?

"కాదు బల్ల మీద ఉన్న అలారాన్ని పిల్లి తోసేస్తే అదొచ్చి నా తలపై పడింది...." ❑

362: భానోజి ఓ రోజు జూకి వెళ్ళాడు. కోతుల ఎన్‌క్లోజర్ ముందు నిలబడ్డాడు. అయితే ఎన్‌క్లోజర్‌లో ఒక్క కోతి కూడా లేదు. కాసేపు దేభ్యం మొహం పెట్టి చూసి "కోతులన్నీ ఏమయ్యాయ్....?" అన్నాడు భానోజీ జూ కీపర్‌తో.

"సీజన్ కదా అన్నీ శృంగారంలో ఉండి ఉంటాయి..." అన్నాడు జూ కీపరు.

అయినా వదల్లేదు భానోజి. "వేరు శనక్కాయలు, కొబ్బరికాయలు, అరటిపళ్ళు ఇలాంటివి ఏమైనా చూపిస్తే వస్తాయా....?" అన్నాడు అతి తెలివిగా.

జూకీపర్‌కు చిర్రెత్తు కొచ్చింది. "ఇదిగో చూడు...! నువ్వే శృంగారంలో మునిగి తేల్తున్నావనుకో....! ఎవరన్నా వేరుశనక్కాయలు, కొబ్బరికాయలు, అరటిపళ్ళు పెడతాను రమ్మన్నారనుకో..... శృంగారం వదిలేసి వస్తావా...? అన్నాడు మంటగా. ❑

63. "నా మీద కోపం వస్తే మా ఆవిడ ఆ కోపాన్ని బట్టలుతకడంలో చూపిస్తుంది...."

"అదెలా...?"

"కోపం లేకపోతే బట్టలు విప్పాక ఉతుకుతుంది. కోపంగా ఉంటే విప్పకముందే ఉతుకుతుంది......." ❑

364. మధుమూర్తి భార్య యాభై రూపాయలు ఇమ్మని అడిగింది మధుమూర్తిని. యాభై రూపాయలు జాగ్రత్తగా నాలుగైదు సార్లు లెక్కపెట్టి ఇస్తూ అన్నాడు.

"ఎంత డబ్బయినా సరిపోదు...! నీకు డబ్బులు కాదు కావలసింది! నీకు తెలివితేటలు లేవు. అవి కావాలి....!"

"అవుననుకోండి. నాకు కావలసింది తెలివితేటలే....! కాని మీ దగ్గర ఏవుంటే అవే కదా నేను అడగాల్సింది....." అంది భార్య. ❑

365. "అమలాపురం వచ్చినపుడు ఒకే ఒక్క చొక్కాతో వచ్చాను. కాని ఇపుడు నాల్గుగు లక్షలు సంపాదించాను...." అన్నాడు జితేంద్ర.

"బాబోయ్...! నాలుగు లక్షల చొక్కాలే...! అన్ని చొక్కాలేం చేసుకుంటారు సార్...? బట్టలషాపు పెడతారా?" ఆశ్చర్యంగా అడిగాడు ధర్మేంద్ర. ❑

366. ఓ వెంగళ్రావు ట్రెయిన్ ఎక్కాడు. ఎక్కినది మొదలు కంపార్ట్‌మెంట్‌లో అటూ, ఇటూ కాలుకాలిన పిల్లిలా కంగారుగా తిరగసాగాడు.

"ఎందుకండీ...! అలా తిరుగుతారు...? కూర్చోకూడదూ...?" అన్నాడో ప్రయాణీకుడు.

"కూర్చుంటే ఎట్లా? అర్జెంటుగా నిడదవోలు చేరుకోవాలి నేనే..." అన్నాడు వెంగళ్రావు. ❑

367. అమృతమూర్తికి ఓ పాత దీపం దొరికింది. దాన్ని గోకాడు. ఓ భూతం ప్రత్యక్షమైంది.

"నన్ను విడుదల చేశావ్! థాంక్స్....!! నీకు ఒక పాత్ర ఇస్తాను. దాన్నిండా రకరకాల పళ్ళు ఉంటాయి. ఎన్ని తిన్నా తరిగిపోవు. ఇది కాకుండా మరొక కోరిక కూడా కోరుకో! తీరుస్తా.....!" అంది భూతం. అమృత మూర్తి ఓ సారి బుర్రగోక్కుని ఆలోచించి "అయితే అలాంటి పాత్ర ఇంకొకటి కూడా ఇవ్వు..." అన్నాడు ఆశగా. ❑

368. వెంకటేష్ అమ్మాయిల వెంటపడి, వేధించాడు. అతన్ని పోలీసులు అరెస్టు చేశారు. లాకప్‌లో ఉన్న వెంకటేష్ దగ్గరకు అతని లాయరు వచ్చి సలహా ఇచ్చాడు. "చచ్చినా నేరం ఒప్పుకోకు...! నేనేమీ నేరం చెయ్యలేదని కోర్టులో ధైర్యంగా గీత మీద చెయ్యేసి చెప్పు. సరేనా....?" అన్నాడు.



వెంకటేష్‌కు చిర్రెత్తుకొచ్చింది.

"సీత మీద చెయ్యేసినందుకే పోలీసులు పట్టుకున్నారు. ఇంకా గీత మీద కూడా చెయ్యేస్తే ఊర్కుంటారా....!?" అన్నాడు కోపంగా.

369. "స్విమ్మింగ్ పూల్‌లో దూకుతున్న నగేష్‌కి వద్దు అని అడ్డుపడ్డాడు వాచ్‌మేన్.

"ఏం ఎందుకని.....?" అడిగాడు నగేష్.

"అందులో నీళ్ళు లేవండి బాబూ....!"

"ఫర్వాలేదులే! ఎలాగూ నాకు ఈత రాదు లేవయ్యా...." జవాబిచ్చాడు నగేష్. ❑

370. "కరెంటు పోయి గంటయింది. గంటనుండి స్వర్గం చూపించారు. ఇక వదలండి. నాకు ఓపికలేదు.... హా...!" తియ్యగా మూల్గుతూ అంది జయమాలిని.

"అయ్యబాబోయ్....! కరెంట్ పోయాక నీ పక్కకే రాలేదు. ఇక్కడే కుర్చీలో కూర్చొన్నాను....." చీకట్లోంచి అరిచాడు భర్త. ❑

371. "పెళ్ళి ఎప్పుడు చేసుకుంటావు డియర్...! అడిగింది ప్రేమారావుని ప్రేమ.

"ఉద్యోగం రాగానే..."

"మరి ఉద్యోగమెప్పుడొస్తుంది....?"

"ఉద్యోగం ఇప్పించే మామగారు దొరికినప్పుడు....."

372. "బలానికి టానిక్ రాసిచ్చాను. వాడావా?" అడిగాడు డాక్టర్.



"లేదు డాక్టర్...." చెప్పాడు పేషెంట్.

"ఎందుకు వాడలేదు.....?"

"మూత తీయడానిక్కూడా బలం లేక....."

373. "మావాడు ఇదివరకు ఏం చెబితే అది చేసేవాడు. కాని ఇపుడసలు మాట వినడం లేదు...?"

"అలాగా...! ఏమైందంటావ్ మీ వాడికి...."

"మొన్న పదోతారీఖున పెళ్ళయిందిలే...." 

374. గంగారావు బస్‌లో సిగరెట్ కాలుస్తున్నాడు. కండక్టర్ కోపంగా వెళ్ళి సిగరెట్ ఆర్పిం చేశాడు . "ఎందుకు సార్...! సిగరెట్ ఆర్పించేశారు...?" అడిగాడు గంగారావు.

"నువ్వు సిగరెట్ కాల్చాలంటే బస్‌లో ప్రయాణీకుల అందరి అనుమతీ తీసుకోవాలి."

"కాని బస్‌లో ఇపుడు ఎవరూ లేరుగా..."

"అయితే ఎవరో ఒకరు ఎక్కేవరకూ ఆగవయ్యా...." చెప్పాడు కండక్టర్.

375. రాజోలులో సర్కస్ నడుస్తోంది. సర్కస్ చూడ్డానికి పక్కనున్న పల్లెటూరి నుండి రామయ్య వచ్చాడు. కౌంటర్‌కెళ్ళి " ఓ టిక్కెట్టు ఇవ్వండి....." అని ఓ ఇరవై రూపాయల నోటు ఇచ్చాడు. బుకింగ్ క్లర్క్ టిక్కెట్టు, ఓ కొత్త పది రూపాయల నోటు తిరిగిచ్చాడు. ఆ నోటు చెల్లుతుందో లేదోనని బెంగపట్టుకుంది రామయ్యకి. పెద్దమనిషిలా కనిపిస్తున్న ఓ వ్యక్తి దగ్గరకెళ్ళి "సార్..... ఈ నోటు చెల్లుతుందా....?" అనడిగాడు.

ఆయన దాన్ని అటూ, ఇటూ తిప్పి చూసి "చెల్లుతుంది" అని జేబులో వేస్కున్నాడు.

"నా నోటు మీరు జేబులో వేస్కున్నారేమిటి.. ?" ఆశ్చర్యంగా అడిగాడు రాయ్యా.

"నేను లాయర్ని. ఇది నా ఫీజు..." అని చెప్పి దర్జాగా వెళ్ళిపోయాడాయన. ❑

376. "ఏరా మోహన్...! ప్రస్తుతం ఏం చేస్తున్నావ్....?"

"గ్రీటింగ్స్ కార్నర్ పెట్టానురా రవీ...."

"ఎవరి సహకారంతో పెట్టావ్....?"

"ఇంకెవరు....? అమలాపురం హెడ్ పోస్టాఫీస్‌లో పోస్ట్‌మాన్‌గా జాబ్ చేస్తున్న మా నాన్నగారి సహకారంతోనే...." ❑

377. ఆఫీసుకు ఆలస్యంగా వచ్చిన వినాయకరావుని అడిగాడు కొలీగ్.



"ఏమిటీ....! ఈ వేళ ఇంత ఆలస్యం.....?"

"ఓ చోట ఇద్దరు దుడ్డుకర్రల్తో కొట్టుకుంటూంటే వాళ్ళను విడగొట్టి వచ్చేసరికి ఆలస్యమైంది...."

"అలాగా.....! ఇంతకూ నువ్వేం చేశావ్.....?"

"నేనూ ఓ దుడ్డుకర్ర తీస్కుని అందులో ఒకడికి సపోర్టు వెళ్ళాను. అంతే....! రెండోవాడు భయపడి పారిపోయాడు" చెప్పాడు వినాయకరావు. ❑

378. "ఈ డాక్టర్లు, శాస్త్రజ్ఞులు పదే పదే సిగరెట్లు త్రాగడం మంచిది కాదని పుస్తకాల ద్వారా హెచ్చరించడంతో కొనడం మానేసాను వాటిని....." అన్నాడు విష్ణు.

"ఏమిటీ....? సిగరెట్లా ......." అడిగాడు కృష్ణ.

"కాదు..... పుస్తకాలు....." చెప్పాడు విష్ణు. ❑

379. "అదేమిత్రా నీ గూబ అలా వాచింది....?" ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్.

"పార్క్‌లో ఓ అమ్మాయిని పొరబాటున ఢీ కొట్టాను. ఆమెను చూసి సారీ.....! చెల్లాయ్...! అన్నాను. అంతే....! వెంటనే 'వేస్ట్ ఫెలో' అని తిట్టి గూబ గుయ్ మనిపించింది....." బాధగా చెప్పాడు వినోద్.

380. "సార్...! మీరన్నట్టుగానే మన 'శీలవతి' సినిమాలో హీరోగారు పాత్రలో జీవిస్తున్నారండి...." డైరెక్టర్‌తో ప్రొడ్యూసరు.

"మన హీరోనట సింహం అంటే ఏమిటనుకున్నారు? ఔను మీరెలా తెలుసుకోగలిగారు....?" అడిగాడు డైరెక్టర్.

"ఇపుడు మన హీరోయిన్‌కి మూడోనెల....." చెప్పాడు ప్రొడ్యూసరు. ❑

381. "ఈ హత్య నీవు చేశావా?" అడిగాడు జడ్జి.

"చేయలేదు సార్...! చెప్పాడు ముద్దాయి.

"అంత ఖచ్చితంగా కోర్టుకొచ్చికూడా ఎలా బెబుతున్నావ్...?"

"ఎందుకంటే హత్య చేస్తుండగా నన్నెవరూ చూడలేదు కాబట్టి..." తాపీగా చెప్పాడు ముద్దాయి. ❑

382. రామ్‌లాల్‌కు స్థిరాస్థులు ఏమీలేక పోయినా డబ్బు మాత్రం లక్ష కొద్దీ సంపాదించాడు. ఓ సారి ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ "మీ కున్న స్థిరాస్థి ఏమిటో చెప్పండి....." అనడిగాడు.

"పోయిన సంక్రాంతి నుండి మా యింట్లో తిష్టవేసిన మా అల్లుడు..." చెప్పాడు రాంలాల్. ❑

383. ఎదుటి వాళ్ళలో సానుభూతి పుట్టించి వాళ్ళచేత ముష్టి వేయించుకోవాలని ఓ ప్లాన్ వేసాడు యాదయ్య. కొంత గడ్డి తీస్కుని ఓ యింటి ముందు నిలబడి గడ్డి తింటున్నట్లు నటిస్తూ "అమ్మా.....! ధర్మం తల్లీ...!" అన్నాడు.

అది చూసిన ఇంటావిడ

"ఏమిటి గడ్డి తింటున్నావ....?" అంది ఆశ్చర్యంగా.

"ఏం చేయను....? ఆకలి బాధకు తాళలేక తల్లీ...! అన్నాడు యాదయ్య దీనంగా.

"అయితే అలా దొడ్డివైపుకిరా..... అక్కడ చాలా ఏపుగా పెరిగిన గడ్డి ఉంది....." అంటూ చెప్పింది ఇంటావిడ. ❑

384. "డాక్టర్...! రోజూ నిద్రలేవగానే అరగంట సేపు కడుపునొప్పిగా ఉంటోంది సార్...."

"దానికి నా దగ్గరకు హడావుడిగా రావడమెందుకయ్యా.... ఓ అరగంట ఆలస్యంగా నిద్రలేస్తే సరి...." ❑

385. కోర్టులో కేసు విచారణ జరుగుతోంది.

"ఇతరుల జేబులు ఎన్నో కత్తిరిస్తున్నావు. అలా కత్తిరించేటపుడు ఎప్పుడూ నీకు సిగ్గనిపించదా....?" అడిగాడు జడ్జిగారు.

"అనిపిస్తుందండీ...! వాటిల్లో ఒక్క పైసా కూడా లేనపుడు....." చెప్పాడు దొంగ. ❑

386. మన బాస్‌ని మళ్ళీ ఓసారి ఎడాపెడా వాయించేయాలనుకుంటున్నాను.." కసిగా అన్నాడు సూరిబాబు.

"అదేమిటి .....? మళ్ళీ అంటున్నావ్....! ఇదివరకోసారి వాయించావా....?" ఆశ్చర్యంగా అడిగాడు సత్తిబాబు.

"ఆ..... ఇదివరకోసారి ఇలాగే అనుకున్నాను....." అన్నాడు సూరిబాబు పిడికిలి బిగిస్తూ. ❑

387. "ఏమిటోనండి. మీ మగాళ్ళు ఏ విషయమైనా ఈ చెవితో విని ఆ చెవితో వదిలేస్తారు..." అంది కవిత భర్తను వేళాకోలంగా కవ్విస్తూ.



"ఇంకానయం. అదే మీ ఆడాళ్ళయితే మాత్రం రెండు చెవులతో విని నోటితో వదిలేస్తారు." చురక అంటించాడు భర్త. ❑

388. "ఈవేళ చాలా హుషారుగా కన్పిస్తున్నావ్.... ఏమిటీ విశేషం....?" అడిగాడు సుబ్బరాజు.

"మా ఆవిడ వారం రోజులు పుట్టింటికెళ్ళిందిలే. అందుకు ..." చెప్పాడు అప్పల్రాజు.

"అయితే పాపం...! ఈ వారం రోజులూ నీకు వంటకు ఇబ్బందేనన్న మాట..."

"ఏడ్చినట్టుంది. అసలు ఆ ఇబ్బంది తప్పినందుకేగా ఈ ఆనందం....' ' అన్నాడు అప్పల్రాజు. ❑

389. "నిన్న మా పాప పావలా నాణెం మింగేసిందే..."

"అలాగా ..... డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళావా....?"

"ఆ ..... తీసుకెళ్ళా.... ఆయనో వందనోటు మింగేశాడు...." ❑

390. "సుబ్బారావ్‌గారూ...! రాత్రిళ్ళు మీరు కాస్త కిటికీ తలుపులు మూసుకోండి. రాత్రి మీరూ మీ భార్యా అబ్బ...! చూడలేక చచ్చాననుకోండి...!"

"మీరు భలేవారే....నేనసలు రాత్రి ఊళ్ళోనే లేను...." ❑

391. "రఘురాం.... నీ కాశ్మీర్ ట్రిప్పు కాన్సిల్ చేసుకున్నావటగా....?

"లేదోయ్.... కాశ్మీరు ట్రిప్పు క్రిందటి సంవత్సరం కాన్సిల్ చేసుకున్నాను. ఈ సంవత్సరం ఊటీ ట్రిప్పు కాన్సిల్ చేసుకున్నాను. కాస్త మార్పుండాలిగా...!" ❑

392. "సార్...! సార్...!! మీ స్కూటర్‌ను లారీ గుద్దేసింది..... "ఆదుర్దాగా చెప్పాడు స్టూడెంట్.

"అలాగా ...! మరి నేను దానిమీదున్నానా...? అడిగాడు మతిమరుపు ప్రొఫెసర్. ❑

393. ఒక రాజకీయ నాయకుడు తన కొడుకును పబ్లిక్ స్కూల్లో చేర్పించడానికి స్కూలుకు తీసుకెళ్ళాడు. ప్రిన్సిపాల్ కచ్చితమైన వ్యక్తి. ఆయన చిన్న పరీక్ష పెట్టాడు.

"బాబూ....! రెండు రెళ్ళు ఎంత....?"

"నాలుగు" ఠక్కున జవాబు చెప్పాడు కుర్రాడు.

ఇంతలో రాజకీయనాయకుడు "చిన్నవాడు తొందరలో పొరపాటు చెప్తుంటాడు. మరో అవకాశం ఇవ్వండి ప్రిన్స్‌పాల్ గారూ...!" అన్నాడు.

394. జోగినాథం ఏ పనీ చేయకుండా సోమరిపోతులా తయారయ్యాడు.

ఓ రోజు భార్య కోపంగా "ఏవండీ...! మీరు ఏ సంపాదనా లేకుండా మా నాన్న నుండి ఇంటి అద్దె, మా అక్క నుండి బట్టలూ, మా చిన్నాన్న నుండి ఇంటి ఖర్చులూ, మా అన్నయ్య నుండి ఇంట్లోకి సరుకులూ తీసుకుంటూ బతకడానికి నాకు చాలా సిగ్గుగా ఉందండీ...! మీరు ఏదైనా ఉద్యోగం చేసి సంపాదించకూడదూ...!" అంది.

"మనకు సిగ్గెందుకోయ్...? ఇంతమంది ఇలా ఇస్తున్నా, ఏమీ ఇవ్వలేకపోతున్న మీ మేనమామలు సిగ్గుపడాలి కాని..." అన్నాడు జోగినాథం. ❑

395. "రామూ...! ఒకచోట పెద్ద చెరువు తవ్వుతున్నారు. అందుకు నలుగురు మగాళ్ళు పని చేస్తున్నారు. వాళ్ళు నలుగురు పనిచేస్తే చెరువు ముప్పై రోజుల్లో పూర్తవుతుంది. అదే చెరువును నలుగురు మగాళ్ళు, నలుగురు ఆడాళ్ళు కలిసి పనిచేస్తే ఎన్ని రోజుల్లో పూర్తి చేస్తారు....?" అడిగారు మాస్టారు.

"చెరువు పని అలాగే ఉండిపోతుందండీ....! అసలు పూర్తికాదు..."

"ఎందుకని?" అడిగారు మాస్టారు కోపంగా.

"ఆడాళ్లూ, మగాళ్ళూ కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారండి..." చెప్పాడు రాము. ❑

397. "సినీతారను పెళ్ళి చేస్కున్నారు...? ఎలా ఉందండీ మీ జీవితం...?" ఓ పెద్ద బిజినెస్ మాగ్నెట్‌ను అడిగాడు ఓ పరిచయస్తుడు.

" ఏం జీవితమో ఏం పాడోనండీ...!



పార్క్‌కు వెళితే ఎత్తుకుని మాంచి డ్యూయెట్ పాడమంటుంది. ఎవరైనా చెల్లెమ్మా అంటే అమాంతంగా వెళ్ళి అతణ్ణి కౌగిలించేసు కుంటుంది..." నిట్టూరుస్తూ చెప్పాడు బిజినెస్ మాగ్నెట్. ❑

396. "తాతయ్యా...! మీ డబ్బు భగవద్గీతలో దాస్తారు కదా. ఎవరైనా తీసేయరూ...?"

"లేదు బాబూ, అక్కడే భద్రం. భగవద్గీత చూస్తూ బుద్ధి ఉన్నవాడు దొంగతనం చేయడు. దొంగతనం చేసే బుద్ధి ఉన్నాడు భగవద్గీత ముట్టుకోడు...." ❑

397. "ఏమిట్రా రామం? నువ్వు నీ భార్య బట్టలు ఉతుకుతున్నావట. సిగ్గులేదూ....?" అన్నాడు బ్రహ్మం.

"ఇందులో తప్పేముంది? నేను రొట్టెలు చేసేటపుడు, వంట చేసేటపుడు పాపం నా భార్య కూడా నాకు సహాయం చేస్తుంది మరి...." అన్నాడు రామం. ❑

98. ఒక వ్యక్తి హోటల్ లోనికి వెళ్తూ తన రెయిన్ కోటు బయట తగిలించాడు. దాని మీద ఒక చీటీ అంటించాడు. దాని మీద ఇలా వ్రాసి ఉంది. "ఈ కోటు ఎవరూ తీయవద్దు. నేను బాక్సింగ్‌లో ఛాంపియన్..." కాసేపటి తర్వాత బయటికి వచ్చి చూస్తే అక్కడ కోటు లేదు. దాని స్థానంలో మరో చిన్న చీటీ ఉంది. దాని మీద ఇలా వ్రాసి ఉంది. "మీ కోటు కోసం నా వెంటపడి రావద్దు. నేను రన్నింగ్‌లో ఛాంపియన్...." ❑

39. "నేను మతిపరపు వాడినని అస్తమానం అంటుంటావు కదా...! ఈ రోజు చూడు అన్నీ సరిగా పెట్టుకుని, ఏదీ మర్చిపోకుండా వెళ్తున్నాడు...." అన్నాడు మతిమరపు ప్రొఫెసర్.

"అయ్యో కర్మ...! ఈ రోజు ఆదివారమండి..." మొత్తుకుంది భార్య.

400. "రామూ! పదోతరగతి పరీక్షలైపోయాయి. ఇపుడేం చేస్తున్నావ్...?"
"అక్టోబరుకు ప్రిపేరవుతున్నా...." ❑

401. "అరరె...! ఈ విషయం మీతో ఎలా చెప్పాలో అర్థంకావడం లేదు..." అన్నాడు జ్యోతిష్కుడు.
"ఫర్వాలేదు... చెప్పవయ్యా...!" అన్నాడు రంగారావు. ❑

402. గజదొంగ గంగుల్ని అడిగాడు సింగన్న.

"మొన్న మనవాళ్ళు పెట్టిన దొంగతనం పోటీల్లో నీకు మొదటి బహుమతి వచ్చిందట కదా...: ఇంతకూ ఏం కొట్టేశావ్...?
"గెలిచిన వాళ్ళకు ఇద్దామనుకున్న బహుమతులు కొట్టేశాను..." చెప్పాడు గంగులు. ❑

403. ఒక వ్యాపారస్తుడు తన స్నేహితుడితో చెబుతున్నాడు.
"ఇంటిని దొంతనాల నుంచి, అగ్ని ప్రమాదాల నుంచి రక్షించుకోవడానికి భీమాచేశాను."
"అయితే వరదల నుండి రక్షణ కోనం కూడా భీమా చేయలేకపోయావా?'
"అలాగే చేయిస్తాను కాని వదలు వచ్చేటట్టు చేయడానికి ఏదైనా ఉపాయముంటే చెప్పు." ❑

404. మహాశివరాత్రి పర్వదినాన అంతర్వేది నరసింహస్వామి ఉత్సవాలు అద్భుతంగా జరుగుతున్నాయి. గుడికి కాస్త దూరంలో అమలాపురం నుండి వెళ్ళిన నలుగురు వేద పండితులు కబుర్లు చెప్పుకుంటూ జాగారం చేస్తున్నారు.
"మనలో మనం కనుక దాపరికాలుండ కూడదు. పైగా ఈ వయస్సులో

అందరూ మన వాళ్ళే కనుక చెప్పేస్తున్నాను రాత్రి నాలుగు పంచపాత్రల సారాయి సేవిస్తే కాని నిద్ర పట్టడం లేదు..." అన్నాడొక వేద పండితుడు.

"ఆప్తులు కనుక చెబుతున్నాను పది హేను రోజుల నుండి ఒక రజక స్త్రీతో సంపర్కం పెట్టుకున్నానండీ...!" అన్నాడు రెండో పండితుడు.

"మీరంతా మనసు విప్పి మాట్లాడాక నేనెందుకు ఆపాలి. రోజు గుడి వెనకాల కూర్చోని పేకాడితేగాని ఏమీ తోచడం లేదు..." అన్నాడు మూడో పండితుడు.

నాలుగో పండితుడు "నాకూ ఓ దురలవాలు లేకపోలేదు..." అన్నాడు.

"చెప్పండీ...! ఈ విషయాల్లో ఏ ఒక్కటీ కూడ మనల్ని దాటి బయటకు పోవు. త్వరగా చెప్పండీ..!" అన్నారు ముగ్గురూ.

"నానోట్లో నువ్వుగింజ కూడా దాగదండీ....! విన్న ప్రతి విషయాన్ని నలుగురిలోనూ చెప్పేస్తాను....." అంటూ ముగించాడు నాలుగో పండితుడు. ❑

405. అప్పుడే కాలేజి నుండి వచ్చిన రవీంద్ర తండ్రితో అన్నాడు.

"డాడీ...! ఈ వేళ మా కాలేజికి కొత్త లెక్చరర్ వచ్చారు."

"అలాగా, ఆయన పేరేంటి..?"

" ఇంకా ఆయనకేమీ పేరు పెట్టలేదు డాడీ....!" ❑

406. "నేను నా కారులో ఓ కొత్త మిషను అమర్చానోయ్...! మన ప్రక్క నుడి వెళ్ళే వాహనం ఎంత స్పీడులో వెళ్తుందో చెప్పేస్తుంది... మిత్రుడితో అన్నాడు గుణశేఖర్. ఆ మిత్రుడు తాపీగా అన్నాడు" అదేం గొప్ప....? మా ఆవిడను కారులో పక్కన కూర్చోబెట్టుకుంటే మన పక్కనుండి వెళ్లే వాహనంలో కూర్చొన్న ఆడవాళ్ళు ధరించిన బట్టల రంగు, డిజైన్లు, రేట్లు కూడా చెప్పగలదు..." ❑

407. "అమ్మా...! అన్నయ్య నా చెవి కొరికాడు....." ఏడుస్తు చెప్పింది రెండేళ్ళ దివ్య.

"అంతా వట్టిదే...! చెల్లాయి అబద్ధ మాడుతుంది నేనసలు కొరకలేదు. దాని చెవి అదే కొరుక్కుని ఏడుస్తుందమ్మా.... చెప్పాడు ఐదేళ్ళ జానిగాడు. ❑

408. పార్కులో కూర్చొని మాట్లాడుకుంటున్నారు రాధ, కృష్ణ
"రాధ.....! అస్తమానం ఈ పార్కులో ఏం కూర్చుంటాం. సరదాగా మంచి సినిమాకి వెళ్దాం....." అన్నాడు కృష్ణ.
"అబ్బ...! ఆశ.... అవన్నీ పెళ్ళయ్యాకే...." అంది రాధ.
"కానీ... పెళ్ళయ్యాక నాతోసిన్మాకి పంపడానికి మీ ఆయన ఒప్పుకోడేమో రాధా...!"
అన్నాడు కృష్ణ. ❑

409. "అదేమిటే...! మీ ఆయన నెలరోజుల నుండి కనిపించడం లేదంటున్నావు. మరి పోలీస్ కంప్లైట్ ఎందుకివ్వలేదు....?" అంది అమల.
"పోయినసారి అలాగే ఇస్తే వెదికి, వెదికి తీసుకొచ్చేశారు. అందుకే ఇవ్వలేదు.." చెప్పింది విమల. ❑

410. "పది రూపాయలకి ఈ చక్కెరకేళీ అరటి పళ్ళు ఎన్ని...?
"డజను ఇస్తాను. తీసుకోండి సార్..."
"ఐదు డజన్లు తీసుకుంటే ఏమైనా తగ్గుతుందా.....?"
"ఐదు పళ్లు తగ్గుతాయి సార్.....!" ❑

411. "ఈక్లాత్ పదిమీటర్లు ఎంత కిస్తావ్...?
"మూడు వందలయాభై సార్...!"
"కాస్త తగ్గించవయ్యా...."
"ఎన్ని మీటర్లు తగ్గించమంటారు సార్.....?" ❑

412. "డాక్టర్...! నాకు ఎవరైనా తినడానికి పెడితే కాదనకుండా తినేస్తాను.. దాని వల్ల విపరీతమైన లావెక్కాను. ఈ లావు తగ్గించాలి డాక్టర్...." అంది ఓ లావుపాటావిడ.



"అలాగే తగిస్తాను. కాకపోతే మీరొక ఎక్సర్ సైజ్ చేయాలి....'
' అన్నాడు డాక్టర్.

"ఎలాంటి కష్టమైనా భరిస్తాను. ఏ ఎక్సర్ సైజైనా చెస్తాను. చెప్పండి డాక్టర్."

"అబ్బే....! అదేమీ కష్టం కాదు. చిన్న ఎక్సర్‌సైజ్. మీకు తినడానికి ఎవరైనా ఏదైనా పెట్టేటపుడు మీతల కుడి నుండి ఎడమకి, ఎడమనుండి కుడికి రెండు లేదా మూడు సార్లు తిప్పండి. ఇలాచేస్తే కొద్ది రోజుల్లో మీ బరువు తగ్గుతారు..." అన్నాడు డాక్టర్. ❏

13. బార్‌లో ఓ మందు ప్రియుడు" భార్యగొప్పదా? బ్రాందీ గొప్పదా.?" అని అడిగాడు రెండో మందు ప్రియుడ్ని.

"బ్రాందీ గొప్పది......"

"అదెలా...?"

"బ్రాందీ తలలోకి మాత్రమే ఎక్కుతుంది. భార్యలా తలపై కెక్కదు..." అన్నాడు రెండో మందు ప్రియుడు. ❏

14. "నాన్నా....! నాన్నా....! అమ్మకు కళ్ళు తిరుగుతున్నాయట. అర్జెంటుగా లింగరాజ ‌ గారి హాస్పిటల్‌కు తీసుకెళ్లమంటోంది....." అన్నాడు కొడుకు
"వద్దుర ఒ ‌ బ్బా...! కాసేపు కళ్ళుమూసుకొని పడుకోమను. అయనిచ్చే బిల్లు చు ‌ ‌ ‌ ‌ నందరికీ కూడా కళ్ళు తిరుగుతాయి......" ❏

15. "నా మొ ‌ ‌ భ ర్య చాలా ఉత్తమురాలు...." అన్నాడు గోపాలం.

"నీ మొ ‌ ‌ ని భార్య ఉత్తమురాలైతే, మరి రెండో పెళ్లెందుకు చేసుకున్నావ్..?" అనడిగాడు భూపాలం.

"రెండో వివాహం చేసుకున్న తర్వాతే తొలి భార్య ఉత్తమురాలన్న విషయం తెలిసింది...." చెప్పాడు గోపాలం. ❏

416. "మా ఆవిడతో చాలా తలపోటుగా ఉందిరా.. నన్ను ప్రత్యక్ష దైవంగా రోజూ పూజిస్తానంటోంది..." చెప్పాడు ఉమారావు.

"అందుకు సంతోషించాలి కానీ, తలపోటు అంటావేం....?" అడిగాడు ఆశ్చర్యంగా చిన్నారావు.

"మరే....! ఆ దేవుడ్ని కోరినట్లు పట్టుచీరలు, నగలు లాంటి వరాల్ని రోజూ కోరుతోంది...." అన్నాడు ఉమారావు. ❑

417. "బాబి, యోగి ఓ చోట కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"టి.విల వల్ల విజ్ఞానం, వినోదం లభిస్తాయని కొందరు అంటూంటే, హింసాప్రవృత్తి పెరిగిపోతుందని మరికొందరు అంటున్నారు. కాని నాకైతే హింసా ప్రవృత్తి పెరగడంలోనే ఎక్కువ నిజం ఉందనిపిస్తోంది......?" అన్నాడు బాబి.

"ఎందుకు? " అడిగాడు యోగి.

"ఎందుకేమిటి...? విజ్ఞానం కోసం నేను వెళ్ళి టి.వి.అన్‌చేస్తాను. అంతలో మానాన్న వచ్చి టి.వి. ఆప్‌చేసి నన్ను చితక్కొట్టి చాలా హింసకు గురిచేస్తాడు...." చెప్పాడు బాబి.

418. భార్యా, భర్తలు చీరల విషయంలో పోట్లాడుకుంటున్నారు.

"అంటే.... నీకు నాకన్నా ఆ చీరలంటేనే ఇష్టమా?...?" కోపంగా అడిగాడు భర్త.

"అవును. నాకు చీరలంటేనే ఇష్టం. వాటినైతే ఎప్పుడంటే అప్పుడు మార్చుకోవచ్చు. మిమ్మల్నైతే అలా కుదరుతుందా....! చెప్పండి..." అంది భార్య. ❑

419. "అర్ధరాత్రి వీధిలో తిరుగుతున్నావ్. నిన్ను చూస్తే నాకు చాలా అనుమానంగా ఉంది. సంజాయిషీ ఇచ్చుకోగలవా?" అడిగాడు గస్తీ తిరుగుతున్న కానిస్టేబుల్ ఓ వ్యక్తిని.

"సంజాయిజీ ఇచ్చుకోగలిగితే ఇంటికెళ్ళి మా ఆవిడకే ఇచ్చుకుందును ఇలా రోడ్డు మీద తిరగాల్సిన కర్మ నాకేంటి...?" నసిగాడా వ్యక్తి. ❑

420. రచయిత ఒక కథ వ్రాసి ఎడిటర్‌కి చూపించాడు. ఎడిటర్ కథ చదివి "బార్యా భర్తలు సంభాసించు కుంటున్నారని వ్రాసావు. ఇక్కడ ఆ సంభాషణ వ్రాయలేదు ఏవయ్యా....!?" అని అడిగాడు.
"అప్పుడు అక్కడ జోరుగా గాలి వీస్తోందని రశాను కదా! ఆ హోరుగాలికి వారి సంభాషణ వినపడడం లేదన్నమాట....." చెప్పాడు రచయిత.

421. "నేను పెట్రోలు లేకుండా నడిచే కారు కొన్నానోయ్...!"
"నిజంగానా...! ఏదీ ఒసారి చూపించు చూస్తాను...."
" అదిగో ....! మా బుజ్జిగాడు ఆడుకుంటున్నాడు. చూడు అదే..!"





422. ఇంతవరకూ నేను పన్నెండు కథలు వ్రాసి వివిధ పత్రికలకు పంపించాను. అన్నీ వచ్చాయి. ఇంకా ఒక్కటి మాత్రం రావాలి...." అన్నాడు రచయిత రామలింగం.
"ఎందులో రావాలి....?" అడిగాడు మిత్రుడు.
"తిరుగు టపాలో...." చెప్పాడు రామలింగం.



423. "సార్... !ధర్మ చేయండి సార్....!"
"పోవయ్యా. ... అడుక్కోడానికి సిగ్గులేదూ....!?
"అలా తీసిపారేయకండి సార్...... నేనొక రచయితని డబ్బు సంపాదించడానికి వెయ్యి మార్గాలు అనే పుస్తకం రాసింది నేనే...."
"నిజమా...! మరి అడుక్కుంటున్నావెందుకు....?"
"ఆ వెయ్యి మార్గాల్లో ఇదొకటి సార్.......!"



424. చిట్టిబాబు ఓ హోటల్‌కెళ్ళి టీ ఆర్డర్ చేశాడు. సర్వర్ టీ తెచ్చిపెట్టాడు. చిట్టిబాబు టీ కొద్దిగా త్రాగి కోపంగా "ఛి.....ఛీ... ఇదసలు టీయేనా? పరమ ఛండాలంగా గాడిదమూత్రంలా ఉంది....." అన్నాడు.

"సార్.... అరుచి మీకెలా తెలుసుసార్...?" వినయంగా అడిగాడు సర్వర్. ❑

425. "నాన్నా.... ! ఎదురింటబ్బాయి నాకు కన్నుకొడుతున్నాడు....." అంది కూతురు.
"వాడెప్పుడూ అంతే నమ్మా... ఏదో ఒకటి తీసుకొని ఎవరో ఒకర్ని కొడుతూనే ఉంటాడు. ఈ సారి నువ్వు కూడా కొట్టేయ్....." పరధ్యానంగా అన్నాడు తండ్రి. ❑

426. జైల్లో ఇద్దరు ఖైదీలు మాట్లాడుకుంటూన్నారు.
"నిన్నెందుకు అరెస్టు చేశారు.....?"
"చిన్న దొంగతనం చేశానులే. మరి నిన్నూ....?
"నేనైతే ఆగస్టు పదిహేను అంటే పబ్లిక్ హాలిడే రోజు షాపు ఓపెన్ చేశాను. అందుకని...."
"షాపు ఓపెన్ చేసుకుంటే జరిమానా వెయ్యాక ఎందుకు అరెస్టు చేశారు....?"
"నేను ఓపెన్ చేసింది మా ప్రక్కవాడి షాపు....." ❑

427. "ఏమిటి రామయ్యా....! దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్...?"
"పెళ్లయ్యాక కూడా నాకొడుకు ఇంకా 'ర'ను ల అనే ఎందుకు పలుకుతున్నాడా! అని...."
"ఇందులో ఆలోచించడానికేముంది....? వాడికి కాస్త నత్తిగా భావించి సరిపెట్టుకుంటే సరి....."
"నీవు చెప్పినట్టు అలాగే సరిపెట్టుకొనే వాడిని కానీ. నా కోడలు పేరు రంజని....." ❑

428. "డాక్టర్...! నాకు విపరీతమైన రొంప గా ఉంది...."
"నాకు తెలుసు లేవయ్యా...!"
"మీకెలా తెలుసు డాక్టర్.....!
"నీ ముక్కు కింద ఈగల తుట్ట ఉంది...." ❑

429. వెంగళప్ప కొన్ని సరుకులు కొనడానికి పట్నం వెళ్ళి, అన్నీ కొనుక్కొని మూట కట్టి నెత్తి మీద పెట్టుకొని మళ్ళీ వాళ్ళ ఊరు బయలు దేరాడు. కొంత దూరం వెళ్లే సరికి ఓ ఎడ్లబండి వాడు వచ్చి అతని పక్క ఆగి "నేను ఇటే వెళ్తున్నాను. వచ్చి బండెక్కు. తీసుకు వెళ్తాను....." అన్నాడు. వెంగళప్ప బండెక్కి కూర్చొన్నాడు. బండి కదిలింది. కొంతదూరం వెళ్ళాక వెనక్కి తిరిగి చూసిన బండివాడు ఆశ్చర్యంగా వెంగళప్పను "ఏమిటయ్యా...ఔ బండిలో కూర్చొన్నాక కూడ ఆ సరుకు మూట నెత్తి మీద పెట్టుకొని కూర్చున్నావ్...?" అన్నాడు.

"అబ్బే...! ఏమీ లేదండీ...! నేనే మీ బండికి బరువు. మళ్లీ మూటకూడా పెట్టి మీకు బరువు పెంచడమెందుకని నెత్తిమీదే పెట్టుకున్నాను...." అన్నాడు వెంగళప్ప. ❑

430. ఆఫీసులో కొత్తగా జాయిన్ అయిన టైపిస్ట్ అరుణతో అన్నాడు రావు. "అరుణా....! నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. నువ్వు అంగీకరిస్తే పెళ్ళి కూడా చేసుకోవాలనుకుంటున్నాను..."

"అయితే ఆ విషయం మా యింటికొచ్చి మాట్లాడండి...." అంది అరుణ.

"ఎవరితో .....! మీ నాన్నగారితోనా....? మీ అన్నయతోనా....?" ఉత్సాహంగా అడిగాడు రావు.

"కాదు మా ఆయనతో..... " చెప్పింది అరుణ. ❑

431. "నాన్నా..! నాన్నా...! ఎదురింటి అమ్మాయి ఎర్రగా ఉంటుంది. పొడుగ్గా ఉంటుంది. భలే అందంగా ఉంటుంది. ఎంచక్కా మాట్లాడుతుంది...." చెప్పాడు కొడుకు.



"ఔను....! ఇవన్నీ ఎందుకు చెబుతున్నావ్...?" ఆరా తీస్తూ అడిగాడు తండ్రి.

"ఆ అమ్మాయినే నేను పెళ్ళి చేసుకుంటాను నాన్నా....!"

"నోర్మూయ్....! వెధవా...! నీకు ఇప్పుడే పెళ్లి మాటలేమిట్రా? అయినా నీకు పదేళ్ళు. ఎదురింటమ్మాయికి ఇరవైయేళ్ళు తెలుసా?" కోపంగా అన్నాడు తండ్రి.

"సరే..నాన్నా..! పదేళ్ళు ఆగితే ఆ అమ్మాయిలాగే నాకూ ఇరవై యేళ్లు వస్తాయిగా.... అప్పుడు పెళ్లి చేసుకుంటాలే...." చెప్పాడు కొడుకు.

432. "డాడీ...! నేను రాత్రి ఒంటిగంటవరకూ నా రూంలో కూర్చొని చాలా శ్రద్ధగా చదువుకున్నాను.."

"ఒంటిగంటవరకూ చదివావా...? రాత్రి పదిగంటలకు పోయిన కంరెంటు మళ్ళీ రెండు గంటల వరకూ రాలేదు తెలుసా.....?"

"అలాగా....! చదువు ధ్యాసలో పడి నేనసలు కరెంటు పోయిన విషయమే పట్టించుకోలేదు." ❑

433. "కానిస్టేబుల్ పోస్టుకు ఇంటర్వ్యూ జరుగుతోంది.

"చూడు.... గాంధీపురంలో దొంగలు పడ్డారు. మీరు అర్జెంటుగా రావాలి అని ఓ యింటి నుండి ఫోన్ వచ్చిందనుకో నీవేం చేస్తావ్...?" అడిగాడు అధికారి.

"అదే వీధిలో ఉన్న మాయింటి కెళ్ళి మా యింట్లో దొంగలు పడకుండా కాపలా కాసుకుంటాను సార్.....!" చెప్పాడు అభ్యర్థి. ❑

434. గాఢనిద్రలో ఉన్న భార్యను నిద్రలేపి "కాంతం...! కాంతం...!! నాకు బ్రహ్మాండమైన కలొచ్చింది...." అన్నాడు భర్త.

"ఏం కల....?" అడిగింది కాంతం.

"నాకు లక్షరూపాయల లాటరీ తగిలినట్టు......"

"మరప్పుడే ఎందుకు లేపారు.....? శుభ్రంగా డబ్బంతా బాంక్‌లో వేసిన తర్వాత నిద్రలేపలేకపోయారా...?" చిరాగ్గా అంది కాంతం. ❑

435. "మీ ప్రవర్తన నాకసలు నచ్చడం లేదు. నన్ను విసిగించేస్తున్నార ఏదైనా ఏక్సిడెంట్ జరిగి చనిపోతే ఎంత బావుండునో...!" ఇసుక్కుంటు అంది భార్య.

"ఎందుకే....! అలా విసుక్కుంటావ్.... నీకు ఏం తక్కువ చేశాన ఇపుడు చనిపోతానంటున్నావ్....?" నెమ్మదిగా అడిగాడు భర్త.

"అమ్మా ....! ఆశ..!! నేను చనిపోతానా...? మీరు చావాలంటున్నాను... 'అంటూ చెప్పింది భార్య. ❑

36. రాజారావు ఓ హోటల్‌కి వెళ్లాడు. టిపిన్ ఆర్డర్ చేశాడు. సర్వర్ ఓ ఉల్లిదోసె తెచ్చిపెట్టాడు. రాజారావు కొద్దిగా ఉల్లిదోసెతిని "ఛి...ఛీ.. మీ హోటల్లో టిఫిను రోజూ అమృతంలా అద్భుతంగా ఉండేది. కాని ఈ వేళ ఇంత ఛండాలంగా ఉందేమిటి...? అసలు రుచిలేదు..." అన్నాడు.

"కోప్పడకండి సార్... ! రోజూ పెట్టే టిఫినులో నాలుగైదు రోజుల్నుండి పాచిపోయినవి కలిపి రుచి పెట్టే వాళ్ళం. కాని ఈ వేళ అలాంటివేమీ లేక మామూలు పిండితో చేసినవి పెట్టామంతే...!" అన్నాడు సర్వర్..

37. ధర్మరాజు భార్య రోగిష్టి అయిపోయి మంచాన పడింది. నీరసించి పోయి దగ్గుతూ, తుమ్ముతూ ఉంది. ఓ రోజు ధర్మరాజు మందులు తెచ్చి టేబుల్‌పై పెడుతూ" ఇది దగ్గుకీ, ఇది ఆయాసానికి, ఇది జలుబుకీ... " అన్నాడు.

"ఏవండీ.....! కొద్దిరోజుల్లో చనిపోయేనాకు ఎందుకండీ ఈ మందులు...! అవి వాడినా నేనెలాగు బ్రకను అంచేత నా మందుల కోసం మీరు అనవసరంగా డబ్బు వృధా చేయొద్దు..." అంది ధర్మరాజు భార్య నీరసంగా.

"ఇకనోర్మూస్తావా..! ఈ మందులు తెచ్చింది నీ కోసం కాదు. నీ జబ్బులన్నీ నాకు అంటుకోకుండా ముందు జాగ్రత్తగా నేనే తెచ్చుకున్నాను...." కోపంగా అన్నాడు ధర్మరాజు. ❑

438. ఓ ప్రాంతీయ పార్టీలో ఎం.ఎల్.ఎ. సీటుకోసం అధ్యక్షుడి దగ్గరకు వెళ్ళాడు దుర్గారావ్.

"నాకు మీ పార్టీలో సీటిప్పించండి..... నేను తప్పక గెలుస్తాను...." అన్నాడు.

"సారీ...! మా పార్టీ టికెట్ నీకు ఇవ్వలేము. ఎందకంటే మా పార్టీలో చేరే అభ్యర్థికి కరుకుదనం ఉండి హత్యలు, మానభంగాలు, దోపిడీలు వంటి వాటిలో ఆరితేరి ఉండాలి..." అన్నాడు అధ్యక్షుడు.

"నీ యబ్బ.....! నెమ్మదిగా అడిగాననా రెచ్చిపోతున్నావ్...? ఒరేయ్..! నాకు టికెట్ ఇవ్వకపోతే వారం రోజుల్లో నిన్ను చంపి వందహత్యలు పూర్తిచేస్తా... జాగ్రత్త..." అన్నాడు దుర్గారావ్.

"బాబ్బాబూ... కోపడకు నీకు టికెట్ గ్యారంటీ...." చెప్పాడు అధ్యక్షుడు.

439. "డాక్టర్...! నాకు దూరంగా ఉన్నవి సరిగా కనిపించడం లేదు. దయచేసి నాకు అన్నీ కనిపించేలా మార్గం చెప్పండి...."



"ఎందుకయ్యా...! ఎంచక్కా దగ్గరికి వెళ్ళి చూస్తే సరి..."

"కానీ...కానీ డాక్టర్...! ఎదురింటావిడ స్నానం చేసేటపుడు అలా దగ్గరకెళ్ళి చూస్తే ఊర్కోదు మరి......" ❑

440. జోగినాథానికి కళ్ళు సరిగ్గా కనిపించక పోవడంతో తన కొడుకు జోగినాథాన్ని కళ్ళ డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాడు. డాక్టరు పరీక్షలు పూర్తిచేసి జోగినాథంతో "ఇపుడు మీరు ఈ అక్షరాలు చదవండి...." అన్నాడు.

"ఏఅక్షరాలు డాక్టర్.....?"

"ఈ పుస్తకంలో అక్షరాలు...."

"ఏ పుస్తకమండీ.....?
"ఇదిగోనయ్యా.....! నా చేతిలోని పుస్తకం...."
"అసలు మీ చేతులెక్కడ ఉన్నాయండీ బాబూ....!" అన్నాడు కళ్లకు ఏమి కనిపంచకపోవడంతో జోగినాథం. ❏

441. మాస్టారు అడిగిన ప్రశ్నకు నాని సరిగ్గా సమాధానం చెప్పకపోవడంతో "వెధవ..." అని తిట్టారు. నానిగాడికి ఏడుపు ముంచుకొచ్చి దొర్లిదొర్లి ఏడవసాగాడు. మాస్టారు మళ్ళీ వాడిని సుముదాయిస్తూ "ఏడవకురా.... నానీ... ఏడవకు అసలు వెధవ అంటే "వెయ్యేళ్ళు ధనంతో వర్ధిల్లు' అని అర్థం..." అన్నారు.
"అలాగా....? వెధవా...! అయితే ఇక ఏడవను మాస్టారు వెధవ..." అన్నాడు నాని. ❏

442. వీధి అరుగుమీద కూర్చొని భార్యా భర్తలు మాట్లాడుకుంటున్నారు. అంతలో అక్కడకు ఓ గాడిదవచ్చింది. బార్యను సరదాగా ఆట పట్టించాలని ఆ గాడిదను చూపిస్తూ "ఏమే..! మీ చుట్టాలోచ్చారు కాస్త చూడు..." అన్నాడు భర్త
భార్య కొంచె ఆలోచించి గాడిదతో "రండి మావయ్యగారూ...! రండి అత్తయ్యగారు రాలేదేం..?" అంది . అంతే...! భర్త ముఖం మాడిపోయింది. ❏

443. అమలాపురం భానోజీ రాయల్ కాలేజీలో ఓ ప్రత్యేక కార్యక్రమం సందర్భంగా ఓ స్వామీజీని ఆహ్వానించారు. ఆయన ఏకధాటిగా ఉపన్యసించి గంట తర్వాత "కాబట్టి నాయనలారా...! జీవహింస మహాపావం..! మనకు ఎలాంటి కష్ట నష్టాలు వాటిల్లినా ఉద్రేకపడకూడదు. మనసు నిగ్రహించుకోవాలి..." అన్నాడు. వెంటనే ఓ విద్యార్థి అరిచాడు "స్వామీ......! గంట నుండి మేము అలా నిగ్రహించు కోవడం వల్లనే మీ రింకా క్షేమంగా ఉన్నారు." ❏

444. వ్యక్తి ఎదుగుదలతో పాటే వ్యక్తిత్వపు తీరూ మారుతుందని కాంతారావు గారు తమ ఉపన్యాసంలో క్లుప్తంగా వివరించారు.

"చిన్నప్పుడు ప్రతిదానికీ మా అమ్మ చెప్పింది అనేవాణ్ణి, స్కూల్లో చేరాక ప్రతిదానికీ మాటీచరు చెప్పింది అనేవాణ్ని, హైస్కూల్లో చేరాక ప్రతిదానికీ మా ఫ్రెండు చెప్పాడు అనేవాణ్ణి, కాలేజీలో చేరాక ప్రతిదానికీ నేను చెబుతున్నానయ్యా అనేవాణ్ణి, ఉద్యోగంలో చేరినప్పట్నుండి ప్రతిదానికీ ఎవడు చెప్పాడయ్యా.....! అంటున్నా....." ❑

445. "మనం ఓ చోట నిలబడి ఉన్నాం. ఓ పెద్ద బరువైన రాయి నీ కుడిచేతివైపున ఉంది దానిని ఎడమ చేతివైపుకు మార్చాలి అపుడు నీవు ఏం చేస్తావు....?" అడిగారు మాష్టారు విద్యార్థిని.

"ఇందులో పెద్ద సమస్యేముంది....?చాలా సులభం మాష్టారు....!"

"అదే.... ఏం చేస్తావో చెప్పు...?"

"ఆరాయికి కుడివైపుకి వెళ్ళి నిలబడితే చాలు...." ❑

446. "పందికి మాత్రమే ఉండి మిగతా జంతువులకు లేనిదేమిటో చెప్పండ్రా...." అడిగారు మాస్టారు.

"పందిపిల్లసార్....!" చెప్పాడో విద్యార్థి. ❑

447. "ఏమే..! నువ్వు, నేనూ పిల్లలు అందరం కలసిటూరు వెళ్తే బోలెడంత డబ్బు ఖర్చువుతుంది. నేనొక్కడినే వెళ్ళి అక్కడి వింతలు, విశేషాలు అన్నీ మీరు కళ్ళతో చూస్తున్నట్లుగా వర్ణించి చెబుతాను సరేనా...?" అన్నాడు భర్త.

"అలాగేనండీ..! నేను కూడా ఇక నుంచి నాకూ, పిల్లలకూ వంట చేసుకొని భోంచేసి రుచులన్నీ మీకు మీరే తిన్నట్లుగా అనిపించేలా చెబుతాను. సరేనాండీ..?" అంది భార్య. ❑

448. కొంతమంది స్నేహితులు ఒక వీధి అరుగుమీద కూర్చొని మాట్లాడు కుంటున్నారు. అంతలో అప్పారావు ఆయాసపడుతూ పరుగెత్తుకు

వచ్చి వాళ్ళ మధ్యకు చేరాడు. వాళ్ళలో ఒకడు అప్పారావును చూసి వెటకారంగా "గాడిదలా పరుగెత్తు కొని వచ్చావేమిటి...?" అన్నాడు.



"ఓ ఊరకుక్క నా వెంటపడి తరుముతుంటే భయపడి పరుగెత్తుకొని వచ్చాను. ఇప్పటికి మందలో కలిసాను...." చెప్పుతో కొట్టినట్లు చెప్పాడు అప్పారావు. ❑

449. పూజారిగారి దగ్గరకు వెళ్ళాడు భక్తవత్సలం.

"ఓ పెద్దపాపం చేశాను స్వామీ...!" అన్నాడు దిగులుగా.

"ఏం చేశావ్...?" అన్నాడు పూజారి ఆదుర్దాగా.

"పాతికేళ్ళ క్రితం యుద్ధం వచ్చిందికదా...! అప్పుడొక శత్రుసైనికుడు వచ్చి రక్షణ కోరాడు. అతనికి మా యింట్లో ఆశ్రయం ఇచ్చాను. అటకమీద దాచి పెట్టాను...." అన్నాడు భక్తవత్సలం.

"అంతే కదా...! పర్వాలేదు...." అన్నాడు కాస్త తెరిపిన పడుతూ.

"ఇంకో పాపం కూడా చేశాను స్వామీ..!" అన్నాడు భక్తవత్సలం ఇంకా దిగులుగా.

" ఏం చేశావ్..?" అన్నాడు పూజారి మళ్ళీ ఆదుర్దాగా.

"అటకమీద అతన్ని దాచిపెట్టినందుకు గాను అద్దె కట్టమన్నాను..."

"అరె...! చాలా తప్పుచేశావు నాయనా...! అయినా గడిచిపోయిన దానికోసం విచారించడమెందుకు..?" అన్నాడు పూజారి ఓదార్పుగా.

"నాకో ధర్మసందేహం ఉంది స్వామీ...!" అన్నాడు భక్తవత్సలం.

"ఏమిటి నాయనా అది..?"

"యుద్ధం పాతికేళ్ళ క్రితమే ముగిసిపోయిందన్న విషయం అటకమీద ఉండి ఇంకా అద్దెకడుతున్న అతనికి చెప్పాలా...? వద్దా..?" అన్నాడు భక్తవత్సలం బుర్రగోక్కుంటూ. ❑

450. "ట్యూషన్ పూర్తిగాకానే జాగ్రత్తగా ఇంటికి చీకటి పడకముందేవచ్చెయ్ తల్లీ...!"
"ఎందుకు నాన్నా.... అంత భయపడతావు? నేనేమీ చిన్నపిల్లను కాను కదా..!"
"కాదు కాబట్టేనమ్మా నా భయం..." ☐

451. ఎదురింటావిడ, పక్కింటావిడ మాట్లాడుకుంటున్నారు.
"మేం పచ్చగా ఉంటే చూడలేకపోతున్నారు చాలామంది పిన్నిగారూ...' ' అంది ఆవేదనగా.
"అదేమిటమ్మాయ్..! నువ్వు నలుపు, మీ ఆయన నలుపు, మీ పిల్లలు నలుపు మరి మీరు పచ్చగా ఉండడం ఏమిటీ..?" అంది పిన్నిగారు తెలివిగా. ☐

452. బాగా రద్దీగా ఉండే చల్లపల్లి బస్సులో నిలబడి ప్రయాణం చేస్తున్నాడు రమణ. బస్సులో ఒకామె నడుంమీద నెమ్మదిగా చెయ్యివేసి నొక్కాడు.
"ఏయ్...! మిస్టర్...! ఏం చేస్తున్నావ్...?" అందామె కోపంగా.
"బి.యస్.సి.ఫైనలియర్..." అన్నాడు రమణ తడుముకోకుండా.☐

453. ఓ సాయం సంధ్యవేళ ముకుందరావు డాబామీద కూర్చొని పేపరు చదవసాగాడు.
అంతలో చిన్నచిన్న వర్షపు తుంపర్లు పడసాగాయి. డామీద దండేనికి కట్టి ఆరవేసిన బట్టలు తీయడానికి అతని మరదలు వచ్చింది. మరదల్ని చూసిన ముకుందరావు కొంటెగా "మరదలా....! నీ చీర విప్పడం పూర్తి కాగానే కాస్త నాలుంగీ కూడా విప్పెయ్యి..." అన్నాడు.
'"అలాగే బావగారూ...! కానీ నా చీర విప్పడం పూర్తయ్యేలోగా మీ లుంగీ తడిసిపోకుండా ఉండాలిగా...." అంది మరదలు తెలివిగా.

454. "ధర్మం చెయ్యండి బాబూ...!"
"ఇప్పుడే కొట్టుతీశాను ఇంకా బోణీ కాలేదయ్యా...."

"అయితే ఈ పావులా తీసుకుని ఓ బీడి ఇచ్చి ఆ తర్వాత ఎంత ధర్మం చేస్తారో చెయ్యండి. ❑

455. "అమ్మా..! నాకు పరీక్షల్లో వంద మార్కు లొచ్చాయి" చెప్పాడు కన్న.
"చాలా సంతోసం కన్నా....! ఏ సబ్జెక్టులో వందమార్కులొచ్చాయి..?"
"తెలుగు 20, ఇంగ్లీషు 20, సైన్స్ 20, సోషల్ 20, లెక్కలు 20 మొత్తం వంద..." ❑

456. "వెంకన్నా...! మా ఆవు తప్పిపోయింది. నిన్నటి నుండి కనిపించడం లేదు. ఇటుగాని వచ్చిందా....?" అడిగాడు రామన్న.
"అంటే తెల్ల ఆవే కదా..! " అడిగాడు వెంకన్న "ఔను .." అన్నాడు రామన్న.
"దాని మీద అక్కడక్కడా నల్లటి మచ్చలు కూడా ఉంటాయి ఔనా....!"
"ఆ....ఆ..... అదే ఆవు......"
"దానికి కొంచెం మొండి తోక, కాస్త పొట్టిగా ఉంటుంది కదా!
"ఔనయ్యా...! ఇంతకూ ఆ ఆవు ఎక్కడ కన్పించిందో చెప్పు...."
"నాకేమీ కన్పించలేదు కాని కన్పిస్తే చెబుతాలే..." అన్నాడు వెంకన్న.

457. సంజీవరావు ఓ అడవికి పనిమీద వెళ్ళాడు. అక్కడ అతనికో ఆటవికుడు కనిపించాడు. అతన్ని చూసి "బాబూ...! నేను ఇదివరకోసారి ఈ అడవికి వచ్చి నపుడు ఇక్కడ సన్నగా, పొడుగ్గా, పొరపళ్ళతో ఓ నరమాంస భక్షకుడు ఉండేవాడు ఇప్పుడు ఉన్నాడా.....?" అనడిగాడు.
"ఇపుడు లేదు బాబయ్యా......!" అన్నాడా ఆటవికుడు.
"ఏమైపోయాడు.....?"
"నేనే తినేశాను....." చెప్పాడు ఆటవికుడు. ❑

458. రమాదేవి తన స్నేహితురాలు శ్రీదేవి ఇంటికెళ్ళింది. ఇల్లంతా చూస్తూ పూజగదిలోకి వెళ్ళి:ది. అక్కడ శ్రీదేవి దేవుడి ముందు ఓ అరటి తొక్క పెట్టి ఉంచడం చూసి ఆశ్చర్యంగా "ఇదేమిటే...! అరటి తొక్కకు పూజచేస్తున్నావు?" అంది.

"దానివల్లే నాకు ఇంటి పెత్తనం వచ్చింది..." అంది శ్రీదేవి.
"అదెలా..?" అడిగింది రమాదేవి.
"ఆ అరటితొక్కమీద కాలేసి కాలుజారి పడి నడుం విరగొట్టుకుంది మా అత్తగారు. దాంతో ఇంటి పెత్తనం, బీరువా తాళాలు నా చేతికొచ్చాయి...." అంది ఆ అరటితొక్కకు దండం పెట్టుకుంటూ.

459. ఇంటర్వ్యూకి వెళ్ళాడు రాఘవ.
"మనం దేశంలో నీకు తెలిసిన ముగ్గురు గొప్పవాళ్ళు, ఉత్తముల పేర్లు చెప్పు....." అన్నాడు ఆఫీసర్.
"మహాత్మాగాంధీ, ఇందిరాగాంధీ మూడోది మరి మీ పేరు నాకు తెలియదు సార్...!" అన్నాడు రాఘవ. ❑

460. ఒకపూజారి, ఒక పెద్దమనిషి, ఒక గజదొంగ గుడిలో పేకాట ఆడుతూ పట్టుబడిపోయారు. కోర్టులో హాజరు పరచబడ్డారు.
"నువ్వు పేకాట ఆడావు ఔనా....? " అడిగారు జడ్జి పెద్ద మనిషిని.
"అయ్యా...! నాపెళ్ళాం పిల్లలమీద ఒట్టు. నేనసలు ఆడలేదు...." అన్నాడు పెద్ద మనిషి. జడ్జి పెద్దమనిషిని పంపించేశాడు.
"అయితే నువ్వు ఆడావు కదూ..? అడిగాడు పూజారిని.
"బాబోయ్....! ఆదేవుడి మీదొట్టు. అసలు నాకు పేక గురించే తెలియదు....." అనేశాడు పూజారి.
జడ్జి పూజారిని కూడా వదిలేశాడు.
"నువ్వు అబద్ధం ఆడకుండా చెప్పు. నువ్వు ఖచ్చితంగా పేకాడావు ఔనా..?

గజదొంగను అడిగాడు జడ్జి.

"ఎవరితో ఆడానో చెప్పండి సార్...?" నిలదీశాడు గజదొంగ. ❑

461. "మీరు పోలీసు డిపార్టుమెంటులోనే కదా పనిచేస్తున్నారు. కనీసం మన వీధిలో దొంగలు పడకుండా చూశారా....?" అడిగాడు అప్పారావు.

"మీరు విద్యుత్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తూ మన వీధిలో పవర్ కట్‌లేకుండా చేశారా.....?" ఎదరు ప్రశ్న వేశాడు కానిస్టేబుల్ కనకరాజు.

462. సార్....! మేమొక జానపద చిత్రం తీస్తున్నాము. మీరు ఒకే ఒక్కరోజు కాల్షీటు ఇస్తే సినిమా పూర్తి చేసేస్తాం...." అన్నాడు హీరోతో ప్రొడ్యూసరు.

"ఒక్కరోజుతో నేను హీరోగా సిన్మా పూర్తయిపోతుందా....? ఎలా?" ఆశ్చర్యంగా అడిగాడు హీరో

"సినిమా ప్రారంభంలో మాంత్రికుడు మిమ్మల్ని ఒక కోతిగా మార్చేస్తాడు. మళ్ళీ సిన్మా క్లైమాక్స్‌లో మీరు దైవ శక్తితో మామూలు మనిషి అవుతారు...." వివరించాడు ప్రొడ్యూసర్. ❑

463. ఇద్దరు పల్లెటూరివాళ్లు విమానాశ్రాయానికి వెళ్తున్నారు.

"ఒరేయ్...! మనం విమానం ఎక్కి విమానంలోంచి కిందకు చూస్తే క్రిందున్న వాళ్ళు అందరూ చీమల్లా కన్పిస్తారు...." అన్నాడొకడు.

ఇద్దరూ విమానం ఎక్కికూర్చొన్నారు. రెండోవాడు కాసేపటి తర్వాత బయటకు చూసి "ఓరేయ్....! నువ్వు చెబితే ఏమో అనుకున్నాను కాని విమానం ఎక్కితే నిజంగానే కిందున్న మనుషులంతా చీమల్లా కన్పిస్తున్నారు...." అన్నాడు.

"నీ బొంద.... అవి నిజంగా చీమలే.... విమానం ఇంకా స్టార్ట్ అవలేదు..." అన్నాడు మొదటివాడు. ❑

464. "ఒసేవ్ కాంతం...! నిన్ను కళ్ళజోడు పెట్టుకోకుండా వంటచెయ్యొద్దని ఎన్ని సార్లు చెప్పాను...?చూడు కూరనుండి అన్నీ తలవెంట్రుకలే....' అన్నాడు భర్త.

"మిమ్మల్ని కళ్ళజోడు పెట్టుకోకుండా భోజనం చేయొద్దని చాలాసార్లు

చెప్పాను. అవి తలవెంట్రుకలు కావు. కొత్తిమీర కాడలు....." అంది భార్య. ❑

465. కొప్పిగుంటలో విజయదశమి ఉత్సవాల సందర్భంగా ఓ హరికథాదాసు గారు హరి కథ చెబుతున్నారు. హరి కథ పూర్తయ్యేసరికి ప్రేక్షకులంతా ఒక్కొక్కరూ వెళ్ళిపోయారు. చివరికి ఒక వ్యక్తి మాత్రం కనీసం నిద్రపోకుండా చాలా ఉత్సాహంగా కూర్చొని ఉన్నాడు.

హరికథదాసుగారు అతని దగ్గరకెళ్ళి "మీలాంటి వారి వల్లే కనీసం ఇలాంటి కళలు కొంతైనా బతికి ఉన్నాయి..." అన్నాడు.

వెంటనే ఆ వ్యక్తి "భలేవారండీ....! మనలో ఆమాత్రం సహాయం చేస్కోకపోతే ఎలా........? మీ తర్వాత ప్రొగ్రాం నాదే..." అన్నాడు.❑

466. అప్పారావు, సుబ్బారావు, వెంకట్రావు కలసి వాళ్ళ కుక్కల గురించి, వాటి గొప్పతనం గురించి చెప్పుకుంటున్నారు.

"అబ్బో...! నాకుక్క టామీ ఉందే మహాతెలివైన కుక్కలే...! షాపుకెళ్ళి సిగరెట్లు తెమ్మంటే తెస్తుంది.... " అన్నాడు అప్పారావు.

"మరి నీకుక్క మాటేమి...?" అన్నారు.

"ఆ...ఏముందీ...? సుబ్బారావు కుక్క నడుపుతున్న షాపులో ఖాతా పెట్టి దివాలా ఎత్తించింది నాకుక్కేకదా...!" అన్నాడు వెంకట్రావు కూల్‌గా. ❑

467. రెడీమెడ్ బట్టల వ్యాపారం పెట్టాడు చిన్నాజీ

"బిజినెస్ ఎలా ఉంది...?" పరామర్శగా అన్నాడు నానాజీ.

"నిన్న ఒక్కటంటే ఒక్క షర్టు మాత్రమే అమ్మగలిగాను.." అన్నాడు చిన్నాజీ దిగులుగా.

"మరి ఈ వేళ...?"

"ఈ రోజైతే మరీ ఘోరం..."

"ఏమైంది..?" అన్నాడు నానాజి.

`నిన్న అమ్మిన షర్టు ఈ వేళ తిరిగి ఇచ్చేశారు..." అన్నాడు చిన్నాజీ ఏడుపు గొంతుతో. ❑

468. "డాక్టర్...! శ్మశానం పక్కన మీ ఆసుపత్రి ఎందుకు కట్టారు...?
"అబ్బే......! ఆసుపత్రి కట్టాకే శ్మశానం తయారైంది. ❑

469. "రాణీ...! మన పెళ్ళికి ఈ పక్షులు, ఆకాశం, భూమి సాక్ష్యాలు..." అన్నాడు రాజు.
"మనుషుల సాక్ష్యాలు రెండైనా ఉంటే నాకు కాస్త సేఫ్టీ అనుకుంటా రాజా..."' అంది రాణి. ❑

470. ఇద్దరు శాస్త్రవేత్తలు అణుపరీక్షలు గూర్చి మాట్లాడుకున్న తర్వాత -
"పందెం పది సంవత్సరాలలో ఈ యుగం అంతమైపోతుంది..." అన్నాడో శాస్త్రవేత్త.
"లక్ష రూపాయలు పందెం కడతాను. పదిసంవత్సరాలలో ఈ యుగం అంతకాదు." అన్నాడు ఇంకొక శ్యాస్త్రవేత్త.
"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవ్...?" అన్నాడు మొదటాయిన.
"అంతం కాకపోతే లక్షరూపాయలు నేను తీసుకుంటా. ఒక వేళ అంతమయితే నీ కెలాగూ నేనివ్వను కదా...!" ❑

471. నదిలో లాంచి ప్రయాణం జరుగు తుండగా భారీ వర్షం కురిసి అందరూ తడసిపోయి వణక సాగారు. అందులో ముగ్గురు ఆడపిల్లల పరిస్థితి చూసిన ఆ లాంచి సరంగు



"ఎవరి దగ్గరైనా ముగ్గురు ఆడపిల్లలకు వేడి ఇవ్వగల గొడుగు ఉందా...?" అంటు అరిచాడు.
"గొడుగు లేదుకాని వేడి అందించే ఇతర మార్గం నాకు తెలుసు..." అంటూ ముందుకు వచ్చాడు ఒకడు. ❑

472. "గంగరాజూ ..! ఇక నుంచైనా నువ్వు త్రాగడం మానేస్తే నాను లాగ ఇన్‌స్పెక్టర్ అవుతావు. అందుచేత త్రాగుడు మానేసి మంచిగా ఉండు..." త్రాగుబోతు కానిస్టేబుల్‌తో అన్నాడు ఇన్‌స్పెక్టర్
"అంత అవస్థ నాకెందుకు సార్...! నేను తాగిన వెంటనే ఇన్‌స్పెక్టర్ ఏమిటి ఏకంగా సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అయిపోతాను...." అన్నాడు గంగరాజు. ❏

473. "మీ ఆవిడను పిచ్చానువత్రిలో జాయిన్ చేశాక ఏమైనా తేడాకన్పించిందా...?
"ఆ.... ఇదివరకూ తనొక్కతే మహారానిననుకొనేది. ఇపుడు నన్ను మహారాజా అంటోంది." ❏

474. "నీ భార్య మీద నీకు బాగా కోపం వస్తే ఏం చేస్తావ్...? చెయ్యి చేసుకుంటావా...?
"కాదు...... నా ఒక్కడికే వంట చేసుకుంటాను....." ❏

475. ఓ ముసలాడు డాక్టర్ మీద మండిపడుతున్నాడు.
"మీరు వేసిన నాలుగు వందల రూపాయల బిల్లు చూస్తుంటే నా రక్తం సలసల కాగిపోతోంది.
"మీ ముసలి రక్తం అలా కాగిపోయేలా చేసినందుకు మరో వందరూపాయలు ఎగస్ట్రా ఇవ్వండి..." అన్నాడు డాక్టర్. ❏

476. "ఇన్ని సంవత్సరాలైనా మనకు పిల్లలు కలుగలేదు. నాకైతే ఎప్పుడు నా కడుపు పండుతుందా అని ఆత్రంగా ఉంది. పిల్లలు పుట్టించగల స్పెషలిస్ట్ ముమ్మిడివరంలో ఉన్నాడట. ఓసారి ఆయన దగ్గరకు వెళ్ళానండి...." అంది భార్య.
"నోర్ముయ్.....! ఆడాక్టరు నా కంటే మొనగాడా...?" మండిపడ్డాడు భర్త. ❏

477. కొత్తగా పెళ్ళయిన రమణ, దుర్గలు సినిమా కెళ్ళారు. వాళ్ళు సినిమా చూడ్డం మానేసి ముచ్చట్లు చెప్పుకోసాగరు. "దుర్గా..! నీ కంటే ముందు

నేను మరో ముగ్గురు అమ్మాయిల్ని చూశాను. ఒకమ్మాయి తాను నలుపు, ఒకమ్మాయికి మెల్ల, ఒకమ్మాయికి నత్తి ఎవ్వరూ నచ్చలేదు. చివరికి పెళ్ళంటేనే విరక్తి కలిగింది. ఆ సమయంలో నిన్ను చూశాను. నచ్చావు, వెంటనే పెళ్ళి కుదిరిపోయింది..... "అంటూ ముగించిన రమణ సినిమా చూడసాగాడు. సినిమా సరిగా అర్థంకాక పక్కసీటతన్ని "ఎంతవరకూ వచ్చింది...?" అన్నాడు.

"మీ ఇద్దరికీ అంటే మీ భార్యకూ, మీకు పెళ్ళి కుదిరిందన్నారు. అక్కడితో ఆపేశారు...." అన్నాడు పక్క సీటతను. ❑

478. ఆఫీసు పనితో విసిగిపోయి ఇంటికి వచ్చిన భర్త "నీవిప్పుడు చెడు వార్తలేమీ చెప్పకు. మంచి వార్త ఏదైనా చెప్పు..." అన్నాడు భార్యతో.

"మన ముగ్గురమ్మాయిల్లో చిన్నవాళ్ళిద్దరూ ఎవరితోనూ లేచిపోలేదండీ....." అంది భార్య నసుగుతూ. ❑

479. "మీ నాన్న నాకు కాళ్ళు కడిగి కన్యాదానం చేసేటప్పుడు నాస్టిల్ చాలా చక్కగా ఉంది వీడియోలో..." కాలర్ ఎగరేసుకుంటూ అన్నాడు భర్త

"ఆ సంయమంలో మానాన్న నాకు వసుదేవుడిలా కన్పించాడు... అంది భార్య చురుకఅంటిస్తూ. ❑

480. డాక్టర్ గారూ....! నాకీ మధ్య ప్రతి వస్తువూ రెండుగ కనిపిస్తోందండీ...!" చెప్పాడు ఒకతను గాబరాగా.

"గాబరా పడాల్సిన పనేమీ లేదు. ఓ కన్ను తీసేస్తే అదే సర్ద కుంటుంది..." తేల్చిపారేశాడు డాక్టర్. ❑

481. గైడు కొంతమంది టూరిస్టులను ఎత్తైన కొండను ఎక్కిస్తూ ఇల వివరించాడు.



"ఈ కొండ చాలా ఎత్తైంది. మీరంతా చాలా జాగ్రత్తగా కిందపడకుండా ఎక్కండి. ఇది చాలా ప్రమాదకరమైన స్థలం. ఒక వేళ ప్రమాదవశాత్తూ కిందపడడం సంభవిస్తే పడేటప్పుడు కుడివైపున చూడడం మర్చిపోకండి. దృశ్యం చాలా అద్భుతంగా ఉంటుంది....." ❑

482. మీ తాతయ్యగారు పోయారని విన్నాను ఎలాపోయారు...?" అడిగాడు కృష్ణ

"కాలుజారి నేలమీద పడ్డారు..." చెప్పాడు రవి.

"కాలుజారి నేలమీదపడితే పోతారేమిటీ.....? మరీ విడ్డూరం..."

"కాలు జారిందేమో కొండమీద. పడింది నేలమీద..." చెప్పాడు రవి.

483. "అరమైలు దూరంలో ఉండి మీరు ప్రమాదం జరగడం చూశానంటున్నారు. అయితే మీరు ఎంతదూరం వరకూ స్పష్టంగా చూడ గలరు...?" అడిగాడు లాయర్‌సాక్షిని.

"అది నేను చెప్పలేను గాని ఉదయం నిద్రలేవగానే ఉదయించే సూర్యుణ్ణి. చాలా స్పష్టంగా చూడగలను. సూర్యుడు మనకు 98 మిలియన్ల మైళ్ళ దూరంలో వున్నాడంటారు కదా మరి...." చల్లగా చెప్పాడు సాక్షి. ❑

484. "ఒరేయ్........! హరీ నువ్వు పెద్దయ్యాక ఏమవుతారా...?" అడిగింది టీచర్ హరిని.

"డాక్టర్....! అవుతానండి...."

"ఓరేయ్...! గిరీ మరి నువ్వు..."

"లాయర్‌ని అవుతానండీ...."

"ఒరేయ్..... కృష్ణా నువ్వూ.....?" అడిగింది టీచర్.

"ఒక బిడ్డ తండ్రిని అవుతాను......." చెప్పాడు కృష్ణ.

"అమ్మా....! రాధా మరి నువ్వు...? అందర్ని అడిగినట్లే అడిగింది టీచర్.

"కృష్ణ బిడ్డకే తల్లిని అవుతాను...." వినయంగా చెప్పింది రాధ. ❑

485. బలుసు తిప ఓ మారుమూల పల్లెటూరు. అక్కడ ప్రజలు కూడా అమాయకులు. అలాంటి ఊళ్ళో ఓవ్యక్తి ఓ చోట కూర్చొని కొన్ని రకాల మూలికాఔషధాలు అమ్మసాగాడు.

"అయ్యలారా..! అమ్మలారా...! రండి..! ఈ మహాద్భుతాన్ని అందుకోండి. ఇదిగో....! నాచేతిలో ఉన్న ఈ సీసాలోనిది సంజీవిని ఔషధం. ఇది కనుక త్రాగితే ఖచ్చితంగా ఐదు వందల సంవత్సరాల వరకూ ఎలాంటి రోగాలూ దరిచేరకుండా బ్రతుకుతారు.." అంటూ అరవసాగాడు.

"నువ్వు చెప్పేది నిజమా...?" అనుమానంగా అడిగాడు అప్పలస్వామి.

"నిజం బాబూ..! నేను ఇది నాలుగు వందల యాభై సంవత్సరాల క్రిందట త్రాగాను. ఇంకా బ్రతికే ఉన్నాను....." అన్నాడు ఆ మూలికలు అమ్మేవ్యక్తి.

అయినా అప్పలస్వామికి అనుమానం తీరక అతని పక్కనున్న వ్యక్తి దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా "నువ్వు ఇతని దగ్గర పనిచేస్తున్నావు కదా..! ఇతను చెప్పేది నిజమా...! అనడిగాడు.

"ఏమో....! నాకు తెలియదండీ...! ఎందుకంటే నేను ఇతని దగ్గర కేవలం మూడు వందలసంవత్సరాల నుండి పనిచేస్తున్నాను..." అన్నాడతను.

486. "మామూలు తాళంతో బాటు కాంబినేషన్ లాక్ కూడా ఉన్న ఆ బీరువాను నువ్వు ఎలా తెరవగలిగాడు....?" అడిగాడు జడ్జి.

ముద్దాయి కాస్త సందేహిస్తూ "ఇలాంటి కిటుకులు చెప్పడానికి సాధారణంగా వెయ్యి రూపాయల వరకూ ఫీజు తీసుకుంటా..." అన్నాడు. ❑

487. "ఓరోగి ఏళ్ళ తరబడి ఓ నర్సింగ్ హోంలో ఉండి ట్రీట్‌మెంట్ తీస్కుంటున్నా ఆరోగికి ఏమాత్రం నయం కాలేదు. విసిగి పోయిన అతను డాక్టర్‌కు ఓ చీటీరాసి పెట్టి వెళ్ళిపోయాడు.

"డాక్టర్..! నేను మామూలు చావు చావాలనుకుంటున్నాను. అందుకే మా ఊరికి వెళ్ళిపోతున్నాను....." ❑

488. భార్యాభర్తలు గొడవపడుతున్నారు.

"ఛి...ఛీ... మిమ్మల్ని చేసుకొని ఏం సుఖపడ్డానులెండి..!" కోపంగా సామాన్లన్నీ విసిరేస్తూ అంది భార్య.

"నన్ను చెసుకొని సుఖపడందే నువ్వు నలుగురు పిల్లిల్ని కన్నావా...?" ఇంకా కోపంగా అరిచాడు భర్త. ❑

489. ఇద్దరు వ్యక్తులు హోటల్‌లో కూర్చొని టిఫిన్ తింటున్నారు.
"సార్..! దాదాపు ముప్పైకాళ్లు, చిన్న చిన్న రెక్కలు , పెద్దతల ఉండే పురుగు పేరేమిటి....?" అడిగాడొకడు.
"ఏమో ? నాకు తెలియదు. అయినా ఎందుకు అడుగు తున్నారు...?" అన్నాడు రెండోవాడు.
"ఏం లేదు....... ఆపురుగు ఇప్పుడు మీ షర్ట్ కాలర్ మీద పాకుతోంది...." అన్నాడు మొదటివాడు. ❑

490. వల్లంకుర్రు బస్టాండులో ఓ పేపర్ బోయ్ ఇలా అరవ సాగాడు.



"అరవై ఐదు మంది.... అరవై ఐదు మంది దారుణంగా మోసపోయిన గొప్ప సంఘటన...... వెంటనే పేపరు కొని చదవండి...బాబూ....!"
వెంటనే ఓ పదిమంది చకచకా పేపర్లుకొని చదవసాగారు. ఆ పేపర్ బోయ్ కొంత దూరం వెళ్ళి మళ్ళీ అరవసాగాడు.
"డబ్బై ఐదు......... డబ్బై అయిదు మంది దారుణంగా మోసపోయిన సంఘటన.... వెంటనే పేపరు కొని చదవండి." ❑

491. తొమ్మిదేళ్ళ కొడుకుతో కలసి హోటల్లో టిఫిన్ తింటూన్నాడు తండ్రి. కాసేపటి తర్వాత అడిగాడు కొడుకు. "నాన్న...! మనం బొద్దింకను తింటే ఏమైనా ప్రమాదమా...?
"ప్రమాదమేమీ లేదు. కానీ దాని గురించి ఇప్పుడెందుకు చిరాగ్గా..." అన్నాడు తండ్రి.

"ఇందాక నువ్వు ఇడ్లీ సాంబారుతోబాటు బొద్దింకను కూడా తిన్నావులే... అందుకని..." చల్లగా చెప్పాడు కొడుకు. □

492. "హంతకుడెవరు...?" అనే ఓ కొత్త సినిమా రిలీజైంది. సినిమా మొత్తం పూర్తి సస్పెన్స్‌తో ఉండటం వల్ల జనం ఎగబడి చూస్తున్నారు. సినిమాకి దయచేసి ఈ చిత్రం ముగింపు చూసిన వాళ్ళు చూడని వాళ్ళకు చెప్పొద్దు. చూడని వాళ్ళు చూసినవాళ్ళను అడగొద్దు. అంటూ పబ్లిసిటీ ఇవ్వడం సినిమాకి ప్లస్‌పాయింట్ అయింది.

పిసినారి పాపారావు సినిమా చూడ్డానికి వెళ్ళాడు. టిక్కెట్ క్యూ రద్దీగా ఉండటంతో ఓ టిక్కెట్టు తియ్యమని ఓ కుర్రాణ్ణి బ్రతిమాలాడు. కుర్రాడు నానా తంటాలు పడి ఆ పద్మవ్యూహంలోంచి ఓ టిక్కెట్టు తీసుకొచ్చి పాపారావు చేతిలో పెట్టాడు. పాపారావు అందుకు ఫలితంగ కుర్రాడి చేతిలో ఓ పావలా పెట్టి థియేటర్‌లోకి వెళ్ళబోయా‹ కుర్రాడికి ఒళ్ళు మండిపోయింది.

అంతే....! పరుగు పరుగున పాపారావు దగ్గరకెళ్ళి "సార్...! ‹ సినిమాలో హంతకుడు హీరోయింట్లో పనిచేసే నౌఖరే...." అంట కసిగా చెప్పేశాడు. □

493. ఓ త్రాగుబోతు కాకినాడ బస్ కాంప్లెక్స్‌లో ఎంక్వయిరీ కౌంటర్ దగ్గరకెళ్ళి "సార్...! కాకినాడ పల్లంకుర్రు బస్‌లో కందికుప్ప వెళ్ళడానికి ఎంతటైం పడుతుంది...? అనడిగాడు.

"ఒక్క నిముషం సార్..." అంటు బుక్ తెరచి చూడబోయాడు ఎంక్వయిరీ క్లర్క్...

"థ్యాంక్యూసార్...! థ్యాంక్యూ..." అంటూ వెళ్ళిపోయాడు త్రాగుబోతు.

494. రాష్ట్ర ప్రభుత్వం ఉద్యోగాల కోసం ఇంటర్వ్యూ జరుగుతోంది.

"నీ పేరేమిటి...?" అడిగాడు అదికారి.

"కట్టా శ్రీనివాస్...."

"గుడ్ .... మన మొదటి ప్రెసిడెంట్ ఎవరు...?"
"బాబూ రాజేంద్ర ప్రసాద్..."
"రెండో ప్రెసిడెంట్ ఎవరు...?"
"సర్వేపల్లి రాధాకృష్ణ...."
"వెరీగుడ్...."
పక్కనున్న రెండో అధికారి మొదటి అధికారి చెవిలో గుసగుసలాడాడు.
"సార్..! సమాధానాలు చాలా చక్కగా చెబుతూన్నడు. మూడో ప్రెసిడెంట్ ఎవరో కూడా అడగండి.."
"ఏడ్చినట్లుంది. మూడో ప్రెసిడెంట్ ఎవరో నాకే తెలీదు..." అన్నాడు మొదటి అధికారి గొణుగుతూ. ❑

495. ఓ లక్షాధికారికి తన దగ్గరపనిచేసే కారుడ్రైవర్ మీద అసంతృప్తి కలిగింది.అ తని డ్రైవింగ్, ప్రవర్తనా తీరు నచ్చలేదు. అందుకని బాగా ఆలోచించి ఓ పేపర్లో "మంచి అనుభవం, చురుకుదనం కల ఒక డ్రైవర్ కావాలి......" అని రహస్యంగా వేయించాడు. దానికి ఒకే ఒక్క అప్లికేషన్ వచ్చింది.
లక్షాధికారి అప్లికేషన్ తెరచి చూశాడు. అది వాళ్ళ డ్రైవర్‌దే. ❑

496. బాగా డబ్బున్న ముగ్గురు పిసినారులు మరిడమ్మతల్లి గుడికెళ్ళారు. పూజ అయ్యాక హారతి, దక్షిణ పళ్లెం పట్టుకొని జనంలోకి రాసాగాడు పూజారి. ముగ్గురు పిసినారులకూ ఆ దక్షిణ పళ్ళెం తన దగ్గర కొచ్చేలోపల ఎలా తప్పించుకు పారిపోవాలా అని ఆలోచన.
అకస్మాత్తుగా ందులో ఒకడు స్పృహ తప్పాడు.
మిగతా ఇద్దరూ వా;ణ్ణి భుజాన వెసుకొని వెళ్ళిపోయారు. ❑

497. ఒకావిడ వాళ్ళ ముద్దుల కుక్క జిమ్మీని తీసుకొని ఆర్టీసీ బస్సెక్కింది. ముగ్గురు కూర్చొనే సీటుకి మధ్య కుక్కను కూర్చోబెట్టి ఒక పక్క ఆమె కుర్చొంది. కుక్కకు మరో పక్క కూర్చున్నావిడ అభ్యంతరం తెలుపుతూ

కండక్టర్‌కు చెప్పింది. కండక్టర్ సీటుకి మధ్యలో కుక్కను తీయమన్నాడు.

"తీయనయ్యా...! నేను కుక్కకు కూడా టికెట్ తీశాను. అందుచేత మిగతా ప్రయాణీకుల్లాగే దానికీ సీటు మీద కూర్చొనే హక్కుంది..." అందావిడ మొండిగా.

"సరే....అయితే మిగతా అందరు ప్రయాణీకుల్లాగే దాన్ని కూడా కాళ్ళు సీటుమీద పెట్టకుండా కూర్చోబెట్టండి..." అన్నాడు కండక్టర్. □

498. "నేను నెల రోజులు ఎక్సర్‌సైజ్‌చేసి ఐదు కిలోలు బరువు తగ్గించుకున్నాను. తెలుసా....!" అంది రాజి.

"నెల రోజులకు ఐదు కిలోలు తగ్గావా...! నేను ఒకే ఒక్కరోజులో డెబ్బైకేజీలు బరువు తగ్గాను...." అంది రోజా.

"నిజమా...." అదెలా..?"

"ఏముందీ...! మా ఆయనకు విడాకులిచ్చేశాను..." [

499. ఓ మతిమరుపు ప్రొఫెసర్‌గారు బస్టాండులో నిలబడి ఉండడం చు ఆయన దగ్గర చదువుకున్న ఓ విద్యార్థి "రండిసార్..! నా చేతక్‌మీ కూర్చోండి. మీ యింటి దగ్గర డ్రాప్ చేస్తాను..." అన్నాడు తీరా ప్రొఫెస బండి మీద కూర్చుని ఇంటికెళ్ళేసరికి ఇళ్ళు తాళం వేసి ఉండడ చూసి "అరెరె...! నాభర్య బస్టాండులోనే ఉండిపోయింది..." అన్నాడు కంగారుగా. □

500. ఓ సైకియాట్రిస్టు దగ్గరుకెళ్ళాడు భార్య విధేయుడైన బాబూరావ్.

"డాక్టర్..! నాకొక చిత్రమైన కల రోజూ వస్తోందండి......" అన్నాడు బాబూరావు.

"ఏమిటది...?" అడిగాడు డాక్టర్.

"నేను ప్రతిరోజూ ఇరవైమంది అందమైన అమ్మాయిల్ని తీసుకొని చంద్రమండలం మీద దిగుతున్నాను...."

"ఆహా...! ఇంత అందమైన కలవన్నుంటే ఇంకా నీకు దిగులెందుకోయ్..?" ఆశ్చర్యంగా అడిగాడు డాక్టర్.
"మరి అంతమందికి వంటచేసి పెట్టడమంటే సులభమా...!" విసుగ్గా అన్నాడు బాబూరావు. ❑

501. బాగా లావయి పోతున్న సిద్ధయ్యగార్ని పరీక్షలన్నీ చేసి మూడు రంగుల మాత్రలు ఇచ్చాడు డాక్టర్.



"ఇవిగో! ఈ పసుపు పచ్చవి భోజనానికి ముందు వేసుకోవాలి. ఈ ఆకు పచ్చవి భోజనానికి తర్వాత వేసుకోవాలి..." అన్నాడు డాక్టర్.
"మరి ఈ ఎరుపు రంగువి...?" అడిగాడు సిద్ధయ్య.
"కొంతకాలం అవే మీ భోజనం..." చెప్పాడు డాక్టర్. ❑

502. భార్యా భర్తలు గొడవపడుతున్నారు. భార్యమీద అనుమానంతో తిడుతున్నాడు. భర్త.
"నీచురాలా..! నీ శీలం మంచిది కాదు. నువ్వు పెద్ద తిరుగుబోతువి. పాపిష్టి దానివి. నువ్వు మనపాలవాడితోను, పేపర్‌బోయ్‌తోను, కూరగాయలవాడితోను, మన కారు డ్రైవర్‌తో కూడా పడుకున్నావు...' అరిచాడు భర్త.
"ఛ... మన కారు డ్రైవరంటే నాకు అసహ్యం..." అంది భార్య. ❑

503. అప్పుడే ఆపీసునుండి వచ్చిన భర్తతో అంది భార్య.
"ఏవండీ ....! ఆరోజు నా ఆరోగ్యం బాగోవడం లేదని డాక్టర్ దగ్గరకెళ్ళాను. అయన నన్ను టెస్ట్ చేసి పెద్ద జబ్బేమీ లేదు. కొంతకాలం

ఎక్కడికైనా దూరంగా వెళ్ళి ప్రశాంతంగా గడిపి రమ్మన్నారు. చెప్పండి మనం ఎక్కడి కెళ్దాం....?

"ఇంకో డాక్టరు దగ్గరకు ..... అన్నాడు భర్త. ❑

504. బల్లకట్టుమీద కాలువకు అటూఇటూ జనాన్ని దాటించే యాదయ్య దగ్గరకొచ్చిన ఒకడు

"అయ్యా...! పేదవాణ్ని నన్ను దయచేసి కాలువ అవతలికి ఉచితంగా దాటించండి.." అన్నాడు.

"అందరి దగ్గరా రెండు రూపాయలు తీసుకుంటాను... కనీసం నువ్వు ఒక అర్థరూపాయి ఇవ్వు అవతలికి దాటిస్తాను..." అన్నాడు జాలిగా యాదయ్య.

"నా దతగ్గర ఒక్కపైసాకూడా లేదు..." అన్నాడతను.

"చాల్లే....ఒకపైసాకూడా లేనివాడు కాలువ ఇవతలున్నా, అవతలున్నా ఒక్కటే...." అన్నాడు యాదయ్య చిరాగ్గా. ❑

505. "కొత్తగా వచ్చిన ఆఫీసరు తనని చూసిన లేవకుండా పనిచేస్తున్న గుమస్తా గుర్నాథం దగ్గరకెళ్ళి "నువ్వెంత కాలంగా పనిచేస్తున్నావ్...?" అనడిగాడు.

"ఇంతకు ముందున్న ఆపీసరు గారు ఉద్యోగంలోంచి తీసేస్తానని బెదిరించినప్పట్నుండండీ..." అన్నాడు గుర్నాథం రాయడం ఆపకుండా.

506. నలుగురు కాలేజీ కుర్రాళ్ళు ఓ చోట కూర్చొని ఏం చేయాలా? అని ఆలోచిస్తున్నారు. కాసేపటి తర్వాత ఒకడు అన్నాడు. "నా దగ్గర ఓ రూపాయినాణెం ఉంది. అది పైకి ఎగురేద్దాం బొమ్మపడితే కేబరే డాన్స్‌కు వెళ్దాం. బొరుసు పడితే థియేటర్‌కు వెళ్ళి మంచి సినిమా చూద్దాం. అంచుమీద కనుక నిలబడితే అందరం కలసి శ్రద్ధగా చదువుకుందాం....."

507. రోడ్డుమీద ఒక్క జోడుతోనే నడుస్తున్న వ్యక్తిని చూసి జాలిపడి అడిగాడు సుబ్బయ్య.

"పాపం...! మీ జోళ్ళల్లో ఒకటి పోయినట్లుంది.." అన్నాడు సానుభూతిగా.

"హ్హా....హ్హా....హ్హా......! పిచ్చివాడా..! పోవడం కాదురా...! ఒకటి దొరికింది...." అన్నాడావ్యక్తి బిగ్గరగా నవ్వుతూ. ❑

508. అనసూయమ్మ ఆటో ఎక్కి ఇంటికి చేరుకుంది. ఇంటిదగ్గర ఆటోదిగి పర్సులో డబ్బులు తీయబోయి ఆగిపోయింది. మళ్ళీ ఆటోలో కూలబడింది. ఆటోవాడితో "ఓ అరమైలు వెనక్కిపోనీ నాయనా...! ఆటో కిరాయికి రూపాయి తక్కువైంది..." అంది. ❑

509. ఓస్వామీజీ ఊళ్ళన్నీ తిరుగుతూ భక్తులకు పాపపుణ్యాల ఫలితాలు వివరిస్తూ చివరికి నడవపల్లి అనే గ్రామం చేరుకున్నాడు. ఓ రోజు ఊరి ప్రజలందర్నీ ఓ చోటకు రప్పించి దానగుణం గురించి వివరిస్తూ



"నాయనలారా...! మనిషిని దానగుణం ఎంతో ఉత్తముణ్ణి చేస్తుంది. మరణా నంతరం స్వర్గ లోకాలకు చేరుస్తుంది. అని వివరించి ఆఖర్న తన భోధనలు భక్తులపై ఎలా పని చేశాయో పరిశీలించడానికి వీరయ్య అనే వ్యక్తిని లేపి ఇలా ప్రశ్నించాడు.

"నాయనా..! నీకు రెండు మేడలు ఉన్నాయనుకో... అందులో ఒకటి దానం చేయగలవా..?"

"తప్పకుండా చేస్తానండీ....!" అన్నాడు వీరయ్య.

"నీకు రెండు కార్లు ఉన్నాయనుకో...! అందులో ఒకటి..."

"దానం చేసేస్తానండీ....!"

"రెండు ఎకరాల కొబ్బరితోట ఉందనుకో....!"

"అందులో ఒక ఎకరం దానం చేసేస్తానండీ....!"

"నీకు రెండు ఆవులు ఉన్నాయనుకో.......!"
"అవి మాత్రం చచ్చినా దానం చేయనండీ.....!
"ఎందుకని నాయనా.........?"
"మరి నాకు నిజంగానే రెండు ఆవులు ఉన్నాయండీ...!" అన్నాడు వీరయ్య. ❑

510. రంగనాథం గారి అమ్మాయిలకు పెళ్లిచూపులు జరుగుతున్నాయి. పెళ్లికొడుకుతో అన్నాడు రంగనాథం....." చూడు బాబూ....! మా చిన్నమ్మాయికి ఇరవై యేళ్లు. ఆమెను చేసుకుంటే ఇరవైవేలు కట్నమిస్తాను. పెద్దామ్మాయికి ముప్పైయేళ్ళు. ఆమెను చేస్కుంటే ముప్పైవేలు కట్నమిస్తాను. ఇద్దరిలో ఎవరినైనా చేసుకో...!"
కాసేపు ఆలోచించి ఆశగా అడిగాడు పెళ్ళికొడుకు "సార్.....! మీకు యాభైయేళ్లు దాటిన అమ్మాయి లేదా...?" ❑

511. విశ్వనాథం గారింట్లో అద్దెకు దిగిన కమలహాసన్ మరుసటి రోజు ఉదయం విశ్వనాథం గారి దగ్గరకెళ్ళి "ఏవండీ..! ఈ ఇంటి తీరేమిటి...? రాత్రంతా ఇంట్లో రెండు ఎలకలు ఒక్కటే ఫైటింగ్ మా నిద్రంతా నాశనమైపోయింది....." అన్నాడు.
"చాల్లేవయ్యా చెప్పావ్..! నువ్విచ్చే బోడి మూడొందల కోసం ఎలుకలు ఫైటింగ్ కాక కోడి పుంజుల ఫైటింగ్ ఏర్పాటు చేస్తామనుకున్నావా..?' 'అంటూ విసుక్కున్నాడు విశ్వనాథం. ❑

512. నువ్వు రన్నింగ్‌లో ఛాంపియన్‌వి కదా..! మరి మీ ఇంట్లో దొంగతనం చేసిన ఆ దొంగను ఎందుకు పట్టుకోలేకపోయావు...?"
"పట్టుకుందామనే వెంటపడి పరుగుమొదలు పెట్టాను. తీరా వాణ్ని చేరేసరికి పరుగులో వాణ్ని ఓడించాలనిపించి వాణ్ణి దాటుకుంటూ వెళ్ళిపోయా. 5000 మీటర్లు రన్ అయ్యాక వెనక్కి తిరగి చూస్తే ఆ వెదవ కనిపంచలేదు. ❑

513. అమెరికా అమ్మాయికి, ఆంధ్రా అబ్బాయితో వివాహం జరిగింది. శోభనం జరిగిన మరుసటి రోజు స్నేహితురాలు అడిగింది "ఏమె...! రాత్రి శోభనం అనుభవం ఎలా ఉంది.?"
"ఇండియాలో ఆడవాళ్ళను ప్రతి విషయంలోనూ క్రిందే ఉంచుతారని విన్నాను. కానీ చివరకి బెడ్‌రూంలో కూడా అంతే....!" విసుగ్గా అంది అమెరికా అమ్మాయి. ❑

514. "ఇదేమిటయ్యా...! అరికాలినిండా ఇన్ని ముళ్లిలా గుచ్చుకున్నాయ్....?
"మొదట ఒక్కముల్లె గుచ్చుకుంది డాక్టర్...! కాని ముల్లును ముల్లుతోనే తీయాలని ప్రయత్నించడంతో ఇలా అయింది." ❑

515. "మా ఆవిడకు టైలరింగ్ నేర్పించి కుట్టుమిషన్ కొనివ్వడం చాలా పొరబాటైందిరా...?"
"ఏమైందిప్పుడు....?"
"రోజూ ఆమె తయారుచేసే దోసెలు, పెసరట్లు, చపాతీలు చరిగిపోయినా కూడా మిషన్ మీద కుట్టి తీసుకువస్తోంది...." ❑

516. శకునాల పిచ్చి ఉన్న శంకర్రావుగారు ఓసారి రాఘవరావు పంతులుగారితో కలసి రోడ్డుమీద నడుస్తున్నాడు. అంతలో వాళ్ళకో కుక్క ఎదురొచ్చింది.
"పంతులుగారూ...! ఆ వచ్చే కుక్క మనకు కుడివైపు ఉండి వెళ్ళడం మంచిదా...? లేక ఎడవమైపునుండి వెళ్ళడం మంచిదా...?" అనడిగాడు శంకర్రావు.
"మనమీద పడి కరవకుండా వెళ్ళడం మంచిది..." అన్నాడు రాఘవరావు పంతులు. ❑

517. అబ్బులు రావు గారింటికి ఓ దూరపు బంధువు వచ్చాడు.
"మీకు పాడి ఆవులు ఏమైనా ఉన్నవా...?" అనడిగాడు బంధువు.
"మావి, స్వామి శెట్టి గారివి కలసి మొత్తం వెయ్యి ఆవులున్నాయి..." అన్నాడు అబ్బులు రావు.

"మీవి ఎన్ని? స్వామిశెట్టి గారివి ఎన్ని...?"
"స్వామిశెట్టిగారివి తొమ్మిదివందల తొంభై ఎనిమిది (998) ఆవులు, మావి రెండు ఆవులు......" అన్నాడు అబ్బులు రావు. ❑

18. చిన్నయ్యకు ఎంత కాలానికీ పెళ్ళి కాలేదు. అతడు కొన్నాళ్ళు ఇళ్ళల్లోకి నీళ్ళుమోసి, కూలి పనులు చేసి, శవాలు మోసి, కట్టెలు అమ్మి చివరికి సన్యాసాన్ని మంచి మార్గంగా భావించి



సన్యాసం తీసుకున్నాడు. రోజుకొక భుక్తి గడుపుతున్నాడు. ఒకరోజు ఓ బ్రాహ్మణుడు చిన్నయ్యకు పంచభక్ష్య పరమాన్నాలతో మంచి భోజనం ఏర్పాటు చేశాడు. చిన్నయ్య సుష్టుగా తిన్నాడు. భోజనం పూర్తయ్యాక బ్రాహ్మణుడు "స్వామీ....! మీరు ఈ భగవద్గీతను కూడా ఓ మారు తీసుకొని మమ్ములను ధన్యులను చేయండి...." అన్నాడు.
"ఇప్పటికే పొట్ట నిండినది. అసలు ఖాళీగా లేదు. సాయంత్రం భుజించెదను..." అన్నాడు చిన్నయ్య అదేదో ఆహార పదార్థమనుకొని.

19. శ్రీసాయి మెడికల్ షాపులోకి వెళ్ళాడు శ్రీహరి.
"మోనో ఏసిటికాసి డెస్టర్ ఆఫ్ శాలి సైక్లిక్ యాసిడ్ ఉందా...?" అనడిగాడు.
షాపు ఓనరు సత్తిబాబు ఓ క్షణం ఆలోచించి "అంటే ఆస్ప్రిన్ కదా..?" అన్నాడు.
"ఆ... అదే....! అదే....!! పేరు గుర్తుండి చావదు....." గొణుగుతూ అన్నాడు శ్రీహరి. ❑

20. "సార్...! నిన్న మీ పెంపుడు కుక్క మా అత్తగారి వెంటపడి మరీ కరిచింది......."అన్నాడు రామకృష్ణ నారాయణసింగ్‌తో

"అలాగా....! వెరీ వెరీ సారీ సార్...! ఇప్పుడు నన్నేం చేయమంటారు...?" అన్నాడు కాస్త కంగారుగా నారాయణసింగ్.

"మీ కుక్కను వెంటనే నాకు అమ్మాలి..." అన్నాడు రామకృష్ణ. ❑

521. "శ్వేతా నేను నీ ఒంటిపై వాలి వేరుసెనక్కాయలు తింటూంటే అసలు నీకేమనిపిస్తోంది...?"

"బహుశ నువ్వు నాకంటే ఎక్కువ తినేస్తున్నావేమో...! అనిపిస్తోంది...."

522. ఎప్పుడూ బిజీగా ఉండే శెట్టిగారి హోటల్‌కు వెళ్ళాడు దుర్గారావు. ఆహోటల్లో సెల్ఫ్‌సర్వీసుంది. దోసెకూ, కాఫీకి టోకెన్లు కొన్నాడు. దుర్గారావు ముందు దోసె తీసుకొని టేబుల్‌మీద పెట్టి కాఫీ కోసం వెళ్ళాడు. తిరిగి వచ్చేసరికి అక్కడ దొసెలేదు. కొత్త టోకెన్ తీసుకొని మళ్ళీ దొసె తెచ్చుకొనే సరికి మళ్ళీ కాఫీ మాయం. మళ్ళీ కాఫీ తెచ్చుకొనే సరికి దొసె మాయం.

అది చూసి దూర్గరావుకి తిక్కరేగింది. ఈసారి దోసెకోసం వెళ్తూ కాఫీ కప్పు పక్కన ఓ చిన్న స్లిప్పు పెట్టాడు. "ఇందులో నా వేలు పెట్టా..." అని ఉందందులో. దోసె తీసుకు వచ్చేసరికి యధావిధిగా కాఫీ మాయం. తాగేసిన ఖాళీ కప్పు పక్కన ఎవరో ఇంకో స్లిప్పు రాసి పెట్టారు. "కాఫీలో వేలు పెట్టానన్నావ్... అన్నీ అబద్ధాలే...! కాఫీ తాగేశాను. అందులో నీవేలు లేదు...." అని ఉంది ఆ స్లిప్‌లో. ❑

523. బాస్‌కు చాలా ద్రోహం చేశాడు చిన్నారావ్.

బాస్ అతన్ని చెడామడా తిట్టేసి "నమ్మకద్రోహం చేసి నన్నూ, నా ఫ్యాక్టరినీ దోచుకున్నందుకుగాను ఉద్యోగంలోంచి పీకేస్తున్నా...!" అని సింహగర్జన చేశాడు.

అంతా చాలా శాంతంగా విన్నాడు చిన్నారావు.

"బాస్...! మీరు చెప్పిందంతా నిజమే...! నేను మీకు చాలా నమ్మకద్రోహం చేశాను. మీ సొమ్ము దారుణంగా తినేశాను. నాకిప్పుడు ఓ

ఫారిన్ కారు ఉంది. మా ఆవిడకి మారుతీ కారూ, మా అబ్బాయికి స్పోర్ట్స్ కారూ, మా అమ్మాయికీ మినీ కారు కొనిచ్చాను. అందరికీ తలో బంగళా కంటించి ఇచ్చాను ఒక్కొక్కళ్ళకూ ఒక్కొక్కప్లాటు చొప్పున కొన్నాను. ఒక్కొక్కళ్ళ పేరుమీద లక్షల రూపాయలు ఫిక్స్డ్ డిపాజిట్లు చేశాను. నేను బాగా కడుపు నిండిన వాడిని బాస్. నా కింకేమీ అక్కర్లేదు. అందుకని మీరు నన్ను ఉద్యోగంలో ఉంచడమే చాలా మంచిది.

అలా కదాని నన్ను పీకేసి ఇంకో కొత్తవాణ్ణి నాస్థానంలో పెట్టుకుంటే వాడు ఈ కార్యక్రమాన్ని అంతా మళ్ళీ మొదటినుంచీ మొదలెడతాడు. అలాఅయితే మీకే చాలానష్టం మరి. బాగా ఆలోచించుకోండి...." అన్నాడు. ❑

524. కాలు విరిగి హాస్పిటల్లో ఉన్న జోగారావుని పరామర్శించడానికి వెళ్ళాడు కోదండం.

"అసలు ఎలా విరిగింది నీకాలు..?" అడిగాడు కోదండం.

"అరటి తొక్కమీద కాలేసీ...."

"కాలేసి జారి పడ్డావా...? అరెరె... ఎంతపనయిందీ....?"

"జారిపడింది నేను కాదు. అరటి తొక్కమీద కాలేసీ మా ఆవిడ జారిపడింది. నేను దాన్ని చూసి ఫక్కున నవ్వానంతే...!" అంటూ అసలు విషయం చెప్పాడు జోగారావు. ❑

525. ఒకతను బ్యాగ్తో నగల దుకాణానికి వెళ్ళాడు. అక్కడ నగలను చూసి రేటు అడుగుతున్నాడు.

"ఆ నక్లెస్ ఎంత...?

"పాతిక వేలు...."

"అదిగో.... ఆ... నెక్లెస్.....?"

"ముప్పై రెండు వేలు..."

"ఇదిగో .... ఈ చివర నున్న డిజైనింగ్ చెయిన్..."

"అది తొంభై అయిదువేలు..."

"దాని పక్కనున్న డైమండ్ నెక్లెస్ ఎంత...?" చూపించండి..."

"అది చాలా ఖరీదు...."

"డబ్బు ఎంతైనా పర్వాలేదు. ఆ నెక్లెస్ చూపించండి...."

"ముందు మీ బ్యాగ్‌లో ఉన్నది డబ్బా...? లేక రివాల్వరా....? చూపించండి..." అనుమానంగా అడిగాడు అనగల వ్యాపారి. ❑

526. "డాక్టర్..! మీరు నా జబ్బుకి వైద్యం చేయాలి...."

"అలాగే...! ఇంతకూ నీ జబ్బేమిటి...?

"జబ్బుగురించి నేను చెబితే మీరు చేసేదేమిటి...? నేను చెప్పకుండా మీరు కనిపెట్టాలి......"

"అయితే పది నిముషాలు ఆగండి. మా ఫ్రెండ్ వస్తాడు. వాడైతే మీ జబ్బు చెప్పకుండానే వైద్యం చేస్తాడు."

"ఇంతకూ అతనెవరు...?"

"పి.ఎస్.రావ్. పశువుల డాక్టర్...." ❑

527. కొంతమంది కుర్రాళ్ళు వినాయక చవితికి చందాలు పోగుచేశారు. అయితే వాళ్లు ఆ డబ్బులోంచి కొంత తాము తీస్కుని, కొంత దేవుడికి ఖర్చు చేయాలను కున్నారు. కాని తాము ఎంత డబ్బు తీస్కోవాలన్న సమస్య ఎదురైంది వాళ్ళకు.



అందులో ఒకడన్నాడు. "మనం ఒక గీత గీసి కొంత దూరంలో నిలబడదాం. అక్కడ నుండి డబ్బు ముందుకు విసురుదాం. గీతకు అవతల పడ్డది మనకు. ఇవతల పడ్డం దేవుడికి"

వెంటనే రెండో వాడు "పద్ధతి మొత్తం అదేకాని గీతకు ఇవతల పడ్డది మనకు. అవతల పడ్డది దేవుడికి తీస్కుందాం..." అన్నాడు.

ఈ రెండు పద్ధతుల్లో మొదటిది కొంతమందికి నచ్చలేదు. రెండోది కొంత మందికి నచ్చలేదు.

అందరూ ఐదు నిమిషాలు మౌనంగా ఉండిపోయారు. అప్పుడొకడన్నాడు. "నేను బాగా ఆలోచించాను. మన దగ్గరున్న డబ్బుమొత్తం పైకి విసురుదాం. పైది దేవుడికి కింద పడ్డది మనకి..."

అంతే....! మూడో పద్ధతి అందరికీ నచ్చింది. సరేనన్నారు. ❑

528. అంటెండరు సుబారావు మేనేజర్ దగ్గరకెళ్ళి

"సార్......! నిన్న మధ్యాహ్నం మన గుమస్తా గోవిదం పనిమానేసి టేబుల్‌మీద పడుకొని నిదురపోయాడండీ..!"అన్నాడు.

"మరి వెంటనే వచ్చి నాతో ఎందుకు చెప్పలేదు...?" కోపంగా అడిగా మేనేజర్.

"చెబుదామనే వచ్చానుసార్..! ఆ సమయానికి మీరు నిద పోతున్నారు..." వినయంగా చెప్పాడు సుబ్బారావ్. ❑

529. ఓ ప్రముఖ చిత్రకారుడు తన డ్రాయింగ్ రూంలో కూర్చొ పెయింటింగ్ చేసుకుంటున్నాడు. అంతలో తన గ్లర్‌ఫ్రెండ్ రోజ వచ్చింది.

"నీవు అలా స్టూల్ మీద కూర్చుటే నీ బొమ్మగీస్తాను. సరేనా...' అన్నాడు.

పెయింటర్ రోజాతో సరేనంది రోజా.

రోజాను ఓ స్టూల్ మీద కూర్చోబెట్టి పెయింటింగ్ వేయసాగాడు పెయింటర్. కాసేపటి తర్వాత "రోజా...! నిన్ను ఈ ఏంగిల్‌లో చూస్తుంటే సరదాగా ఓ సారి నీ బొడ్లో వేలు పెట్టి తిప్పాలనుంది..." అన్నాడు.

"ఛీ... నాకు సిగ్గుబాబూ..! అయినా ఇదేం పాడు కోరిక..." అంది రోజా సిగ్గుగా.

"నాకు అలా చేయాలని పించింది. ఇక తప్పదు. పోనీ నీకంత సిగ్గుగా ఉంటే నువ్వు కళ్ళుమూసుకో నేనొకసారి వేలు పెట్టుకుంటాను..." అన్నాడు పెయింటర్. తప్పని సరి పరిస్థితుల్లో సరే అంది రోజా. కళ్ళుమూసుకుంది.

ఓ అయిదు నిముషాల తర్వాత "అయ్యయ్యో...! నువ్వు వేలు పెట్టింది నా బొడ్లోకాదు...." అంది.

"కంగారుపడకు. నేపెట్టింది వేలుకాదు...." అన్నాడు నెమ్మదిగా పెయింటర్. ❑

530. "పొద్దున మా ఆవిడకూ నాకూ చాల పెద్దగొడవ జరిగిపోయిందిరా..! నేనైతే చితక్కొట్టేశాను...." అన్నాడు చిన్నారావ్.

"ఐబాబోయ్..! మీ ఆవిడనే..?" అడిగాడు అన్నారావు.

"కాదు... వంటగదిలో సామాన్లని...."చెప్పాడు చిన్నారావ్. ❑

531. జూలో పనిచేసే జోజిబాబు భార్య పక్కింటావిడతో అంటోంది.

"మా వారు సింహం బోనులోకి చాలా ధైర్యంగా వెళ్ళిరాగలరు......"

"హమ్మో..! ఆయనకు సింహం అంటే భయం లేదా..?

"ఎందుకుండదు....? ఆయన వెళ్లేది బోనులో సింహం లేనప్పుడు..."

532. "ఏవయ్యా...! రాంబాబు మీ నాన్నగారు చనిపోతూ మీకు ఏం అప్పచెప్పారు..?"

"మా అన్నయ్యకు లక్షరూపాయలు, నాకు డభ్భై అయిదువేలు, మా తమ్ముడికి యాభైవేలు..."

"అయితే ఫర్వాలేదు. ఇంతకూ ఆస్థిరూపంలోనా? డబ్బురూపంలోనా?"

"అప్పుల రూపంలో..." ❑

533. "సార్...! ధర్మం చేయండి సార్..!" అన్నాడు ముష్టివాడు.

"ఛ.. ఇలా అడ్డుకోవడానికి సిగ్గులేదూ..? నాతో మా యింటికిరా...! పని చేసుకో. రోజూ పాతిక రూపాయలిస్తాను...." అన్నాడు జోగేశ్వర్.

"మీరే నాతో వచ్చి సాయంత్రం దాకా తిరగండి. రోజూ యాభై రూపాయలిస్తాను..." అన్నాడు ముష్టివాడు. ❑

534. ఓ వ్యక్తి ఇన్‌స్పెక్టర్ దగ్గరకొచ్చాడు.

"సార్..! సరిగ్గా నెలరోజుల క్రిందట కొంకాపల్లి నడిరోడ్డు మీద రాత్రి సమయంలో ఓ వ్యక్తిని దారుణంగా హత్యచేశారు. ఆ హంతకుల్ని మీరు కనిపెట్టాలి."

"నెలరోజుల క్రిందుట జరిగిన హత్యకు కంప్లైట్ ఇప్పుడా ఇచ్చేది...?

"ఎవరూ కంప్లైట్ ఇవ్వలేదని ఇప్పుడే తెలిసింది సార్..!"

"ఇంతకూ హత్య చేయబడిందెవరు..?"

"నేనే సార్..!" ❑

535. భజగోవిందం ఓ లేడీ సైకియాట్రిస్ట్ దగ్గరకెళ్ళాడు.

"డాక్టర్..! నాకు ఆడాళ్ళంతా రక రకాలుగా కన్పిస్తున్నారు. కొంతమ జాకిట్టు వేసుకోనట్లు కొంతమంది చీరకట్టుకోనట్లు కన్పిస్తున్నా అన్నాడు.

లేడీ డాక్టర్ కంగారుగా చీర సర్దుకొని "నేను బా కన్పిస్తున్నానా...?" అంది.

"అదేమిటీ..? మీరసలు బట్టలే కట్టుకోలేదుగా..." అన్నా భజగోవిందం.

536. ఇద్దరు మిత్రులు గొప్పలు చెప్పుకుంటున్నారు.

"నేను కిందున్న నీటిలో చూసి ఆకశంలో ఎగిరే పక్షిని కొట్టగలను అది ఒకే ఒక్క దెబ్బకు చచ్చి కింద పడుతుంది. " అన్నాడు మొదటివాడు.

"అదేపని నేనూ చేయగలను. ఆ పక్షి చచ్చాక కూడా ఆకశంలో ఎగురుతూనే ఉంటుంది.." అన్నాడు రెండోవాడు. ❑

537. మాస్టారు విద్యార్థికి తన రెండు చేతులూ చూపించి



"ఇవి ఎన్ని వ్రేళ్ళు..?"అనడిగాడు.
"మొత్తం పది...." చెప్పాడు విద్యార్థి.
"వీటిలో ఐదు తీసేస్తే...."
"ఒక వ్రేళ్ళున్న చేయి, ఓ మొండి చెయ్య ఉంటాయి...." అన్నాడు విద్యార్థి. ❑

538. కిరాణా కొట్టు సూరిపండు దగ్గరకెళ్ళి అడిగింది నాగమణి.



"నేను మా చిన్నాగాణ్ణి పంపించి కేజీ పంచదార ఇమ్మంటే కేజీకి డబ్బులు తీసుకొని అరకేజీ మాత్రమే ఇచ్చావేం...?
"నేను కేజీ సరిగ్గానే ఇచ్చానమ్మా...? మీ చిన్నాగాణ్ణి ఓసారి తూకం వేస్తే ఆ అరకేజి ఏమైందో తెలసిపోతుంది..." అన్నాడు తెలివిగా సూరిపండు. ❑

539. తన ఎనిమిదేళ్ళ కొడుకు బాబీని తీసుకొని బంధువులింటికి వెళ్ళాడు రాజబాబు.
భోజనాలు జరుగుతున్నాయి. బాబిగాడికి టేబుల్‌మీద బాగా వేయించిన రెండు చేపముక్కలు కనిపంచాయి. వాటిలో బాగా పెద్దముక్క తీసుకొని తన ప్లేట్లో వేసుకున్నాడు.
"ఓరేయ్...! అలా పెద్దది ఏరి వేసుకోవడం మంచిదేనా..?" కోపంగా అడిగాడు రాజబాబు.
బాబిగాడు మాట్లాడలేదు.

"నేనే నీస్థానంలో ఉంటే ఏం చేసేవాడినో తెలుసా...? అందులో చిన్నముక్క తీసుకొనేవాడిని..." అన్నాడు రాజబాబు గర్వంగా.

"ఇప్పుడు నీకెలాగూ చిన్నదే వచ్చిందిగా.... ఇంకా కోపడతా వెందుకు...?" చిరాగ్గా అడిగాడు బాబిగాడు.. ❑

540. ఇద్దరు మందు బాబులు ఫుల్‌గా త్రాగేసి కార్లో వెళుతున్నారు.

"అరరె..! బ్రిడ్జిచివరి కొచ్చేశాం కాస్త స్పీడు తగ్గించి కుడివేపుకి తిప్పు లేకపోతే కాలువలో పడిపోతాం..." అన్నాడొకడు.

"అదేంటి..? కారునువ్వు నడుపుతున్నావ్...! నన్ను తిప్పమంటావేంటి...?" అని రెండోవాడు అనేలోగా కారు కాలువలో పడిపోయింది. ❑

541. హత్యజరిగిన ప్రదేశానికి నువ్వు ఎంతదూరంలో ఉన్నావ్..?" అడిగాడు లాయర్.

"సరిగ్గా పదడుగుల తొమ్మిది అంగుళాలు.."

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవ్.....?"

"మీరు ఇలా అర్థం లేని ప్రశ్నలడుగుతారని తెలిసి ము‹ కొలిచాను లెండి.." ❑

542. ఓ పెద్ద స్వామీజీ భక్తుల కోరిక మీద భట్నవిల్లి గ్రామం విచ్చేశాడు. రోజు ఉదయం నుండి సాయంత్రం వరకూ భక్తులకు ముక్తి మా‹ భోదించి సాయంత్రం విశ్రాంతి సమయంలో ఓ భక్తుడు వచ్చి ఇవ్వబోయాడు.

"ఓం నారాయణా...! నేను టీ త్రాగను నాయనా..!" అన్నాడు స్వామీజ.

"పోనీ కాఫీ తీసుకురమ్మంటారా స్వామీ...!"

"ఓం నారాయణా..! నేను కాఫీ కూడా త్రాగను నాయనా..!"

"అయితే ఏమైనా పండ్లు తీసుకు రమ్మంటారా స్వామీ..?

"ఓం నారాయణా..! ఇంకా అవేమీ భుజించను నాయనా..!"

"స్వామీ...మరి.. మరీ... పోనీ స్కాచ్, విస్కీ, నీళ్లు తెమ్మంటారా..?"

"ఓం నారాయణా..! నీళ్ళు వద్దు నాయనా..!" ❑

543. ఇద్దరు వ్యక్తులు తలకు, చేతులకు బాండేజీ కట్లతో కోర్టు బోనులో నిలబడ్డారు.

"ఇంత చిన్న చిన్న విషయాలకు కూడా కోర్టుకు రావాలా..? మీలో మీరు పరిష్కరించుకోలేరూ..?" కోపంగా అడిగాడు జడ్జి.

"మేమిద్దరమూ చేస్తునదదే సార్..! అనవసరంగా పోలీసులొచ్చి జోక్యం చేసుకున్నారు. లేకపోతే నా సామిరంగా ఎప్పుడో మా సమస్య తేలిపోయేది.." అన్నాడొకడు.. ❑

544. ఓ అమాయకపు కుర్రాడికి ఓ వందరూపాయలు దొరికాయి. అవి ఎక్కడ దాచాలో వాడికి అర్థం కాలేదు. చివరికి బాగా ఆలోచించుకొని ఓ గోడకు కన్నం పెట్టి దాంట్లో వందరూపాయలు పెట్టి పూడ్చి దానిమీద "ఇక్కడ వందరూపాయలు లేవు అని వ్రాసాడు.

మరుసటి రోజు వచ్చి అక్కడ చూస్తే దానిమీద ఇలా రాసి ఉంది.

"నువ్వు రాసింది నిజమే..! ఇక్కడ వందరూపాయలు లేవు. నేను కూడా వాటిని తీయలేదు....." ❑

545. "మా వారికి రాజమండ్రి ట్రాన్స్‌ఫర్ అయింది. వెళ్ళిపోతున్నాం. " అంది ఒకావిడ పక్కింటావిడతో.

"అలాగా...! ఎక్కడుంటారు..?" అంది పక్కింటావిడ.

"రైల్వేస్టేషన్ దగ్గర్లోనే ఇల్లట. రైళ్ళ కూతలతో ఎలాగో, ఏమిటో బాబూ..! అంది మొదటామె దిగులుగా.

"అయ్యోపాపం.. అయినా ఓ నెలరోజులంటే ఆ శబ్దానికి అలవాటు పడిపోతారు.."

"అందుకే మావారికి సలహా చెప్పానులెండి. ఓ నెలరోజులు దూరంగా ఎక్కడైనా హోటల్లో ఉండి తర్వాత ఇంటి కెళ్దామని." ❑

546. ఓ పిసినారి మంచం మీద చావడానికి సిద్ధంగా ఉన్నాడు. ఘడియో, అరఘడియో అన్నట్లున్న ఆ పిసినారి నోట్లో తులసి తీర్థం కూడా పోసేశారు కొడుకులు.

"నాయనా..! పెద్దోడా..?" పిలిచాడు పిసినారి.

"ఏమిటి నాన్నా..! " అడిగాడు కొడుకు ఆదుర్దాగా.

"ఎక్కడున్నావురా...? నీ తల దగ్గర నాన్నా..!"

"మరి మీ అమ్మ...?"

"మీ పక్కనే ఉంది నాన్న...!"

"మరి చిన్నోడు..?"

"మీ కాళ్ళ దగ్గర కూర్చున్నాడు నాన్నా...!"

"ఓరి బడుద్దాయిలూ ..! మరి మన కిరాణా కొట్లో ఎవరున్నార్రా..?"

547. ఓ ప్రముఖ తెలుగు దిన పత్రిక కార్యాలయానికి ఇలా బోర్డు వ్రేలాడుదీశారు.

"తెలుగు ప్రజల్లో మూడొంతుల మంది మా ప్రతికనే చదువుతారు...'
'

మర్నాడు ఎవరో దాని కింద ఇలా రాశారు...

"పాపం..! మిగతా ఒక్కవంతు మంది కొంటారు..."

548. "సార్! సార్! మన టైపిస్టు విమల అస్తమానం జోగుతూ, గుమస్తా గుర్నాధం గారి మీద వాలుతూ నిద్రపోతోంది..." అన్నాడు ప్యూన్.

"అలాగా..! రేపట్నుండి నాసీటు గుర్నాధం గారి సీట్లోకి మార్చు" అన్నాడు మేనేజర్.

549. ఇద్దరు ప్రేయసీ ప్రియులు సాయంత్రం సమయంలో హైదరాబాద్ ఇందిరా పార్క్‌లో ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగిపోయారు.



"పొద్దుపోయింది చీకటి పడుతోంది. నువ్వు ఇక ఇంటికి వెళ్ళిపో..." అన్నాడు ప్రియుడు.

"వెళ్ళిపోనా..?" గోముగా అడిగింది ప్రేయసి.

"ఊ..... త్వరగా వెళ్లు....."

"ఆహా...నిజ్జంగా వెళ్లపోనా....?" మళ్ళగ ముగా అంది ప్రేయసి.

"ఊఁ.."

"నిజంగానే నువ్వు నన్ను వెళ్ళిపొమ్మంటున్నావా...?"

"ఊఁ.... నిజంగానే.."

"ఏమిటి డార్లింగ్..! అంటూ మళ్ళీ వాటేసుకుంది ప్రేయసి.

"ఏమిటిది? చెబితే నీక్కాధూ...! త్వరగా వెళ్ళు..." కసురుకున్నాడు ప్రియుడు.

"ఏమిటీ...! మరీ అలా కసురుకుంటున్నావు..?"

"లేకపోతే ఏం చేయమంటావ్..? ఇందాకట్నుంచి నీ హైహీల్సు చెప్పులతో నాకాళ్ళను పచ్చడి చేసేస్తుంటే... ❑

550. ఒక బాగా ధనవంతుడైన సినిమా హీరో కొడుకును స్కూల్లో తెలుగు మాస్టారు 'పేద కుటంబం' మీద వ్యాసం రాసి తీసుకు రమ్మన్నారు. ఆ అబ్బాయి ఇలా మొదలెట్టాడు.

"అనగనగా ఓ బీద కుటుంబం. ఆ కుటుంబంలో తండ్రి చాలా పేదవాడు, తల్లికూడా పేదది. పిల్లలూ అంతే...! వాళ్ళ తోటమాలీ, వాళ్ళ వంటవాడూ, వాళ్ళ కారు డ్రైవరూ అందరూ పేదవాళ్లే. వాళ్ళింట్లో పనిచేసే నైఖర్లిద్దరూ కూడా చాలా పేదవాళ్ళే! ఒక రోజు పాపం వాళ్ళు తినడానికి కోడి పలావు కూడా దొరక్క ఆకలితో కార్లో వెళ్తుండగా....



551. అది శివా ఎలక్ట్రానిక్స్ షాపు ఎలక్ట్రానిక్స్ ఇంజనీరు శ్రీనివాస్ అప్పుడే నవరత్న బుక్‌సెంటర్ వారి జోక్స్ వరల్డ్ పుస్తకం లోని జోక్స్ అక్కడ కూర్చొన్న ఫ్రెండ్స్ అందరికీ చదివి వినిపించి పడీ పడీ నవ్వసాగాడు. ఫ్రెండ్స్ కూడా పడీ పడీ నవ్వసాగారు. అంతలో అక్కడకు మరి కొంద మంది వచ్చారు. ఆ పుస్తకం తెరచి ఓ వ్యక్తి జోకులు చదవడం

మొదలెట్టాడు వాళ్లు పడీ పడీ నవ్వసాగారు. అలా ఊరూ, మండలం, జిల్లా మొత్తం రాష్ట్రమే నవరత్నవారి జోక్స్ వరల్డ్ పుస్తకం చదవడంతో నవ్వుల మయమైపోయింది.

సరిగ్గా ఆరు నెలల తర్వాత నవ్వడం ఆపుచేసిన శ్రీనివాస్ అడిగాడు. "ఓరేయ్..! గుత్తుల శ్రీనివాసరావ్..! ఇంత అద్భుతంగా హాస్యపుస్తకం ఎలా వ్రాయగలిగావు..?"

"045 రేనాల్డ్స్ పెన్‌తో..." చెప్పాడు రచయిత గుత్తుల శ్రీనివాసరావు. ❑

52. రమా..! నిన్న సాయంత్రం నేను సినిమా కెళ్ళానే..."

"ఎలా ఉంది.....?

"సినిమా బాగానే ఉంది కాని, సినిమా పూర్తయ్యేసరికి ఎనిమి సీట్లు మారాను."

"ఎందుకని...? తుంటరి అబ్బాయిలెవరైనా నడుంమీద చేయివేసి నొక్కడం, చీరపట్టుకుని లాగడం లాంటి కొంటెచేష్టలు ఏమైనా చేశారా..?

"ఆ... చేశారు. ఆఖరు సీట్లోకి మారాక... [

53. ఓ అమెరికన్ టూరిస్ట్ కోనసీమ వచ్చాడు. ఉప్పాడి గ్రామ రంగనాయుడు బొండాం షాపుకెళ్ళి ఓ కొబ్బరి బొండాం త్రాగి "రేటెంత...?" అనడిగాడు.

"రెండొందలు...." చెప్పాడు రంగనాయుడు.

"వాట్ ...,! ఒక్క కొబ్బరిబొండాం రెండొందలా...? అంతరేటేమిటి..? పైగా ఇక్కడ కొబ్బరిబొండాలు ఎక్కువే దొరుకుతాయనుకుంటానే..! అన్నాడు టూరిస్ట్.

'ఔనండీ..! కొబ్బరిబొండాలు ఎక్కువగానే దొరుకుతాయి. కాని అమెరికన్ టూరిస్టులు ఎప్పుడోకాని దొరకరు..." అసలు విషయం చెప్పాడు రంగనాయుడు. ❑

554. థియేటర్లో ఓ సినిమా చూస్తూ కూర్చుంది రామలక్ష్మి.
అంతలో ఒకావిడ వచ్చి రామలక్ష్మి పక్కసీటు ఖాళీగా ఉండడం చూసి "ఏవండీ...! ఈ సీట్లో కూర్చోవచ్చా...?" అంది.
"ఫర్వాలేదు కూర్చోండి. ఈ సీటు మా ఆయన కోసం రిజర్వ్‌చేశాను. హాల్లోకి రాగానే ఆయనకు గుండెపోటు మొదలవడంతో హాస్పటల్‌కి వెళ్ళమని పంపించేశాను..." అంటూ భాధగా చెప్పింది రామలక్ష్మి.

555. ఓ వెంగళ్రావ్ హెయిర్ కటింగ్ షాపుకెళ్ళాడు.
బార్బర్ హెయిర్ కట్ చేయసాగాడు. అంతలో ఓ ఊరకుక్కవచ్చి వెంగళ్రావ్ ఛెయిర్ చుట్టూ తిరగసాగింది.
"బాబోయ్....! కొంపదీసి ఈ కుక్క నన్ను కరుస్తుందా?" భయంగా అడిగాడు వెంగళ్రావ్.
"అబ్బే..! అదసలు ఎవర్ని ఏమీ చేయదండీ..! ఎవరివైనా చెవులు తెగి కిందపడితే ఏరుకొని తింటుందంతే...." అన్నాడు బార్బర్.

556. చీరలు కొనడానికి బట్టలు షాపుకెళ్ళింది ఆండాళ్ళు సేల్స్‌మేన్ చీరలు చూపిస్తూ "ఇది డాడీ.. డాడీలో జయసుధ కట్టిన చీర... ఇది చూడాలని ఉందిలో సౌందర్య కట్టిన చీర, ఇది శ్రీమతీ వెళ్లొస్తాలో దేవయాని కట్టిన చీర, ఇది జీన్స్‌లో ఐశ్వర్యారాయ్ కట్టిన చీర..." అంటూ చెప్పుకుపోతున్నాడు.
"ఛ..... ఈషాపులో వాళ్ళూ, వీళ్ళూ కట్టివిడిచిన చీరలుతప్ప కొత్తవేమీ అమ్మరనుకుంటా...." అని గొణుక్కుంటూ బయటకెళ్ళి పోయింది ఆండాళ్లు.

సెలవిప్పటికి



## విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రములు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
101 స్వయం ఉపాధి పథకాలు
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం
పెంపొందించుకోండి
1001 జోక్స్-జోక్స్-జోక్స్
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్

## బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా(2భాగాలు)
" అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
" షేక్స్పియర్ అద్భుతకథలు(3భాగాలు)
" బైబిల్ కథలు (2 భాగాలు)
" సింద్‌బాద్ సాహస యాత్రలు
" రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
" డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
" రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
" రెండు మహానగరాల కథ
" డేవిడ్ కాపర్ ఫీల్డ్
" ఆలివర్ ట్విస్ట్
" రాజు - పేద
" ప్రపంచ అద్భుత కథలు (2భాగాలు)
" పంచ తంత్రం
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" టిప్పుసుల్తాన్
" వీరపాండ్య కట్టబ్రహ్మన

బాలానంద బొమ్మల మర్యాద రామన్న కథలు
" అల్లావుద్దీన్ అద్భుత దీపం
" అలీబాబా 40 దొంగలు
" అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
" భేతాళ కథలు
" తెనాలి రామకృష్ణ కథలు
" పరమానందయ్య కథలు
" భట్టి-విక్రమాదిత్యుల కథలు(2భాగాలు
" అపూర్వ చింతామణి
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" గలివర్ సాహస యాత్రలు
" భగత్‌సింగ్
" బి. ఆర్. అంబేద్కర్
" సుభాష్‌చంద్రబోస్
" అజాద్ చంద్రశేఖర్
" రాజారామమోహనరాయ్
" మదర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాగూర్
" జయప్రకాష్ నారాయణ్
" యోగి వేమన
" పూజ్య బాపూజి
" భగవతీచరణ్